# తంజావూరు పతనము








1965



ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు

# తంజావూరు పతనము

(చరిత్ర విషయకమైన నవలల పోటీలో 1952 సంవత్సరము రచనలలో
బహుమానము పొందిన గ్రంథము)

మల్లాది వసుంధర




ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచే ప్రకటితము

1965

వెల రు. 2-25

కొన్ని చరిత్ర విషయకములయిన నవలలను, శాస్త్రగ్రంథములను, యాత్రాగ్రంథములను రచయితలు వ్రాయునట్లు ప్రోత్సహించి యట్లు వ్రాయఁబడిన వానిలో నుత్తమమైనదానికి 1,000 రూపాయిలు బహుమానము నీయవలసిన దను విశ్వకళాపరిషత్తువారి యాదేశము ననుసరించి 1952 వ సంవత్సరములోని రచనలలో నుత్తమ మని పరీక్షకులచే నంగీకరింపఁబడినది.

[A. U. P. Waltair] [AAA4/Pub./65 (11-6-65) 10,000]

# 3

# తంజావూరు పతనము

౧

శారదసంధ్య. సహ్యజానదీనీరములు స్వచ్ఛములు స్వాదుతా పూర్ణములగ నున్నవి. నదిలో నిడుకెలఁకుల నిసుక దిబ్బలుపెట్టినది. మధ్యగఁ బ్రవాహమున్నది. ఒకానొక నాట్యకత్తియ బంగరుజరీ కాసెబిగించి నీలిపలిపవుఁ బైటవేసి నృత్యముఁజేయుటకు సింగారించుకొనుచున్నట్లున్నది. ఆకసమున నొకపంకఁ దెలిమొయిలొకండు దోచి సహ్యజలోఁ బ్రతిబింబించినది. ఆ తెల్లఁదనము సహ్యజమొగమున నద్దికొనిన పుప్పొడివలెఁ దోచినది. అస్తమయోన్ముఖ భానుబింబ సాంధ్యరాగకిరణచ్ఛటాపాళి యామెమొగమునఁ గుంకుమరేఖల దిద్దుచున్నది. చిరుగాలి తరగలతాకిడిచేనైన తరంగసంచలనము, తత్సంచలనవశమునఁ గించిద్భయ సమన్వితములై తరంగములపైకిఁ దలల నెత్తి నిక్కినిక్కి చూచు మీనముల మిలమిల సొగసులు నాట్యాంతవేళావిలాస నర్తకీనేత్రచాలనముల ననుకరించుచున్నవి. కించిత్సంధ్యాకాలరక్తిమ యామె యరుణాధర తాంబూలరక్తిమవలెనున్నది. పాండువర్ణమిశ్రితరాగ సంధ్యాశరన్మేఘశకలములు వాయుధూతములగుచు సహ్యజానదీ స్వచ్ఛవారిపూరమునఁ బ్రతిఫలించి చక్రభ్రమణవేళఁ బాదములమీఁదికిఁ జీరాడుచు ముద్దువెట్టిన ట్లంటియుసంటని విధమున గాలికిరేగి చిందులువేయు పరికిణీకుచ్చెలల మెఱుపుఁ దనముగను, నీలిపలిపవుఁబైట యరుణాంచలము వలెను భాసిల్లుచున్నవి. అంతరిక్షముననుండిన యొకానొక చిన్ని నీలిమబ్బు తునుక సహ్యజదాల్చిన నీలిరాముక్కరవలె శోభిల్లినది. నదీతీరమున మెట్లకిరుప్రక్కల ఘనోన్నత వృక్షములు రెండుగలవు. అవి రెండును పత్ర ఉపరిభాగముమీదుగ నిరువైపుల వ్రేలాడు రెండుజడలవలె భాసించి సహ్యజ పాంచాలసుందరివలెఁ గులుకుపోయినది.

సహ్యజ నానుకొని యారామమొకఁ డున్నది. అది విశాలముగ నుండును. పెద్దిదాసు మహాభక్తిప్రపత్తులతో శ్రీ రాజగోపాలస్వామిని

ధ్యానించి నిచ్చలు నర్చించి సేవించు నిమిత్తము ఫలపత్ర సుమశోభితముగ దానిని రచించుకొనెను. అది తటినీకటమున నరమైలు దూరము వ్యాపించి యున్నది. తోటకుఁ జుట్టునుఁ గొబ్బరిచెట్ల బారులు తీరియున్నవి. రెండవ వరుసఁ దోటకొకవంకఁ బనస, నారింజ, నిమ్మ, దబ్బలు. వేరొకపార్శ్వమున నేరేడు, మారేడు, వెలగలు నున్నవి. నాల్గవ వరుస సంపంగి, పొగడ, పొన్న, నాగలింగము లున్నవి. తోటను దక్షిణభాగమునఁ బటీరవృక్షములు, రసాలతరువులును గుంపులు గుంపులుగఁ బెరిగినవి. తూర్పుదెస నొకపెద్ద శాల్మలీవృక్షమున్నది. అది శాఖలు విస్తరించి పెనుభూతమువలె నుండును. ఈ వరుసల యంతర్భాగమున ద్రాక్షతీగలచే నల్లిబిల్లిగ నల్లుకొనఁబడి యెత్తుగ నెండచొరరానట్లున్న చిన్నపర్ణశాల గలదు. దానివాకిలి కిరుపైపులఁ బారిజాత తరువులు. వెనుకభాగమున మందారము లున్నవి. పర్ణశాల కిరుపైపుల మల్లె, జాజి, గోరంట, చేమంతి, మాలతి, మాధవి ప్రాకినవి. కుటీరమునకుఁ గొంతదూరమున వివిధ లతలు నల్లుకొని హృదయాభిరామముగనున్న యొక లతామంటపము. ఆ మంటపము చుట్టునుఁ బలురకముల తులసిమొక్కలు, మరువము మొదలైన సూనరహితామోదభరిత గుల్మములు గలవు. మంటపమున కెదురుగఁ జతుష్కోణముగ నిటికలతోఁ గట్టబడి సున్నముచేసి యుంచిన క్రీడాసరస్సునుఁ బోలిన యొక కేళకుళి గలదు. అది నిరంతరము సహ్యజానీత నవనీరములతో సుందరముగ నుండును. సరస్తీరముమీఁదఁ జుట్టును మట్టిగోలెములలో నుంచిన పూలమొక్కలు గలవు. సరస్సున నీటి మధ్యమున నొకదిమ్మపై రాజగోపాల నామాంకితుఁడైన బాలమురళీకృష్ణుని ముద్దులుమూటగట్టియిచ్చు చలువరాతి విగ్రహ మొకఁడుండెను. ఆ విగ్రహము వేణువుఁజేబూని యూదుచున్నట్లున్నది. కేశముల విరియఁబోసికొని శిరోగ్ర భాగమున నవచూడముగ సమర్చిన శిఖిపింఛముతో నొప్పులు గులుకుచున్నది. కంఠమునఁ దులసి, మరువము, మందారము, పారిజాతములఁ గలిపి యల్లిన మాలికలు గలవు. పొగడదండ యొకటి పింఛమూలమున నమర్పఁబడినది. దివసావసాన సందీప్తాస్తమయారుణ విభాకరజరఠాతపకాంతు లా కృష్ణ స్వామికిఁ గర్పూర నీరాంజనము లెత్తినట్లున్నవి. సాయంసంధ్యారుణచ్ఛవి కేళకుళి యందలి నీటిమీఁదఁ బ్రసరించి పవనాహతమై ప్రాకులాడుచున్న

ట్లుండెను. అస్తాచలాలింగనాసక్త లోకబాంధవ ధవళారుణాంశుమాలావినిస్రుత నారిత్రీక్షితపచ్ఛటలు కృష్ణదేవుని చలువవిగ్రహపుఁ బాదమునవ్రాలి క్రమక్రమముగ శిరోదేశ పర్యంతమేగి, వినువీధి విహరించు దేవకాంతలు కృష్ణుఁడు తమదరికి రాకపోయెనుగదా యను కోపముచే నీర్ష్యాకషాయితములగు చూపులఁ దమరజ్జలరేఖలు దీర్చిన కనుతుదలనుండి చూచినట్లున్నది. పతనోన్ముఖ రవిబింబధవళారుణ కదుష్ణఛానుచ్ఛవి తోటయంతట సహస్రధా విచిత్రముగ వెలుగొందినది. పడమటి దిక్కునున్న మొగలిపొదలపైఁ బ్రసరించి, పుప్పొళ్ళనద్దుకొని మొగలిరేకులతో సయ్యాట లాడినది.

శాల్మలి శకుంతముల కాకరము. వాని కలకలారావములు తోట యంతటఁ బ్రతిధ్వనించి పిల్లతెమ్మెరలలోఁ దేలిపోవుచున్నవి. నది కావలి యొడ్డుననున్న కాశపుష్పములు విచ్చి పింజలు పింజలుగఁ గాలికెగసి మొగలి పొదలవఱకు వచ్చి వాని పుప్పొళ్ళఁ దోడుచేసికొని కృష్ణవిగ్రహముయొక్క పాదసీమఁబడి యర్ఘ్యద్రవ్యముల ననుకరించుచుండెను. పాటీర సుగంధమిళిత దక్షిణానిలాంకురములు యథేచ్ఛముగఁ దోటయం దంతటను విహరించు చుండెను.

పర్ణశాల ముంగిట ద్రాక్షతీగకుఁ బ్రోదిసేయుచు, ప్రకృతిరామణీయక దర్శనావిష్టమతి పెద్దిదాసు, పశ్చిమదిక్కాంతాసంగమోత్సాహి ద్యుమణికవోష్ణ తరళారుణ దీధితులఁగాంచి, కాంతాలోలు పత్వముచేఁ గదా యినుఁడుసైతముఁ దనతైక్ష్ణ్యము విడనాడి శాంతత వహించి పతనోన్ముఖుఁ డగుచున్నాడను కొనినాడు. కాని పతనమునకుఁబూర్వ మెంతసుందరముగనున్నాడు! పతన ములోఁగూడ నొక సొగసున్నదా! అంతయున్నతి కింత యవనతి కాబోలు!

ఈరెండ ముడుతలువడిన యాతని విశాలఫాలభాగమును ముద్దువెట్టినది. ఆతని మొగమున వార్ధక్యము పీఠముఁబెట్టి కూర్చుండినను, కన్నులలోఁ దారుణ్యమే భాసించును. ఆయన డెబ్బదియైదు సంవత్సరముల ముదుసలి యయ్యు శరీరదార్ఢ్యము గలవాడు. ప్రకృతి ముద్దుబిడ్డ కుద్దాలముఁ జేబూని, మొక్కలకుఁ గాలువలుదీర్చి, గనిమలపర్చి, మడవలుమార్చి, చిటివరా లేరివైచి, కలుమొక్కలఁ బెరికివైచి, పాదులేర్పరచి, విరిసూటి నారునాటి

యనుదినము ఘటయంత్రక మనోరథ స్వతంత్రుడై యారామముఁ బోషించు కొనును. ఆతనిపోషణలో శలాటువులకు సైతముఁ బక్వతప్రాపించును.

తోటకు దక్షిణభాగమున సహ్యజానదికిఁబోవు మెట్లదారియున్నది. ఆ దారినుండియే నిత్యమును నీరుగొనివచ్చి తోటఁదడుపుట, కేళకుళి నింపుట. మెట్ల కిరుప్రక్కలఁ బున్నాగవృక్షము లున్నవి. కనుచూపు దూరమునఁ బల్లెకారుల పిల్లలు చిట్టితెప్పలమీఁద సహ్యజపై సంచరించుచుఁ గొట్టుకేరింతలు వినిపించుచున్నవి. ప్రదోషమైనది. మసకమసకగఁ జీకటి తిలతండులన్యాయముగ వ్యాపింప మొదలు పెట్టినది. పెద్దిదాసుని యనిమేషదృష్టినుండి తప్పించుకొని పోయిన సూర్యబింబము వేషాంతరమున నతఁడేమిచేయు చున్నాడో చూచెదమని వచ్చినటులఁ జీకటిగానిచీకటి వచ్చినది. మందపవనము సహ్యజానిమేధాజనకముసైన నీరముల నానియు మందమందముగఁ దడబడుచుఁ జెట్టుచెట్టునకు డీకొని యాగుచు సన్నని దీనారావముఁ జేయుచు వచ్చినది. పెద్దిదాసేమో యోజించుచుఁ గృష్ణవిగ్రహము ముందుఁ గూర్చుండి యుండెను. ఆయనవెనుక నేదో కదలాడిన సవ్వడియైనది. ఆకస్మికముగ నాయన వామనేత్రము స్పందించినది. పెద్దిదా సదిరిపడినాడు. చుట్టును గలయఁజూచినాడు. మరల శాంతినందినాడు. చిరువెన్నెల శారదాభ్రశకలముల మాటునఁ దోబూచు లాడుచున్నది. పెద్దిదాసువెనుక నస్పష్టముగ నెవరో మసకమసకగఁ దాటాడిన ట్లనిపించెను. పదియడుగుల దూరమునఁ గాళకవి వచ్చుచున్నట్లు కనిపించెను. తదియనాటి సందెవెన్నెల వనదేవత పెదవుల సందునుండి వెలువడిన కించిన్మందహాసమువలె నున్నది. ఆవెన్నెల కాళకవి దాల్చిన యుష్ణీషమునందలి యరుణాశ్మముఁదాకి యామణి నుద్దీపింపంజేసి మరుక్షణమునఁ జిటిలిపోయినది. రాజగోపాలస్వామి విగ్రహముఁ గౌగలించి జారిపోయినది. కాళకవి పెద్దిదాసునకు నమస్కరించినాడు. పెద్దిదాసు దానినందుకొని యాతనిఁ గౌరవించినాడు. ఇరువురు నటనుండి కదలి మెట్లదారివెంబడి నదిలోనికిఁబోయిరి. నదికిఁ బోవలయునన్న నిసుకలోఁ గొంతమారము నడువవలయును. నదిలో రెండుకొంగ లాగియాగి నీటిలో ముక్కులఁ గ్రుచ్చుచున్నవి. దూరమున చిఱువెన్నెలలు నదీతరంగములమీద నృత్యమాడి ధగధగలాడినవి.

ఇరువురుఁ గాలుసేతులు గడిగికొని నీరు పుక్కిలించి యుమిసి కొంత త్రావి తిరిగి మెట్లెక్కఁ దొడఁగిరి. ఇంకను రెండుమెట్లున్న వనగఁ గాళకవి వెనుకకు రెండడుగులువైచి 'పాము పామని' యఱచినాడు. పెద్దిదాసుని కీమాటలు వినిపించలేదు. పెద్దిదాసు పాదముల నంటియు నంటనట్లుగ నొక తెల్లని త్రాఁచుబాము జరజరఁబ్రాకి గందపుమ్రాకు లున్నదెసకుఁ బోయినది. అది పోయినంతమేరకు సంపఁగితావులు చిమ్మనగ్రోవితోఁ జిమ్మినట్లయినది. కాళకవి పాముఁజూచినాడు. బాలమురళీకృష్ణ పాదారవింద బద్ధచేతస్కుఁడైన పెద్దిదాసు చూడలేదు. వెనుదిరుగలేదు. కాళకవి యనుగమించినాడు.

తదియచంద్రుఁ డస్తమించినాడు. చీకట్లు క్రమ్ముకొని వచ్చుచున్నవి. ముందునడచుచున్న పెద్దిదాసును జూడగనే కాళకవి కా లిప్తలో విచిత్రమగు నొకభావ మొదవినది. "ఈయన మానవాతీతుడా!" ఆతని దేహమంతయు నొక్కసారిగ జలదరించినది. ఆమానసిక ప్రవృత్తి కీదైహిక సంచలనము. పెద్దిదాసనినఁ గాళకవికి గౌరవము మెండు. కాని యీనాటి యీభావమాయనను గూర్చి కాళకవి యేనాడు ననుభవింపలేదు. ఎందులకో మరల నొకసారి చేయెత్తి నమస్కరించవలె ననుకొనినాడు. ఇరువురును గృష్ణవిగ్రహమున కెదురుగనున్న లతామంటపమున కేగి యటనున్న నాపరాతితిన్నెపైఁ గూర్చుండిరి. కాళకవి కా విగ్రహము జీవవంతము, తోట బృందావనము, సహ్యజ కళిందజగను భాసించి పులకితుఁడైనాడు. ఆతని దృష్టియందుఁ బెద్దిదాసొక మహాతపశ్శాలి.

పెద్దిదాసునకు రాజాస్థానమున గౌరవము జరుగవలెనని, జరిగినఁ దా నానందింపవలెననియు నాయన యభిమతము. సభలో విజయరాఘవ నాయకులవారికిఁ బెద్దిదాసుగుఱించియు, నాయనభక్తి పారవశ్యమును గుఱించియుఁ జెప్పిన దీయనయే. కాళకవి విజయరాఘవ నాయకునికి బాల్య స్నేహితుడు. రాజసభలో నాస్థానకవి. ఈయన రఘునాథనాయకులవారి కాలమున బాలుడు. విజయరాఘవ నాయకులవారికిఁ గాళకవియందుఁ గవిత్వా పేక్షకన్న మిత్రత్వాపేక్షయేమెండు. అందువలన విజయరాఘవ నాయకులవారీ కార్యమున కీయననే నియోగించిరి. కాళకవి హృదయాంతరమునఁ బెద్దిదాసు

రాజసభకు వచ్చుటకు నిరాకరించుసని తెలియును. కాని పెద్దిదాసునం దాయనకుఁగల గౌరవాతిశయ మాయన నెట్లేని రాజసభాగౌరవ సన్మానముల కంగీకరింపఁజేసి యాస్థానపండిత కవీంద్రునిగ నిలుపవలెనని దృఢాభిప్రాయముఁ గలవానినిగఁ జేసినది.

పెద్దిదాసపధూతుడు. అవధీరితాప్త్వైలవాడి. విశిష్టాప్త్వైల ప్రతిష్ఠాపనా బద్ధబుద్ధి. ముండితశిరస్కుఁడనవచ్చును. జ్ఞానచిహ్నముగ గోష్పాదమంత జుట్టున్నది. విశాలఫాలభాగమునఁ దీర్చిదిద్దిన తిరుమణి తిరుచూర్ణములు. ఆయన ముఖమున నాలుగైదుముడతలున్నవి. ఆయన దేహకాంతి మిగులఁ బండిన జామపండుచాయ. ఆయన ధరించినవి శ్వేతనీర్కావిదుస్తులు. ఆయన నెన్నొసట నొకానొక తరళజ్యోతి రేఖామాత్రముగ స్థిరదృష్టిఁ బరిశీలించిన గోచరించును. ఆయన కుటీరములోనికేగి దివ్వెఁ దెచ్చినాడు. ఇరువురు నొకరికొక రెదురెదురుగ నుపవిష్టులైరి. పెద్దిదాసు వచ్చినపనియే మని కాళకవి నడిగినాడు.

కాళకవి : తమ దర్శనముఁజేసి చాలదినములైనది. అందుచే నేడిచ్చటికి వచ్చితిని. ఇచటి యీతోట, యీద్వైపము, యమునా తీరమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. బృందావన మిటులే యుండి యుండెనేమో !

పెద్దిదాసు : దానికేమి, ఆ మన్నారుదేవుని కృపాకటాక్షమున్నచో జీవితమున నింకఁ గోరదగిన దేముండును ? నాజీవితమును మన్నారుదేవుని పాదపూజయందుఁ గైంకర్య మొసర్చుకొనినాను. ఇన్నినాళ్ళు గడచనిన నాజీవిత మిఁకమీఁదటఁగూడ నిట్లేనడచినచో నాకెట్టిచింతయు నుండదు. ముప్పాలిక భాగము గతించియే పోయినది.

కాళకవి : అదేమండీ ! దాసుగారూ ! మీరు మహాభక్తులు. రసజ్ఞులు. కవిశేఖరులు. ఇంత 'విరాగమైననెట్లు ? ఎంతపండితులైనను రాజాదరణ మున్నచోఁ బసిడికిఁ దావియబ్బినట్లుండునుగదా ! మీరు లోకజ్ఞులు. మీకుఁ దెలియని విశేషంబు లుండునా ? విజయరాఘవ నాయకులవారు మిమ్ముల దర్శించుట కుత్సుకులగుచున్నారు. మా కవిబృందమంతయు మీరాక కెదురు చూచుచున్నది. శ్రీమతి రంగాజమ్మగారు మీ ప్రతిభావిశేషములచే నాకృష్టయై మీదర్శనము నపేక్షించుచున్నది.

ఒక విసురుగాలితరగ మెరుపొదలగుండ నీలలు వేయుచు మూసికొని వచ్చి వారిని చపేటములఁ జరచిపోయినది. రంగాజమ్మ యనిసఁ పెద్దిదాసున కదొకవిధమైన భావము. ఆమె యభిలషితమును వినినంతనే, ఆయన నిరాదర సూచకమైన హాసమొనర్చెను.

కాళకవి : మీరు రేపటి సభకు వత్తురని యాశింతును. నాముఖమున విజయరాఘవ నాయకులవారు మిమ్ములను బ్రార్థించుచున్నారు.

ఆయననుండి యెట్టిసమాధానము వచ్చునో యని కాళకవి ప్రతీక్షించు చుండెను.

పెద్దిదాసు : మీరన్యథా భావింపవలదు. నాకు రాజసభా గౌరవములపై వాంఛలేదు. ఇట్లని తిరస్కారముగ నెంచకుడు. నా కీ సదీతటారామమునందు సల్పు భగవదారాధనముదప్ప ........ నా యీ భావమును వేఱొక విధముగ భావించవలదని రాజుగారికి నా విన్నపము. నా జీవితమును యదువంశస్వామి సేవయందే యంకిత మొనర్చినిందు.

కాళకవి : మీరటుల ననినచో నేనేమి చేయఁగలను ? మీకు రాజసభలో జరుగు గౌరవమర్యాదలను గాంచ నామన ముప్విళ్లూరుచున్నది. మీరు మాకెల్ల రకు నేతలైయుందురని గర్వించుచుంటిని. నా చిరవాంఛితము నీనాడు మీకు వెలిబుచ్చితిని. నా యాశలన్నియు నడియాసలేనా ?

అతని కనులు ప్రార్థనాదీనములుగ నున్నవి.

పెద్దిదాసు : మీ ర ట్లనరాదు. రాజసభకు నేను రారాదు. క్షమింప వలయును. లౌకికములైన తుచ్ఛసుఖములకై, గౌరవములకై ప్రాకులాడుట నాకు రుచించదు. శాశ్వత కైవల్య సంపాదనార్థమై యార్చావతారుఁడైన రాజ గోపాలు నుపాసించుచుండుటకన్న నితరమైన సుఖమింకేమి కలదు ? నామన స్సన్యము నొల్లకున్నది.

పెద్దిదాసు స్థిరబుద్ధి కాళకవి కవగతమైనది. ఇఁక నెంతచెప్పినను కార్యము లేదని నిర్ణయించుకొనినాడు. ప్రొద్దు వోవుచున్నది. వెడలుట కనుజ్ఞ వేడినాడు. పెద్దిదాసాయనవెంటఁ దోట బహిర్భాగమువఱకు వచ్చి వెనుదిరిగి నాడు. కాళకవికిఁ బెద్దిదాసునందుఁగల గౌరవము భక్తిరూపముఁ దాల్చుచున్నది.

తోటయంతయు గాఢతిమిరావృతము. కీచురాలనిస్వనము. శర్వరీయువతి కృష్ణాఖిసారికయై ధరించిన బంగరుజరీ బుటేదారు పనిచేసిన నీలివలిపపు మేలుముసుగు వలెఁ దోటలో నంధకారమున ఖద్యోతములు జిగజిగ లాడుచుండెను. ఆరామమంతయు నానాసూనవితాన వాసనలచేఁ బరివ్యాప్తమైనది. పెద్దిదాసు కృష్ణవిగ్రహ సమక్షమునఁ బద్మాసనస్థుడై ధ్యాననిమగ్నుఁడయ్యెను. తోటయంతయు నిశ్శబ్దము. దీపమొక్కటి మాత్రము మిలమిల లాడుచున్నది.

౨

శుక్లచతుర్థి, నాడు రంగాజమ్మగారి యుషాపరిణయ ప్రబంధము విజయరాఘవ నాయకులవారికిఁ గృతియొసర్ప నిశ్చయింపఁబడినది. విజయరాఘవ నాయకులవారు భానూదయా త్పూర్వము నిదుర మేల్కాంచి, యెదుటనున్న నిలువుటద్దమునఁ దన ప్రతిబింబము నీక్షించి, కపిలధేనువులను, పయఃపూర్ణ కనకకుంభములను, బ్రాహ్మణ ద్వయమునుఁజూచి సంతుష్టాంతరంగుఁడై సుందరులైన రమణు లిర్వురు జలము లందీయ మజ్జనమాడి చలువలు ధరించెను. ఆ పిమ్మట మహాభక్తితో నాదిత్యహృదయ మంత్రరాజమును ముమ్మారు పఠించి మన్నారుదేవుని కోవెలచెంగట గురువునానతి శ్రీముద్ర ధరించి రాజగోపాలస్వామిని ధ్యానించుచు ముత్తైపుసరులతో నష్టాక్షరీ జపముఁ జేసెను. భాగవతము, రామచరితము కొంతతడ వాకర్ణించి నిత్యదానములు నిష్ఠగసల్పి బ్రాహ్మణులకుఁ జందనతాంబూలాదుల నొసంగెను.

కొలువుకూటమునకుఁ బోవు వేళయైనది. పరిచారికలు సత్వరముగఁ దమ పనులు సలుపసాగిరి. ఒక చకితనేత్ర నిలువుటద్దముఁ గొనివచ్చినది. మృణాళహస్త యొకర్తుక సంపఁగినూనెఁ జేతులఁ బూసికొని విజయరాఘవులవారి కేశములకు రాచినది. కిసలయాంగుళి యొకతె దంతపు దువ్వెనతోఁ జిక్కు దీయుచున్నది. మెఱుపుఁదీవెలఁ బోలిన యిర్వురు యువతులు కడానితట్టల నాభరణముల నటనుంచి యదృశ్యలైరి. అలంకరణ చాతుర్య నిష్ణాతయగు నొక నీలాలక విజయరాఘవప్రభువు నలంకరించఁ బొడగినది. సంపఁగి సుమములతో రచించిన మాలిక శిరమునఁ జుట్టి సుప్పాణిముత్యముల కుళ్లాయిఁ బెట్టినది. ఆయన కెదురుగ బొక్కసములవారు నిలిచియుండిరి. ముత్యపు

చౌకట్టులు ధరించి బంగరు చుంగులుగల పట్టుపీతాంబరములను, ముత్తియముల నెక్కువగఁ దాపిన బవిరిచెక్కడపుఁ బచ్చలపదకంబును, తళుకులీను వజ్రముల యుత్తరిగెను, వజ్రాల చేసరులను, కెంపులుదాపిన మెఱుపు కడియములను మణికట్టుల నుంచెను. నాయకుఁడు నవరత్న ఖచితములైన బాహాపురులను నూత్న రత్నాంగుళీయములను దాల్చెను. మురువైన సాహిత్యరాయ పెండారముఁ జరణమునఁ దొడిగి కొలువు శృంగారముఁ బూర్తిగావించి సభా భవనమునకుఁ బయలుదేరినాడు.

ప్రాతస్సంధ్యారుణిత బాలభాస్కర భానుద్యుతి హజారము శిఖరాగ్రముల నున్న కాంచన కలశములపై కెగఁబ్రాకి మెఱుఁగులు దిద్దుచున్నది. సభా ముఖ ద్వారము చిత్రచిత్రములైన చెక్కడములతో నలరారుచున్నది. కాశ్మీరదేశపు రత్నకంబళములు లోనఁ బరువఁబడి వానిపై వరుసగ సోఫాలు, ఉన్నతాసనములు సమర్చఁబడినవి. సభాసదనము పట్టాభిరాముని భావచిత్రపుఁ బంగారు చెక్కడపుఁ జప్పరమునుగలిగి నీలిచాయల నీడలు దేరుచు నల్లచలువరాలతోఁ జాల విశాలముగ నిర్మింపఁబడి రెండవ పుష్పక విమానమన నొప్పియున్నది. కూటమునఁ బశ్చిమభాగమున విజయరాఘవ నాయకులవారి మణిమయ సువర్ణ సింహాసనమున్నది. సింహాసనమునకు దిగువభాగమున నష్టాపదపాద పీఠమొండమర్పఁబడియున్నది. సింహపీఠి కిరువంకల సమాన రూపములుగల మరి రెండు బాలాసనములున్నవి. వామభాగమున నాతిదూరముగ నొక సుందరమైన రజతాసనమున్నది. దానియందు రంగాజమ్మ యుపవిష్టయైనది. సింహాసనము నుండి మెట్లకుఁ గ్రిందిభాగమునఁ దక్షిణ పార్శ్వమున నైదు రజతాసనములున్నవి. అందు ప్రథమాసనముపై రాజగురువులైన శతక్రతు చతుర్వేది శ్రీనివాస తాతాచార్యులవారును, పట్టంపు కవియైన కామరుసు సోమయాజులుగారు రెండవదానిమీదను, తరువాత తారహారరుచిరత్న కంకణోదార తారానురూప ముక్తాకలాప హృద్యతరబిరుద వాద్య నానావాహనాది సమ్మాన మాననీయ శాశ్వతైశ్వర్యధుర్యుం డగు కోనేటి దీక్షితకవి చంద్రుఁడును, పురుషోత్తమ దీక్షిత మహాకవియు, చతుర్విధ కవితా విశారద కాళకవిశేఖరుఁడును వరుసగ నధివసించిరి. మంత్రిసామంత దండనాథులును నానాదేశములనుండి వచ్చిన

రాయబారులును, కరణములు, సంప్రతి కరణములును వామదిక్కునందుఁ గల యథోచిత స్థానములం దుపవిష్టులైరి.

సింహాసనమునకు ప్రాగ్భాగమున నర్ధచంద్రాకృతిగ శశికాంతో పలములతో నిర్మింపఁబడిన నాట్యరంగమున్నది. నాట్యరంగమునకు వెనుక తట్టున నున్న కుడ్యముపై మహేంద్రసభ, రంభోర్వశీ మేనకా ద్యప్సరో నృత్య భంగిమములును దైవ్యవర్ణకములుగఁ జిత్రింపఁబడినవి. సింహాసనముమ్రోల శారదా ధ్వజము గలదు. అది శర్కరామిశ్రిత స్వచ్ఛ వారిపూరమువలె మధురముగను, సాయంవికసిత నవమల్లికవలెఁ బరిమళభరితముగను, ప్రాతర్మందానిలమువలె శీతలముగను, శరద్రాకాకళాధరస్నిగ్ధ సుధాంశుమాలవలె నిరతిశయాహ్లాద కారియునై సర్వలక్షణ సంపన్నమైనకవిత, యొక్క విజయరాఘవ నాయకుల వారికే గలదను కీర్తిని సూచించుచు వెలుగొందును. 'పద్యము నవనవోన్మేషమై వెలయవలెను. వాక్యవైఖరు లలంకారానుసారులు గావలయును. శబ్దము పాణినీయ వ్యాకరణ ప్రామాణ్యమై యుండవలయును. కవితా సందర్భము కర్పూరమువలె సత్వరము గుబాళింపవలెను.' అని శారదాధ్వజమున వ్రాయఁబడి యుండెను.

అంత శంఖభేరీకాహళ మృదంగవాద్య సమ్మిశ్రితధ్వని తరంగములు వీనుల విందొనర్ప, వేత్రహస్తులు పైడిబెత్తముల జనసమూహముల నదలింప, హయారూఢులై మన్నీలు వెంటనంటిరా భద్రగజాధిరూఢుఁడై, దాసజనంబు స్వర్ణమౌక్తిక ఛత్రచామరముల సేవించుచుండ నవనీసురజ్యేష్ఠులు వేదోక్తాశీర్వాదముల సేసలుచల్ల మహీసురపురంధ్రీ గణమందస్మితవదనారవిందముల నుండి వెలువడు మంగళాశీస్సుల నందుకొని, కటాక్షవీక్షణమాత్రమునఁ బౌరజనంబులఁ బరామర్శించుచు విజయరాఘవనాయకులవారు కొలువుకూటము నొద్దకువచ్చి భద్రగజము నవరోహించి యువతులిరువురు కై దండయొసగ విలాసగమనుఁడై సింహాసనము దరియుచుండెను. ఆయనవెంట యువరాజైన మన్నారుదాసును, చెంగమలదాసునుగూడనుండిరి. సభయంతయు నొక్కసారిగ లేచి నిలిచినది. వందిమాగధులు, "రాజగోపాల భజనానందసాంద్రా! రఘునాధనాయక రత్నాకరావతీర్ణ సంపూర్ణ పూర్ణిమాచంద్రా! పాండ్యతుండీరాది వైరిగజకంఠీరవ కిశోరా! కళావత్యంబికాకుమారా! చంద్రోపేంద్ర సురేంద్ర

నంచనకందర్పకోటి సౌందర్యధుర్యా! జీర్ణకర్ణాటక సామ్రాజ్య సింహాసన స్థాపనాచార్యా! సమర సమయాచరిత సమస్తనిస్తుల తులాపురుషాది మహా దానాపదాన ప్రవర్తితకీర్తి ధౌరేయా! సంగరరంగగాంగేయా! ప్రతిదిన బహు సహస్ర బ్రాహ్మణాభీష్ట మృష్టాన్నదాన దీక్షాధురీణా! మానినీనూతన పఞ్చబాణా! విశ్వవిశ్వంభరాభరణ విచక్షణ దక్షిణ భుజాదండా! శాశ్వతైశ్వర్యధౌరంధర్య మేరుకోదండా! దక్షిణసింహాసన పట్టభద్రా! చతుర్విధకవితా నిర్వాహక సార్వభౌమా! బిరుదాంగద విరాజమాన చరణాంభోజా! జనకచరణరాజీవ సేవావిధాయకా! విజయరాఘవనాయకా! పరాకుస్వామీ! పరాకు" అని కైవారములు సల్పిరి. రాజుగారు సింహాసన మలంకరించిరి. బాలాసనములపై మన్నారుదాస చెంగమల దాసులు కూర్చుండిరి.

రంగాజమ్మగారి 'ఉషాపరిణయము' కృతిసమర్పణ జరుగవలసి యున్నది. మంగళవాద్యములు మ్రోసెను. రాజుగారి కనుసన్న నిరువురు సుందరీమణు లమూల్యాంబరములు, వెలలేని భూషణములు, కస్తూరి, జవ్వాది, హరిచందనము, పునుగు మొదలైన సుగంధద్రవ్యములును, చేమంతి, కేతకి, మందారములును రంగాజమ్మగారికి సమర్పించిరి. రాజానుమతిని, సభికుల యామోదమునుఁబొంది రంగాజమ్మ తన యుషాపరిణయ ప్రబంధమునుండి, ఉషాస్వప్నము, శ్రీకృష్ణ బాణాసురయుద్ధము, ఉషానిరుద్ధుల వివాహఘట్టములుఁ దనకిన్నరీగళ మంజులధ్వనితోఁ బఠించి సభనంతను నాయారసములఁ దన్మయులనుగా నొనర్చినది. కవిసత్తము లామె నెంతగనో కొనియాడిరి. విజయ రాఘవనాయకులవారు సంతుష్టాంతరంగులై పండితామోదపూర్వకముగ 'శృంగారరస తరంగిత కవిత్వ మహనీయమతిస్ఫూర్తి' యను బిరుదము నొసంగిరి. రంగాజమ్మ వినయవినమిత మధురలజ్జావనతమస్తకయై బిరుద మును స్వీకరించి సభకు నమస్కరించినది. రాజుగారికిఁ బెద్దిదాసు విషయము తలఁపునకు వచ్చినది.

విజయ : కాళకవిశేఖరా! పెద్దిదాసుగారు నేటిసభకు వత్తురనుకొంటిమి. వచ్చినట్లులేదు!

కాళకవి : మహాప్రభూ! పెద్దిదాసుగా రీ లోకవుమానిసివలెఁ గాను పించుటలేదు. ఆయనయొక మహాభక్తుఁడు. ఈ రాజమర్యాదలు కీర్తి ప్రతిష్ఠలు

నాయనదృష్టిలో గణనీయములుకావు. ఆయన తన్నుఁదాను పూర్తిగ రాజగోపాలుని సేవయం దర్పణ మొనర్చుకొనినాడు.

విజయ : ఎటులైన నామహాభాగు దర్శనముఁజేయ నామనమువ్విళ్లూరుచున్నది. ఆయన నెట్లే నొకపర్యాయము మనయాస్థానయునకుఁ దీసికొని రావలయును.

కాళకవి : చిత్తముప్రభూ ! తమ యానతి నిర్వర్తింప యత్నింతును.

నాటి కార్యక్రమము ననుసరించి నాట్యారంభసూచక ఘంటారవము వినవచ్చినది. ఎల్లరదృష్టులు నాట్యరంగమువైపునకు మరలినవి. యవనిక యపసరింపఁబడినది. సాంబ్రాణి యగురుధూపములు సుడులుసుడులుగ వ్యాపించి చిరుమబ్బులవలెఁ దోచినవి. పసుపుఁ బచ్చని పట్టుచీరె ధరించి చెమ్కీచుక్కల నీలికఞ్చుకముఁ దొడిగి, కరములఁదాల్చిన రత్నకంకణములు ఘలంఘలారావములు సల్పుచుండ గగనపరివ్యాప్త ఘనశ్యామకాదంబినీ విలసిత విద్యుల్లేఖవలె రూపవతీ వధూటి చౌపదముల నభినయించినది. బహువిధ జంత్రవాద్యములయందుఁ బ్రవీణలైన యువతులు, వీణ, మురళి, రబాబు, తంబుర, చంగు, దండె, ఢక్కి, కిన్నర, సుఖవీణ, రావణహస్తము, స్వరమండలము, గట్టితాళము మొదలైన వాద్యముల వాయింపఁదొడఁగిరి.

ఆకుపచ్చచీరె గోచిపోసి మహారాష్ట్ర సుందరివలెఁ గట్టి, జడ చౌశ్లేషముఁ జుట్టి, చేమంతిపూల నమర్చి, చంపకవల్లి శబ్దచూడామణి నృత్యమొనర్చినది. నల్లని యుప్పాడజరీచీరెను ఎరుకసానివలెఁగట్టి, మెడలో నల్లపూసలఁదాల్చి, జుత్తు కొప్పుగ నమర్చి, మందారములఁజుట్టి, కోమలవల్లి కొరవంజినృత్య మొనర్చి, సభ్యుల హృదయములం దొకానొక విచిత్రసంచలన మొదవించినది. రంగాజమ్మముఖమున నానందరేఖలు తొంగిచూచుచున్నవి. ప్రేక్షకులలో నీ నాట్యానందము రూపుమాయకముందే బంగారుపూలు కుట్టిన తెల్లపట్టుచీరఁ గుచ్చెలులు కుచ్చెలులుగ విచిత్రముగఁ గట్టి వక్షోమండలభాగమున జరీస్తనవల్కలముఁ బిగించి, జుట్టువిరియఁబోసికొని, రవ్వముక్కర తళుక్కులీనఁ గాలి యందెలు ఘల్లనఁ జిరుగాలికిఁ దూగాడు శారదాభ్రశకలమువలె శశిరేఖ దేశినృత్యమొనర్చి సదస్యుల దిగ్భ్రాంతులనుగా నొనర్చినది. ఎఱ్ఱపట్టుగాగరా

ధరించి, వక్షస్థలోపరిభాగమున మెఱయు చెమ్కీపద్మములుగల నల్లనిముఖమల్ రవికపై రత్నహారములఁదాల్చి, జఘనభాగ పరీవ్యాప్తకేశరాశి నిరుపాయలుగ నల్లి రెండువైపుల వైచుకొని రూపొందిన రత్నపాంచాలికవలె రత్నగిరి దురుపదముల నభినయించినది. చిత్రచిత్రవసన ధారిణులై, ఆయానృత్యో చితాలంకారముల హవణించుకొని భాగీరథీ, లోకనాయకీ, మూర్తిమతులు తులుకులు మీరు మారుసెలగోలలు, పల్కెడుపూదీవెలు, సొలపులుగన్న వెన్నెలసోగల వలెఁ గ్రమముగఁ బేరణి, నవపదములు, జక్కిణి మొదలగు నృత్య భంగిమములఁ బ్రదర్శించిరి. యవనికాపాతమైనది.

మరలఁ దెర యపసరింపఁబడినది. నాట్యకత్తియలందఱు నానాముఖ ములనుండి యొక్కసారిగఁ దూసుకొనివచ్చు మదుబాణములవలె నద్భుత రసోద్దీపనముగ గుమిగూడి క్షేత్రయ్యగారిమువ్వగోపాల పదముఁ బాడుచు హల్లీసకమొనర్చిరి. సభ్యులహృదయములు మధురభక్తి ప్రపూర్ణములైనవి. సహృదయుల నయనయుగ్మములనుండి యానంద బాష్పకణములు తొంగిచూచి నవి. నాట్యకత్తియలకు రాజుగా రుచితబహుమానములు స్వహస్తముతోఁ బ్రసాదించిరి. నాటిసభ ముగిసినది.

౩

దాక్షిణాత్యశిల్పము పల్లవులనాటికన్న చోళులనాటికి, చోళులనాటికన్న విజయనగర రాజులనాటికి నంతకంత కభివృద్ధిఁ జెందుచు వచ్చినది. తంజా వూరు మధురల శిల్పమును దాక్షిణాత్య శిల్ప చరిత్రలో విజయనగర శిల్పము నుండి విడఁదీయరు. మధుర తంజావూరుల శిల్పము విజయనగర శిల్పముకన్న నెక్కువ యభివృద్ధిఁ జెందినదని చెప్పవచ్చును. ఇందిరా మందిరమున దాక్షిణాత్య శిల్ప సౌభాగ్యమంతయు మూర్తీభవించి యున్నది. మణిమయ విరాజితము; చంద్రకాంతపు సంతసపుఁ బనులుగలది. పగడాల కంబములు, మగరాల మదనచేతులు, దంతపుఁజేరుల్ల మలచిన చీనపక్షులు, కెంపురాళ్లతోఁ జెక్కిన బోదియలు, పచ్చరాతిపలకల పైకప్పు, ఇంద్రనీలముల లోవరి, చలువ రాలచే నిర్మింపఁబడిన కుడ్యములు, ద్వారబంధములకు వ్రేలాడఁదీసిన కట్టాణి ముత్యపుఁ జికిలికుచ్చులు, వైడూర్యపు ద్వారబంధములు, మగరాల సంతసపు

మనత తలుపులును గలిగి శోభిల్లుచున్నది. కుడ్యములందు నాయకరాజుల విజయగాథలు చెక్కఁబడియున్నవి.

ఈ మందిరమునంటుపొని సరిగ సమానరూప శిల్పముగల వేరొక మందిరమున్నది. అది రాజగోపాలాంబిక యంతఃపురము. అంతఃపురమునుండి యిందిరామందిరమునకు ద్వారములున్నవి. అంతఃపురము నానుకొని నిష్కుటమొకటున్నది. అది వివిధ ప్రసూనలతా వితానములచే నలరారుచున్నది. ప్రాగ్భాగమునఁ జెవ్వప్పనాయకులవారు త్రవ్వించిన క్రీడాసరస్సు గలదు. (చెవ్వప్పనాయకులవారు విజయరాఘవ నాయకులవారికిఁ బ్రపితామహులు.) దానియొడ్డున రమణీయమగు విరజాజి మంటప మున్నది. ఆ మంటప మనిన రాణిగారి కత్యంతమైన ప్రీతి. తనగడచిన పదునేను వసంతముల ప్రణయజీవన లతామంటపము. నేడు స్మృతిచిహ్నముగ నున్నది. క్రీడాసరస్సున నాఁడుంచిన జలయంత్రములవలనఁ బైకెగయు నీటి తుంపురులు విరజాజులఁ బన్నీట నభిషేకించుచున్నట్లుండెడివి. నేఁ డవి సూనరహిత లతావితానముపై జాలువారు కన్నీటి జల్లులవలె నున్నవి. ప్రాతః సూర్యమందస్మిత రాగరోచులు నీటి తుంపురులమీఁద, జాజిజొంపముమీఁదఁ బ్రసరించి మిలమిలలాడినవి. ఒకనాఁ డా మిలమిలలు తమ యనురాగ రసరంజిత దృక్ప్రసారములు. నేడవి తన విరహోకులితాపమానవిదీర్ణహృదయమున నున్నని చురకటారిఁ దూర్చిలాగఁ జిమ్మిన రక్తాసారములు. ఒకనాఁ డా నిష్కుటము తన సుమనోహర మనోగత వాంఛా పరిపూర్ణ స్వరూపము. నేఁడు తన్నుఁజూచి ఖేదపడు వికృతస్వరూపము.

ప్రతిదినము నుషస్సంధ్యాలం దా మంటపమున విశ్రమించుట రాణికిఁ బరిపాటి. ఆమె కా మంటపము బాధా హేతువయ్యును బాధా నివారకమును నదియె. కపర్దిని రాణిగారికిఁ బ్రేమపాత్రయగు పరిచారిక. ఆమె సర్వ సమయము లందును రాణి నంటిపెట్టుకొనియే యుండును. ఆమెకు రాణిగారననఁ బ్రాణము. రాజమందిరమునందలి యెట్టి దుర్భేద్య రహస్యములనైన సులువుగ గ్రహించగల సూక్ష్మబుద్ధి యామె. కాని పదునేనేండ్లక్రిందట నొకనా డర్ధరాత్రమునఁ దమ నగరముఁ బ్రవేశించిన యొక యౌవనవతి రహస్యముమాత్ర మామెకు దురవగాహముగ నుండెను. ఆమెరాక రాణికి సూర్యేందుసంగమ మైనది. రాణికి

విజయరాఘవ నాయకుని దర్శనము భోజనముపద్దఁదప్ప దుర్లభమైనది. పదునేనేండ్లనుండి రాణి యనుభవించు మనోవేదనను కపర్దిని గ్రహించుచున్నది.

ఇటీవల సభలో రంగాజమ్మకు జరిగిన గౌరవమును గనులారఁగాంచినది. సహించలేకపోయినది. రాణిగారికిఁ జెప్పినది. ఆమె చెప్పిన మాటలు రాణి హృదయమునకు మండుచున్న యగ్ని కాజ్యము వోసినట్లాయెను. ఆమె, ఆనాఁ డొక్కతియ విరజాజి మంటపముననున్న చంద్రకాంత శిలావితర్దికపైఁ గుడిచేయి ఫాలభాగమున నుంచుకొని మోచేయిఁ గుడితొడమీఁద నానించి గూరుచున్నది. ఆమె సౌందర్యవతి కాదన్నచో నపను. సౌందర్యరాశియా యన్న కాదు. ఆమె మొగమునఁ బ్రావృట్సంధ్యాకాలావిల గాఢ కాలాంబుదములఁ బోలిన రేఖలు చిక్కులు చిక్కులుగ నల్లుకొనినట్లున్నవి. ఆమె మనమున కపర్దిని చెప్పిన మాటలు ప్రతిధ్వనించుచున్నవి. తన ప్రతిస్పర్థికి సన్మానమా! పదునేను సంవత్సరములు తన సౌభాగ్య మంతయుఁ దస్కరించిన తస్కరికికి రాజసభాగౌరవమా! ఆమెకు దుఃఖము కుత్తుకబంటియైనది. కన్నీరు జలజల రాలినది. ఆమెయెదుట బాలఘాసముఁ గొరుకుచున్న లేడిపిల్ల చెంగున గంతిడినది. రాణి పరిచారిక వచ్చుచుండెనని త్వరగఁ గన్నీరొత్తికొనినది. వెనుదిరిగి చూచునరికిఁ గపర్దిని.

కపర్దిని : నే డిట్లొంటరిగ వచ్చితిరేమి?

రాణి : నా కేమియుఁ దోచుటలేదు. అందుచేఁ గొంచెము ముందుగనే వచ్చితిని.

కపర్దిని : తమ దర్శనముకొఱకు నెల్లి సోమయాజులుగారు వచ్చినారు.

రాణి : అయినచోఁ ద్వరగఁ బోవుదము పద.

కపర్దిని : మహారాణీ! తమ ముఖ మీనాఁ డింత వాడియున్న దేమి?

రాణి : కపర్దినీ! నీకుఁ దెలియని కారణమేమున్నది? నా జీవితమింత యసుఖమగునని కలనైన నూహించలేదు.

కపర్దిని : అదేమి, మహారాణీ! కష్టములు కలకాలముఁ గాపురము చేయునా? మహారాజునకు మీమీఁదఁ గొండంత గౌరవమున్నది. యువరాజు వంటి కుమారుఁడు మీకుండఁ జింతింపవలసిన దేమున్నది?

రాణి : నీవు తెలివిదప్పి మాటలాడుచున్నావా ? లేక( బరిహాసమా ?

కపర్దిని : తమ్ము పరిహాసము చేయునంతటిదాననా ?

రాణి : కాకున్న స్త్రీ భర్తనుండి వాంఛించునది గౌరవ మొకటియేనా ? భార్య భర్తనుండి ప్రేమను, ఆదరమును, ఉపలాలనమును వాంఛించును. అంతియేగాని మధురమైన ప్రేమను విడనాడి నీరసమైన గౌరమును నెవ రర్థింతురు ? ప్రేమరహితమైన గౌరవ మెందులకు ?

కపర్దిని : క్షమింపుడు, మహారాణీ ! నాకు దెలియ కట్లంటిని. మన్నారు దేవునిదయవలన మహారాజులకు( గొలదికాలములోనైన నామె మీ(ది మరులు మరలకపోవు.

రాణి : అట్టి యదృష్ట మెన్నటికోగదా !

ఇరువురు నంతఃపురాంతర్భాగమునుండి యిందిరా మందిరమునకు( బోయిరి. రాణి యచ్చటనున్న పరిచారికచే సోమయాజులకు రజతాసనము( బెట్టించినది. కపర్దిని ఫలరసముల( దెచ్చినది. రాణి యొక పలుచని కావిరంగు వెండిజలతారు తెరమాటున( గూర్చున్నది.

రాణి : గురుపాదులకు నమస్కారము.

సోమ : మహారాణిగారి కాశీర్వాదములు. కుశలమేకద ?

రాణి : కుశలమున కేమిలెండు..........

సోమ : మాటాడుటకు సంశయించుచున్నట్లున్నా రెందువలననో ! నే(డు మీమాటలలో దైన్యము గోచరించుచున్నది. నాకు వినరాని రహస్య మేమైన నున్నదా ? మీకనిష్టకరమైన విషయమేమైన నుండిన( జెప్పుటకు వెనుదీయుచున్నారా ? నేను మీనాయనగారికి విశ్వాసపాత్రు(డను. నాకు మీతల్లిగారి చిన్నతనమునుండియు మీకుటుంబముతో( బరిచయము. పుణ్య దంపతు లిరువురును( బైలోకమునుండి నన్ను దయాదృష్టుల( జూచుచునే యున్నారు. వారియెడల( గృతజ్ఞత దెల్పుకొనుటకుగాను నేను మీనిమిత్తము ప్రాణములనొడ్డియైన మీ మనఃక్లేశమును నివారింప యత్నింతును. చిన్న తనమున మీతల్లిగారే స్వయముగ నేస్వల్పసందేహ మొదవినను నన్ను(

బిలువనంపి యడిగి సమాధానమునుబొంది తృప్తిఁజెందెదువారు. మీ మా బాంధవ్యము లీనాటివిగావని వేఱచెప్పవలయునా?

రాణి మాటాడలేదు. సోమయాజులు తిరిగి చెప్పఁదొడగెను. "మీ మనస్సునందలి బాధను వెలువరింపుడు. నాయోపినంతకు నివారింప యత్నిం తును."

రాణి కనుగొలఁకులనుండి ధారగాఁ గన్నీళ్ళు చెక్కిళ్ళమీఁదుగ జారు చుండెను. ఆమె దుఃఖోద్వేగము నాపుకొని యనినది.

రాణి: నాకు మీవద్ద దాఁచఁదగినరహస్యము లేమియున్నవి? మీరు గాక పుట్టినింటి బందుగులుగఁ జెప్పుకొనఁదగినవారు నాకిఁక నెవ్వరు? అయి నను నాకెట్టిలోటునులేదు. ఇక్కడ నన్నియునున్నవి. ఏమియు లేవు. అన్నిసుఖము లుండియు............

ఆమె కంఠము రుద్ధమైనది. మాట పెగిలివచ్చుటలేదు.

సోమ: ఎన్నఁడులేనిదైన్య మెకడిదీనాఁడు వచ్చినది? చాల చిత్రముగ నున్నది. అసలు మీ యాంతర్యముననున్న విషయముఁ జెప్పుడు.

రాణి: మహారాజుగారి ప్రవర్తన............

సోమ: మహారాజుగారి ప్రవర్తనయేమి? సంశయింపకుడు.

రాణి: మహారాజుగారు నానాటికి............కాదు........రంగాజమ్మ మీకుఁ దెలియునా?

సోమ: రంగాజమ్మ యెవరు?

రాణి: మహారాజుగారి యాస్థాన కవయిత్రియట. ఇటీవల సభలో నామెకు గౌరవము జరిగినదట.

సోమ: ఓహో! మీ రధైర్యముఁ జెందకుఁడు.

రాణిమనమున నొక యాసందకిరణము తొంగిచూచి మాయమైనది. సోమయాజుల మనమునఁ గ్రొత్తక్రొత్త యాలోచనలు బయలుదేరినవి.

సోమ: మహారాణీ! సెలవా?

రాణి : మంచిది, సమస్కారము.

ఎల్లు సోమయాజులు వేదాధ్యయన సంపన్నుడు. వృద్ధుడనియే చెప్ప వచ్చును. జరాజీర్ణదేహయష్టి. నైష్ఠికుఁడును శీలవంతుఁడును. రాజగోపాలాంబిక తల్లిగారివెంట నీయన సరణపుఁ బండితునిగఁ బంపిరి. ఈయన తన సహజ సద్గుణములతో రాణి తండ్రిగారి యాదరమును చూరగొనినాడు. రాజగోపాలాంబిక తల్లిదండ్రుల కొక్కతియ బిడ్డ. తల్లి చిఱుతప్రాయముననే మరణించినది. తల్లిలేని పిల్లకు సోమయాజులు ప్రేమతో చనువునుబట్టి విద్యాబుద్ధులు గరపినాడు. ఆమెపుఁ దండ్రివద్దకన్న సోమయాజులుగారి వద్దనే చనవు మెండు. రాణి చిన్నతనమున నీయనను తాతయని పిలిచెడిది. విజయరాఘవనాయకునితో సుద్వాహము జరుగునప్పు డాయన యానందమునకు మేరలేకుండెను. విజయరాఘవులవా రన్నివిధములఁ దగిన వరుఁడని సంతసించినాఁడు. రాజగోపాలాంబిక నత్తింటికిఁ బంపునపుడు, ఆమె కీయన యెడలఁగల చనువు నీయనకామెయెడలఁగల వాత్సల్యమునుబట్టి రాజుగారీయననే యరణపుఁ బండితునిగ నామెవెంటఁ బంపిరి. ఈయనకుఁ దన శీలము, రాణిగారిపలని గౌరవము, వార్ధక్యముఁదోడై కోణెవాకిలికడనుండు గుఱిగొల్లలుసైత మంతఃపుర ప్రవేశమున కాయన నడ్డుపెట్టకుండఁ జేసెను. కాలగతిని రాణిగారి తండ్రి యుద్ధమున వీరస్వర్గ మలంకరించిరి. తలిదండ్రులు లేని రాణిపై వాత్సల్యము పొంగివచ్చినదాయనకు. ఆమె కెట్టి మనఃక్లేశ మొదవినను సోమయాజులు సహింపలేఁడు. ఆమెను కన్నాకువలెఁ గాచుచుండును. రాణిగారి కష్టములను జెప్పికొనుట కీయన తరువాత కపర్దిని యొకతెయున్నది. కపర్దినికూడ సరణముగ రాణిగారి వెంటవచ్చిన చెలికత్తెయే.

రాణిగారిమీఁది యీక్రొత్తపిడుగుపాటు సోమయాజులును కలఁచివేసినది. ఆయన మనస్సంతయుఁ జీకాకైనది. కపర్దినికి వర్తమాన మంపినాఁడు. కపర్దినికి సోమయాజులుగారనిన మిగుల భక్తి. సాయంకాలమునకుఁ గపర్దిని వచ్చినది. నమస్కరించినది. ఆయన యాశీర్వదించి కూర్చుండుమనెను. ఆమె కూర్చుండెను.

సోమ : కపర్దినీ ! అయిన రంగాజమ్మయన నెవరో నీకుఁ దెలియునా ?

కపర్దిని : మన మహారాజుగారి యాస్థాన కవయిత్రియట.

సోమ : ఆమెను నీ వెన్నడైనఁ జూచితివా ?

కపర్దిని : ఆఁ, ఒకటిరెండుమారులు చూచితిని.

సోమ : చూచుట కెట్లుండును ?

కపర్దిని : మహాసౌందర్యవతి. ఆమె సౌందర్య మీలోకపు సంబంధమైనది కాదనిపించును స్వామీ!

సోమ : వయస్సెంత యుండునో యూహించి చెప్పఁగలవా ?

కపర్దిని : సుమారు ముప్పదియైదు సంవత్సరము లుండవచ్చును.

సోమ : అయినచో నామె యీపురవాసినియేనా ?

కపర్దిని : కాదుస్వామీ! పదునేనేండ్లకుఁబూర్వ మొకనాఁ డర్ధరాత్రమున నీమెను మహారాజుగారీ పురమునకుఁ దెచ్చిరని జనశ్రుతి.

సోమ : పదునైదు వత్సరము లైనదన్నమాట!

ఆయన హృదయమునఁ గరుణాజనకమైన యొక భావవీచిక యుదికి విలీనమైపోయెను.

సోమ : రాజుగా రంతఃపురముకువచ్చి యెంతకాలమైనది ?

కపర్దిని : స్వామీ !..........

వివరింపరాని యవమానచ్ఛాయ లామెముఖమండలమునఁ బ్రకటితములయ్యెను. ఆమె పెదవులు కదలియుఁ గదలుటలేదు.

సోమ : తెలిసినది. రాణిగారితోఁ జింతింపకుడని తెలుపుము.

కపర్దిని సోమయాజులుగారికి నమస్కరించి సెలవు తీసికొని వెడలిపోయినది. సోమయాజులు సాంధ్యకృత్యములఁ దీర్చికొనినాఁడు. ఇంటిలో సందెదీపము వెలిగించిరి. గృహప్రాంగణముననున్న యొకబల్లపైఁ గృష్ణాజినముఁ బరచికొని నా దేహదశ యగుటచే నుపవాసదిన మగుటవలన బడలికచే నందు శయనించి యాయన యాలోచింప మొదలిడినాఁడు. 'ఈమె మంత్రకర్త్రియా ?'

ఆకసము నిర్మేఘముగ నున్నది. నక్షత్రములు ప్రకాశించుచున్నవి. "రాణి కెట్టియిక్కట్టు సంప్రాప్తమైనది! దీనిని వారించుటెట్లు? అసలీ రంగాజమ్మ యెవరు? ఏప్రాంతమో యేమో! రాజుగారి కీమెతోఁ బరిచయ మెట్లయినది? పరిచయమాత్రముననే యాయనతోఁ గలసివచ్చిన నీమెకుల మేమైయుండవచ్చును?· లేక కింకులయా? కాదు. మహారాజుగారి ప్రేమ యొక కింకులయం దాబద్ధము కాఁగలదా? సుందరి! హీనజాతియం దింత యపూర్వ సౌందర్యము నమోఘమైన మేధావిభవమును సాధ్యములా? వారాంగన యేమో! కావచ్చును. రాజుగారి కిట్టిచర్య తగదని చెప్పఁవచ్చునా? అసంభవము. ఆయన యేమనుకొనును? మిక్కిలి చన వనిపించునేమో! అసలు ప్రస్తావించు టెట్లు? రాజుగారికి మహారాణిపైఁగూడ నాగ్రహము కలుగవచ్చును. అయిన నేమిచేయవలెను? రంగాజమ్మనే యడుగుచో! ఆమె హృదయ మెట్టిదో! నామాట నామె గౌరవించవలెనని యేమున్నది? ఇంక నితరమార్గము లేమైన నున్నవా?"

ఆయనకేమియుఁ బాలుపోవుటలేదు. ఎటులో రంగాజమ్మవద్దకే పోవల యును. ఆమెయొద్దనే కార్యసిద్ధి యొనగూడవలెను. 'నాన్యః పంథా విద్యతే'. హజారమున మూడవజాము దెలియఁజేయు గంట కొట్టఁబడినది. ఆకసమునఁ గాలమేఘము చంద్రు నాక్రమించినది. సోమయాజులకుఁ గునుకు పట్టినది.

౪

చంద్రగిరిలో నొకనాఁ డిద్దరుపురుషు లొక గృహారామమునందలి చలువ రాతి తిన్నెలపై నుపవిష్టులై సంభాషించుచుండిరి. అందొకవ్యక్తి మంచిరూపసి. ఆజానుబాహువు, విశాలఫాలము, పొడుగైన ముక్కు, వెడదయైన యురము, ఆకర్ణాంతనేత్రములుఁ గలిగియుండెను. ఏబదియేండ్ల వయస్సనిపించును. మానిసి దబ్బపండు ఛాయ. గుబురైన మీసము. అంత బక్కపలచనకాని, స్థూలముకాని దేహము. కన్నులందు తేజస్సు తరుముకొని వచ్చుచున్నట్లున్నది. మెడలో యజ్ఞోపవీతమున్నది. ఎదుఱొమ్ముమీఁద పచ్చలపతకమున్న ముత్యాల హార ముండెను. దక్షిణ హస్తమునకు బంగారు కడియము. జరీపట్టు ధోవతి

ధరించెను. అట్టిదే యొక యుత్తరీయమును వలెవాటుగా వేసుకొనెను. మానిసి యుద్ధతుడు. చూచునంతనే యాతఁడొక మహామేధావియని తోచును.

రెండవవ్యక్తి వామనచాయవాడు. అంత పొడగరికాడు. పొట్టియుఁ గాఁడు. వాలకమును, వేషధారణమునుబట్టి యగ్రకులజు డనియే తోచును. అతని కన్నులు నిశితములై హృదయగర్భితమైన రహస్యములను సైతము వెలువరింపఁ జాలినంత తీక్ష్ణములై యుండెను. స్వార్థపరుఁ డనిపించును. స్వకార్య నిర్వహణమునకు నిరోధమేర్పడునదనుచోఁ దన స్నేహితునైనను బంధువునైనను మోసగించుటకు వెనుదీయని మనస్తత్వము. మహాసమర్థుడు. రాజతంత్రమును సమగ్రముగా నెఱిఁగినవాఁడు.

రామరాజు : ఏమందురు ? కళాప్రియుఁడనియా ?

వెంకన్న : అవును. కేవలము కళాప్రియుఁడనియే కాదు విలాసినీ జనాపాంగ వీక్షణాబద్ధచేతస్కుఁడు.

రామరాజు : అయినచో మనయెత్తు పారినదన్నమాట.

వెంకన్న : అదేమంత సులువుగ నెంచుచున్నారు ? ఏమైన నుపాయము గోచరించినదా ?

రామరాజు : మధుర తిరుమల నాయకుడును, చెంజికృష్ణప్ప నాయకుడును, మన విజయనగరమునకుఁ గప్పముఁ జెల్లింపక యెదురు తిరుగుచున్నారు గదా ! విజయరాఘవనాయకుఁడును వారితో చేతులు గలుపుచున్నాఁడట. వారు మువ్వురేకమై నిలిచిన మనకు విజయము కష్టసాధ్యము. వారిలోనుండి యే యొక్కరినేనిఁ జీలదీయఁగల్గితిమేని కొంతనయము. ఈమధ్యఁ దిరుమల నాయకుఁడు చెంజి, తంజావూరు నాయకులతో మంతనములఁ జరిపి మన కర్ణాటాధీశ్వరునిపై దండెత్తు నుపాయముల యోజించుచుండిరని మనచారుల వలనఁ దెలియవచ్చినది. ఇప్పుడు వారినిఁ జీలఁదీయుటకుఁ బథకము స్ఫురించుచున్నది. మధుర, చెంజినాయకులలో భేదభావము ఘటించుట పొసఁగదు.

వెంకన్న : ఎందువలనఁ బొసఁగదు ?

రామరాజు : అదియే చెప్పఁబోవుచున్నాను. పాండ్య తుండీరపతులు కేవలము మనకు విరుద్ధముగ నడచుటకే నిశ్చయించుకొనినట్లు కనఁబడు

చున్నారు. కాని విజయరాఘవనాయకుడు మాత్రము మన ప్రభువుగారిపట్ల సుహృద్భావము నెఱపుచునే వచ్చుచున్నాడు. అదియుఁగాక మధుర, తంజావూరు నాయకులకుఁ బూర్వమునుండియు భావభేదములును, గృహకల్లోలములునుఁ బొడచూపి యున్నవి. ఎట్లేని విజయరాఘవనాయకునే విడఁదీయవలెను.

వెంకన్న : అదెట్లు సాధ్యమగును ?

రామరాజు : చంద్రరేఖయం దాశలు కల్పించుట ద్వారమున. ఇందు మీ యభిప్రాయమేమి ?

వెంకన్న : చంద్రరేఖ యనిన జ్ఞప్తికి వచ్చినది. ఆయనకు వివిధ నాట్యములందును, నాట్యకత్తెలనినను నాసక్తి మిక్కుటము.

రామరాజు : అందువలననే చంద్రరేఖా పరిచయ ప్రస్తావముద్వారా యీ విపత్తును గడుపవలయును.

వెంకన్న : బాగున్నది. చంద్రరేఖ విషయ మాయనకుఁ దెలియుటెట్లు ?

రామరాజు : అదియే నేను మీనుండి యపేక్షించునది. అట్టికార్యము మీరువినా యనన్యసాధ్య మని నా యూహ.

వెంకన్న : మీ యాజ్ఞ, నాచే నైనంతవఱకు యత్నించెదను.

రామరాజు : మీనుండి యీమాత్రము సాయము నాకుఁ జాలును. మీరు నేడే బయలుదేరి తంజనగరమునకుఁ బోవలయును. ఉపాయమున రాజసభా ప్రవేశముఁ గలిగించుకొని సమయ మరసి చంద్రరేఖపై రాజునకు మరులు గొలుప యత్నింపవలయును.

వెంకన్న : అట్లే యొనర్తును. శ్రీరంగనాయకులవారికిఁ సాహాయ్య మొనర్చుటకన్న నదృష్టము మరియుండునా ?

రామరాజు ; మీరీకార్యమును వీలైనంత త్వరలో నొనర్పవలయును.

వెంకన్న : తమ యాజ్ఞ శిరోధార్యముగ భావింతును. సెలవా ?

రామరాజు : వెళ్లిరండు. దైవము మీకుఁ దోడ్పడుఁగాక !

తాడిగోళ్ళ రామరాజు శ్రీ రంగరాయలవారి దండనాథుఁడు. రణనీతి విశారదుఁడు. రాటనీతిజ్ఞుఁడు. శ్రీ రంగరాయలవారి సామ్రాజ్య సౌష్ఠవ

మంతయు నీయన మేధావిభవముపైనే యాధారపడియున్నది. చతుర్విధోపాయము లను చక్కఁగా నెఱిఁగిన యాయన యూహను. సామమునఁ బాండ్యతుండీర నాయకులను సాధించుట దుర్లభ మనిపించెను. దానముపలన నంతకంటెనుఁ బొసఁగదు. మధుర, చెంజినాయకులయందు భేదోపాయమునుఁ దావేలేదు. విజయనగర సామ్రాజ్యమున కిఁక విజయరాఘవనాయకుఁ డెల్లవిధములఁ బట్టు గొమ్మగ వర్తించుచుండెడివాఁడు. మధుర నాయకులకును తంజావూరు నాయకు లకును మనస్పర్ధలును, విరోధ భావములును పూర్వమునుండియుఁ గలవు. నేడవి సాకుగ విజయరాఘవనాయకుల కళాప్రియత్వము, సౌందర్యలోలు పత్వము నవలంబములుగ భేదోపాయమున నాయనను ఁడలఁదీయుటకు దారులు తీయుటయే సుగమమని యెంచినాఁడు.

నియోగి వెంకన్న యుక్తిశాలి. ఎత్తులకుఁ బైయెత్తులు వేయుటలో చాణక్యయౌగంధరాయణులకుఁ దీసిపోని చేయి. అతఁడు తలఁచిన సాధింపఁ జాలని కార్యమే లేదు. కాని స్వార్థపరుఁడు. అతనికిఁ గ్రోధము కలిగినచోఁ ద్రాచుపాము పగఁబట్టినట్లే. ఇట్టివాఁడని యెఱిఁగియుండుటవలననే రామరాజీ కార్యనిర్వహణమునకు వెంకన్నను నియోగించినాఁడు. వెంకన్నకుఁ గూడ నెందులకో తంజావూరు రాజాస్థానమున నాశ్రయము సంపాదించవలె ననిపించి నది. తానచ్చట నేదేని గొప్ప పదవిని సంపాదింపవలెనని యాశ వొడమినది. ఈ యదను కూడ నతని యూహలకుఁ దోహద మనుకొనినాఁడు. కార్యో న్ముఖుఁ డగుటకుఁ ద్వరపడినాఁడు. నాఁడే తంజావూరునకు బ్రయాణము గట్టెను.

.....................................................................................................

అది శుభకృన్నామ సంవత్సర శ్రావణ శుద్ధ త్రయోదశి. నాఁటికి శ్రీ విజయరాఘవ నాయకులవారు సింహాసన మధిష్ఠించి యిరువది సంవత్సరము లైనది. ఆ దినమున తంజావూరునందలి ప్రతి గృహమునను పండుగయే. పురమున నేదెసఁ జూచినను నానంద దేవీలాస్యమే గోచరించుచుండెను. నాటి యుదయమున చిన్నిచిన్ని మేఘములచాటునఁ దరణిబింబము దోబూచు లాడు చున్నది. మొగసాలలో మ్రోగు ప్రాతఃకాల భేరీనినాదములు మేఘధ్వనులని భ్రమసి పెంపుడు నెమళ్లు పురులువిప్పి నృత్యమాడసాగెను. విజయరాఘవ

నాయకుడు సూర్యోదయమునకుఁ బూర్వమేలేచి కనకకలశాదుల నీక్షించి, అష్టాక్షరి జపించి, గురునానతి శ్రీముద్ర ధరించి, కపిలగోవునకు గ్రాసమం దిచ్చి, రామచరిత పఠనశ్రవణ మొనర్చి, కవిపుంగవులతో సంభాషించు చుండెను.

ఊరేగింపునకు సమయము దగ్గఱుచున్నది. మావటీంద్రు కాలమేఘము, నీలకంఠము, రామబాణము, రాజసింహము, రణవిజయుడు, ముద్దుమురారి, మొరసరగండడు, బురుదనీలాద్రి, పవమానిరావు, హనుమ, గరుడాద్రి, విష్ణు చక్రము, హలాది గజరాజములను ముస్తీదుచేసి తీసికొనివచ్చిరి. భద్రగజంబైన యైరావతమును వానిముందట నిల్పిరి. భద్రగజము దంతములకుఁ బచ్చలు, గుజరాతిజాతి కెంపుల బవిరిచెక్కిన కొమ్ముకట్లును, నీలాలను,వజ్రములనుఁ దాపిన తలమాళిగ, ముత్తెపుసరుల చెవుల జల్లులు, పుష్యరాగములఁ దాపిన ఫాలాదిగంటలు, మరకత వైడూర్య మాణిక్య కాంతుల వెదజల్లు నురస్త్ర వాలత్రములును, హారుమంజిముత్యాల యొరిజలు, వైడూర్యపు మెడగొలు సులు, కెంపురాళ్ళ రావిరేకలు, రవలు రత్నములుఁ గలిపి పొదిగిన యందె లును, నునుపట్టుజూలుపైఁ గుట్టిన సరిగబొమ్మలు, ముత్యాల ధవంతివలె ముద్దులుగుల్కు సూరెపుటంపుకురుచగద్దిగము నమర్చిరి.

విజయరాఘవ నాయకుడు సమీపమున నున్న దొరలచేదండఁ దీసికొని "చటుల వాగ్వైఖరి నముఖా" యని కటికవారలు బల్కుచుండ, బంగారు సరుదు చప్పరమున నిలిచి భద్రగజమునెక్కి బయలుదేరెను. ప్రభువు వెనుక చిన్న యేనుఁగులమీఁద మంత్రులు, సామంతులు, దండనాథులును; హయా రూఢులై సంప్రతికరణములు, అసమువారు, బొక్కసములవారు, మజాలశీలు మొదలైనవారును వెంటరాఁ దమటములు, పసిడికాహళులు, దవిణెలు, భేరులు, ఢక్కలు, చిరుతమద్దియలు, నాగసరములు, నరగజములు, ధవళశంఖములు మొదలగు వాద్యఘోషములు మిన్నుముట్టఁ గోలాహలముగ నూరేగింపు సాగి నది. రాజవీధులన్నియుఁ జుట్టువచ్చునైనది. బ్రాహ్మణులొసంగు వేదోక్తాశీ ర్వాదములను, రాజులొసంగు కానుకలను, వైశ్యులు సమర్పించు బహువిధా మూల్యాభరణంబులను, శూద్రులుసల్పు వందన సత్కారములను, భోగస్త్రీ లర్పించు కర్పూర నీరాజనములను, గౌరవానుగ్రహ వాత్సల్య కృపాకటాక్ష

వీక్షణముల స్వీకరించుచు సభాభవనముఁ జేరిరి. వందిమాగధులు కైవారములు సల్పిరి.

సభారంభమైనది. పరరాజుపలు, బటువుపాగలు, పైఠిణీ హంగులు, బంగారు గంటపుటోరలు మొదలుగాఁగల యుపాయనములఁ జదివింపించిరి. దినసరులు చదువఁబడినవి. కరణికు లాయవ్యయంబులు, మణియపులెక్కలు, మనువర్తి లెక్కలు వినిపించిరి. కోనేటి దీక్షితచంద్రుఁ డష్టావధాన మొనర్చెను. రంగాజమ్మ కొన్ని సమస్యలను పూరించినది. కాళకవి ప్రభృతులు తమతమ రచించిన నవీన ప్రబంధములను, రసబంధుర కావ్యములను రాజుగారికిఁ గృతి సమర్పణ లొనర్చిరి. విజయరాఘవనాయక ప్రభువువారందఱికి యథోచిత సత్కారములఁ గావించిరి. ఆ సభ చాలింపఁబడినది.

సాయంకాలమున నాట్యమందిరమున నృత్యము జరుగవలసి యుండెను. సభయంతయుఁ బండితులు, కవులు, గాయకులు, రసికాగ్రేసరులతో నిండి కల కల లాడుచుండెను. రాజుగారి కనుసన్న నృత్యము లారంభింపఁబడినవి. వివిధ వాద్యములు మ్రోయింప మొదలిడిరి. నాట్య కత్తియల కాలిగజ్జెలు ఘల్లని సభాస్తారుల దృష్టులను రంగభూమి వైపునకు మరలించెను. రూపవతి, శశిరేఖ, భాగీరథి, మొదలగువారు వార్విచి, గుజ్జరి, విల్వేడు, దండలాస్యము, కందుక క్రీడ, యల్లిక, సామ్రాజ్యము, జిందు, నాట్యకదంబము మొదలైన నానానేక నృత్య నైపుణులను వెలయించిరి. ప్రేక్షకుల హృదయము లానందభరితము లైనవి. రాజగురువులైన శ్రీనివాస తాతాచార్యులవారు నాట్యకత్తియల నృత్యాభినయములను పలువిధములఁ బ్రశంసించిరి. సహృదయుల పొగడ్తలకు మేరయే లేదు.

పండిత శ్రేణిపజ్జనే యాసీనుఁడైన నియోగి వెంకన్న తన్నుఁ బరిచయ మొనర్చుకొన నిదియ యదనని తలఁచి యాసనమునుండి లేచి నిలిచి రాజుగారికి వినయపూర్వకముగ నమస్కరించి 'మహాప్రభూ! నాదొక విన్నపము.' అనినాడు. ప్రభు వంగీకారసూచకముగ శిరఃకంపన మొనర్చినాఁడు.

వెంకన్న: మహాప్రభూ! ఇచ్చటి నేటి యీ నృత్యము లత్యంత రమణీయములుగ నున్నవి. నాట్యకత్తియ లందరుఁ బ్రవీణలే యగుదురు!

సందియములేదు. అన్యథా భావింపకుందురేని విశేషమొక్కటి మనవిచేసి కొందును. ప్రభుపులవంటి కళాభిజ్ఞులు, రసికావతంసుల సంస్థానమునఁ జంద్రరేఖ యుండియున్నచో నీనాటిసభ సాక్షాన్మహేంద్రసభతోఁ దులతూగెడి దనుటలో నతిశయోక్తిలేదు.

చంద్రరేఖ యెవరాయని రంగాజమ్మ మనమునందు కళవళ పడినది. ఆస్థానకవులును, పండిత ప్రవరులును నీక్రొత్తవ్యక్తి యెవరు ? చంద్రరేఖ యేమియని వెలవెలఁ బోవుచు నొకరిమొగ మొకరు చూచుకొనఁదొడగిరి.

కోటలో జాముగంట కొట్టఁబడినది. నాటికి సభ చాలింపఁబడినది. చంద్రరేఖ యను నామమే రాజహృదయమున సుఱకలు పెట్టించినది. ప్రభుపు వారాదినమున నాక్రొత్తవ్యక్తినిఁ దమ సువారమున నుంచవలయునని కాళకవికిఁ జెప్పినారు. కాళకవి వెంకన్నను గలిసికొని రాజాజ్ఞను తెలియఁజేసినాఁడు. వెంకన్న తనయుక్తి ఫలోన్ముఖమైనటుల నెంచుకొని తృప్తిజెంది వెలికేమియు నగుపించనీయక రాజాజ్ఞ శిరోధార్యమనియెను.

భోజనానంతరము వెంకన్న రాజుముదల లక్ష్మీసదనమునకు వచ్చి చేరెను. విజయరాఘవనాయకుఁ డంతకుఁ బూర్వమే యచటికి వేంచేసి యుండెను.

వెంకన్న : మహాప్రభువులకు నమస్కారము,

విజయరాఘవనాయకుడు మాటాడలేదు.

వెంకన్న : మహారాజులకు నావంటివానివలనఁ గాదగిన కార్యమేమో దెలియ వచ్చునా ?

విజయ : మీ దేదేశము ?

వెంకన్న : పెనుగొండ ప్రభూ :

భయాందోళన లాయనహృదయమున నొక్కసారిగ నలముకొనినవి. యత్నపూర్వకముగ వానినణచుకొనఁ జాలినాఁడు.

విజయ : చంద్రరేఖ యెవరు ?

వెంకన్న : ఆమెయొక నాట్యకత్తియ.

విజయ : నీవంతగశ్లాఘించిన యామెయందలి ప్రత్యేకతయేమి ?

వెంకన్న : ఏమనిచెప్పుదును ప్రభూ ! ఆమెరూపమున రతీదేవి కైన యగును. పేరణి భరతనాట్యములందామె యందెవేసిన చేయి. అట్టి భువనైక మోహిని, నాట్యకళాధురంధర యే యాస్థానముననున్న నాయాస్థానమున కలంకారము.

విజయ : ఆ చంద్రరేఖ యిప్పు డేయాస్థానమున నున్నది ?

వెంకన్న : చంద్రగిరి యందు శ్రీరంగరాయలవారి యాస్థానమున.

విజయ : వారియాస్థానముననున్న మనకెట్లు సాధ్యమగును ?

వెంకన్న : ప్రభువులు సంకల్పసిద్ధులు. తాముకోరవలెనేగాని మార్గమే యుండదా ?

విజయరాఘవనాయకుని కీ నియోగివెంకన్న నడవడియెట్టిదో యూహ కందుటలేదు. "అతఁడు గూఢచారియా ? కాదేమో !" యనుకొనినాఁడు.

విజయ : మార్గ మేమున్నది ?

వెంకన్న : మార్గమునకేమి మహాప్రభూ ! రాయలవారు తమకు మిత్రులేకదా !

విజయ : అయిననేమగును ?

వెంకన్న : తమ్ముఁబోలిన మిత్రులు చంద్రరేఖను వాంఛించిన నిరాక రింతురని తోచదు.

శ్రీరంగరాయలమీఁది తమతిరుగుబాటునుగూర్చి వెంకన్నకుఁ జెప్ప నగునా, తగదాయనువిచికిత్స విజయరాఘవనాయకుని మనస్సు సందుఁబొడ సూపినది. వెంకన్నను క్షణకాలము స్థిరదృష్టిఁ బరికించినాఁడు. వెంకన్న కన్నులు మేధాసైశిత్యముఁ జిమ్ముచున్నవి. ఆయన ముఖముఁజూడగనే విజయ రాఘవనాయకుని కాతఁ డెంతటిదుర్ఘటకార్యమునైన నవలీలగ సాధింపఁ గలఁడని తోచినది. శ్రీరంగరాయలపైఁ దమతిరుగుబాటునుగూర్చి యాయనకుఁ జెప్పవచ్చునని నిశ్చయించినాఁడు. ఏది యెట్లయినను చంద్రరేఖను దెచ్చుటయం

దతనిసాహాయ్య మెంతేనిఁ బ్రయోజనకారి కాఁగలదని యనిపించిన దాయనకు. చంద్రరేఖ యనివార్యముగఁ దనకుఁ గావలయును.

వెంకన్న : మహాప్రభువులేమో యాలోచించుచున్నారు.

విజయ : ఏమియునులేదు. మధుర, చెంజినాయకులతో నొడంబడిక మాకొక దున్నది.

వెంకన్న : అదియెట్టిదో యెఱుఁగ నగునా ?

విజయ : మధుర, చెంజినాయకులు శ్రీరంగరాయలవారికిఁ గప్పముఁ గట్ట నిరాకరించి స్వతంత్రులగుటకు నిర్ణయించుకొనిరి. ఇందులకు శ్రీరంగ రాయలవా రామోదింపరేని తిరుగుబాటు సేయుదురట.

వెంకన్న : అట్లనుటలోఁ బ్రభువుల భావమేమో తెలిసికొనవచ్చునా ?

విజయ : దెలియవలసిన దేమున్నది ? స్వాతంత్ర్యమునం దిచ్ఛ ప్రతిజీవికిని నుండును. ఒక ప్రభువునకు మరొక ప్రభువు కప్పముగట్టుట యననేమి ? కావున, మేము మువ్వురమును కప్పముఁ గట్టకుండుటకే నిశ్చ యించుకొనినారము. ఇట్టులగుచో శ్రీ రంగరాయలవారికి మేము శత్రువర్గము లోనివారమే యగుదుముకదా ! చంద్రరేఖఁ దెచ్చుట సాధ్యమగు టెట్లు ?

వెంకన్న : ప్రభువులు సాహస మనుకొనక మన్నింతురేని నాదొక మనవి.

విజయ : ఏమది ?

వెంకన్న : మధురనాయకులకు మీ నాయనగారికిని నంతఃకలహములు కలవుకదా ! వారు మీ కెప్పుడును శత్రుకోటిలోనివారే యగుదురు. వారీనాఁడు బలమైన శత్రువును నిర్జించుటకుగా మిమ్ములను దమతోఁ జేర్చుకొనుచున్నా రేమో గాని సరియైన యదనునఁ దిరిగి మీకు ద్రోహముఁ దల పెట్టరని నమ్మక మేమి ? మధురనాయకులకును చెంజినాయకులకును నెడతెగని మైత్రి. అటు లగుట వారిరువురునుఁ జేరి మిమ్ములఁ బరాస్త మొనరింప యత్నింపరా ? శ్రీ రంగరాయలవారి రాజ్యస్థాపనయందుఁ దామొనర్చిన సాహాయ్యము రాయల వారి కెన్నఁడును విస్మరింప రానిది. తమయందు వారి కత్యంతగౌరవ

మున్నది. అదియుఁ గాక యీనాటివఱకుఁ దా ముభయులును సుహృద్భా వముతోనే మెలఁగుచుంటిరిగదా ! ఇప్పు డీ తిరుగుబాటును లేవదీసి మిమ్ములను గూడగట్టుకొన యత్నించుట మధురనాయకులకు తంత్రమనకఁ జెల్లదు. తిరుమలనాయకుఁ డెటులేని దమసాహాయ్యముతో శ్రీ రంగరాయలవారి నెది రించి యాపిమ్మట మిమ్ములఁ గూడ వంచించుటకుఁ జేయుచున్న దుస్తంత్రము వలెఁ దోచుచున్నది.

విజయరాఘవనాయకుని మనమునఁ దన యక్కగారి మరణము కన్ను లకుఁ గట్టినట్లు స్ఫురించినది. మధురనాయకుఁడైన తిరుమలశౌరికి రఘునాథ నాయకులవారి కుమార్తె యగు నచ్యుత రఘునాథమ్మనిచ్చి వివాహముఁ జేసిరి. తిరుమలశౌరి తంజావూరుకోట యందమునకు మురిసి యదేపోలికమున మధు రలో దాని కుద్దియౌ కోటను గట్టించెను. తమకోట బాగుగ నున్నదా ? తంజా వూరు కోటయా ? యని తిరుమలశౌరి పట్టమహిషియగు నచ్యుతరఘునాథమ్మ నడిగిరట. అందుల కామె పరిహాసముగ "మధురకోట చాల యందమైనదేగాని మాతండ్రిగారి కోటయందు మాత్రము కొంచెము శిల్పచాతుర్యమున కొఱవడు" నన్నదట. అందుల కాయన యాగ్రహపరవశుఁడై యామెను పొడిచి చంపెను. విజయరాఘవనాయకుని మనమున నాక్షణమున నీభావము తటిల్లతవలె దూసు కొని వచ్చినది. ఆయనకుఁ గ్రోధము పట్టరాని దయ్యెను. మధురనాయకుల కుట్రలోఁ దాను చేరుదునని వాగ్దాన మొనర్చినందులకు మిగుల చింతించినాఁడు. వారి నెటులైన సాధించి తీరవలయునని సంకల్పించు కొనినాఁడు. ప్రతీకారేచ్ఛ యాయనలోఁ బ్రబలమైనది. తా నీనాఁడు మధురనాయకులకు సాయమొనర్చుచో వెంకన్న చెప్పినటులఁ బాముకుఁ బాలుపోసి పెంచినట్లే యగును. అదిగాక శ్రీ రంగరాయలవారు తనపట్ల సుముఖులేగదా ! కప్పముఁ జెల్లించినమాత్రమున వచ్చిన దోసఁగేమి ? ధనాగారమున ధనము కొఱవడిన నావిషయము శ్రీ రంగ రాయలవారితో సంప్రదించినఁ దీరిపోఁగలదు. ఈయన చాల యుక్తిపరునివలెఁ గనుపించుచున్నాఁడు. జాగ్రత్తగఁ గనిపెట్టి యుండవలయును. ఈయన సాహా య్యము తప్పని సరియగునని తోచుచున్నది. ఈ యూహలన్నియు నొకదాని వెంట నొకటిగఁ దన మనమున నుద్భవించినవి.

వెంకన్న హృదయమున యాందోళన బయలుదేరినది. తా నతిప్రసంగముఁ జేసినాఁడేమో! ప్రభు వెట్లుగాఁ దలఁచెనో! తనస్థితి యేమగునో!

విజయ: నీ పేరేమి?

వెంకన్న: నాపేరు వెంకన్న మహాప్రభూ! మీరాజధానిలోనున్న పెద్దిదాసు నాకు చుట్టము.

విజయ: మీరు బ్రాహ్మణులా?

వెంకన్న: కాదు. మేము నియోగులము.

విజయ: (నవ్వి) కాని పెద్దిదాసుగారు బ్రాహ్మణులే. సరేగాని వెంకన్నా! శ్రీ రంగరాయలవారి కిపుడు సాయమొనర్పవలెననిన నుపాయ మేమి? ఇన్నినాళ్ళనుండియు మధుర, చెంజినాయకులతోడఁ గలసినట్లుండి యీనాఁ డాకస్మికముగ శ్రీ రంగరాయలవారి పక్షమునఁ జేరుటనిన వారి కెట్లుండును? వారిరువురునుఁజేరి సంప్రదించుకొని తొలుతనే మనరాజ్యముపై దండెత్తి వచ్చెదరేమో!

వెంకన్న: అవును ప్రభూ! మన మట్లు చేయరాదు. మనము మొదటనే వ్యతిరేకులముగఁ గనిపించిన వారట్లు దండెత్తి రాగలరనుటలో నాశ్చర్య మేముండును?

విజయ: అయినచో నిప్పుడిక కర్తవ్యము?

వెంకన్న: రణనీతి విశారదులగు తమకు నేను చెప్పవలయునదేమి ప్రభూ! వారితోఁ గలసిమెలసి శ్రీ రంగరాయలవారిమీఁది దండు వెడలి యచట వారిరువురుతో సంప్రతించి సాధ్యమైనంతవరకు యుద్ధమనునది లేకుండఁ జేయుట. వారందులకు సమ్మతింపకుండుచో యుద్ధమున వారిపక్షముననే పోరాడుచున్నట్లు నటించుచు నదనునఁ బార్శ్వభంగమొనర్చి శ్రీ రంగరాయల వారి సైన్యములో మీ సైన్యమును గలిపివేయుటయే. ఇంతకన్న సుగమమైన మార్గము గోచరించదు.

విజయ: బాగున్నది. నా కీ పద్ధతియే నచ్చినది. అట్లే చేయుదము, కాని చంద్రరేఖ తుదకు మాకు లభించునా?

వెంకన్న : ఎంతమాట ప్రభూ ! చంద్రరేఖను దెచ్చి తమ స్వాధీన మొనర్చు భారము నామీద నుంచుఁడు. ఆమెకును మీపైని, మీ యాస్థానము నందును గౌరవము మెండు.

విజయ : నీవు చంద్రరేఖను మాకు సమర్పింపఁజాలుదువేని నీకు మా యాస్థానమున రాయసము పదవి నొసఁగెదము. నీవు మా యాస్థానమున నుండఁ దగినవాఁడవు.

వెంకన్న : ప్రభువుల దయయున్నచో నాకు లేనిదేమున్నది.

ప్రొద్దుపోయినది. రాజాజ్ఞపొంది వెంకన్న తనబసకుఁ బోయెను. ప్రభువు శయనమందిరమునకేగి పర్యంకమునఁ బరుండి యాలోచింప మొదలిడెను. 'ముక్కుమొగ మెఱుఁగని యొక బ్రాహ్మణునితోఁ దానిన్ని విషయములఁ జర్చించుట రాజనీతి విరుద్ధమగునా ? ఆయన కేవల మొక బ్రాహ్మణమాత్రుఁడు కాఁడు ? ఆయన కనులలో కూటనీతిజ్ఞత ప్రతీయమానమగుచున్నది. ఆయన మధుర, చెంజి, తంజావూరు, విజయనగర ప్రభువుల రాజ్యాంగమంతయుఁ దెలిసినవానివలె నున్నాఁడు. ఆయన ప్రవర్తన యెట్టిదో తెలియరాదు. తాను కేవలము చంద్రరేఖమీఁది వ్యామోహమునఁబడి యాయనతో రాజ్యాంగ రహస్యములఁ జర్చించుట పొఱపాటగునేమో ! ఆయన స్థిరబుద్ధి గలవానివలె నున్నాడు. మధురనాయకులు తనకు బద్ధవైరులని తెలిసియు వారితో నొడంబడికఁ జేసుకొనుట తనకే విచిత్ర మనిపించినది. వెంకన్న చెప్పినటుల వారు తొలుత శ్రీ రంగరాయల నోడించి తదుపరి తన రాజ్యముమీఁదికిఁగూడ వచ్చునంతటి దుష్టులే. తన శ్రేయోభిలాషి కానిచో నీ విషయములన్నియు వెంకన్న యేల చెప్పును ? ఈతఁ డనుమానాస్పదుఁడు గాఁడు. చంద్రరేఖ యెట్లుండును ? ఆమె నిజముగ నంతసౌందర్యరాశియా ? ఆమె తన సంస్థానమునందలి నాట్య కత్తెలందఱియందును రాణివలె నుండును కాఁబోలు ! భాగీరథి పేరణి నృత్యము చేయును. కాని చంద్రరేఖ యా నృత్యమునఁ బ్రవీణయట. ఇంతవఱకీ యాస్థానమున భరతనాట్యపుఁ బద్ధతి సమగ్రదశ నందినదిలేదు. తద్భరతనాట్యశాఖా కళాధురంధరుని దూడి కామె పట్టుఁగొమ్మయట ! ఆహా ! ఆమె వచ్చిన పిమ్మట సభావైభవ మెట్లుండునోగదా ! మధుర చెంజినాయకులు తానుచెప్పు సరసోక్తుల

నాలించి శ్రీ రంగరాయలవారితో సంధి కొప్పుకొందురా ? ఒప్పుకొననిచో యుక్తితోఁ దాను చీలిపోవును. ఎటులైనను జంద్రరేఖ తన యాస్థానమున నుండవలెను'.

తూర్పున నుషారాగములు తోచుచున్నవి. పశ్చిమదిశయందుఁ జంద్రరేఖ రాగరంజితమగుచున్నది.

౩

అదియొక విశాలమగు మంటపము. దానియందు వర్ణనీయమగు శిల్పము లేకపోయినను శిల్పనైపుణి లేకపోలేదు. శుభ్రముగ నున్నది. మంటపమున నొక రత్నకంబళము పరువఁబడి యున్నది. అచటనున్న యొక యాసనముపై తాడిగోళ్ళ రామరాజు వెంకన్న రాకనుగూర్చి యోజించుచుండెను. 'వెంకన్న యింత దనుక రాకుండుటకు హేతువేమి ? ఆతని పథకము సక్రమముగ నిర్వహింపఁబడినదో లేదో ! రాజసభాప్రవేశమే సాధ్యము కాలేదేమో ! ఆతని గూఢచారిగ భావించి బంధించిరేమో !' పరిపరి విధముల రామరాజు తలపోయుచుండు నంతలో ద్వారదేశమున నడుగుల సవ్వడి విననైనది. రామరాజు తలయెత్తి చూచెను. వెంకన్న కనుపించినాఁడు. రామరాజుగారి యానందమునకు మేర లేకపోయినది. వెంకన్న ముఖవైఖరియే తమ కార్యసానుకూలత సూచించు చున్నది.

వెంకన్న : నమస్కారములు.

రామరాజు : నమస్కారములు. కూర్చుండుడు. నేను మీ రాకను గూర్చియే యోజించుచుంటిని. మీరును వచ్చినారు. వెళ్ళినకార్య మేమైనది ?

వెంకన్న : కార్యార్థము పోవుటయు కార్యము నిర్వహింపఁబడ కుండుటయునా ?

రామరాజు : అగుచో విజయరాఘవనాయకులవారు మన పక్షమునకుఁ దిరుగుట కెట్లంగీకరించినారు ?

వెంకన్న : చంద్రరేఖనుగూర్చి నేను సభలోఁ బ్రస్తావించితిని. అది యాయన మనమున హత్తుకొనినది. నన్నుఁ బిలిపించి చంద్రరేఖ యునికిని గూర్చియు నామె సౌందర్య నాట్య చాతుర్యములఁ గూర్చియుఁ బృచ్ఛించిరి.

ఆమె తన కెల్లొడగూడుననని యడిగిరి. నేను చంద్రరేఖ యునికి మన యాస్థాన మందనియు, ఆమె కావలయునేని మధుర, చెంజి నాయకులవీడి శ్రీ రంగరాయల వారికి సాహాయ్య మొనర్పవలసి యుండుననియుఁ జెప్పితిని.

రామరాజు : మీరు చెప్పినంతనే సరియనినారా ? మధుర, చెంజి నాయకులనుండి విడివడుట కేరీతి సమ్మతింపఁ జేసితిరి ?

వెంకన్న : మధురనాయకులకును తంజావూరునాయకులకునుగల గృహ కల్లోలములను బైటికిఁ ద్రవ్వి, యెన్నటికైన మధురాధిపుడు తంజాపురికిఁ బ్రక్కలోని బల్లెమువంటివాఁ డగునుగాని మిత్రుఁడు కాఁజాలఁడు ; అట్టివానితో నొడంబడిక యేమని నుడివితిని ? గృహకల్లోలమును గురించి స్ఫురణకుఁ దెచ్చినంతనే విజయరాఘవనాయకుడు మధుర తిరుమలనాయకునిపై మండి పడెను. తరువాతఁ జంద్రరేఖమీఁది వ్యామోహము, కళాప్రియత్వము, మధుర నాయకునిమీఁది కక్ష యన్నియుఁజేరి వారినుండి చీలిపోవుట కంగీకరించినారు.

రామరాజు : వారినుండి చీలువిధాన మెట్లు నిర్ణయింపఁబడినది ?

వెంకన్న : తక్కిన యిరువురితోడను విజయరాఘవనాయకుఁడు సంప్రతించి యేదో యొక విధముగ యుద్ధవిరమణమునకు వారి నొప్పింప యత్నింతు ననియుఁ బొసగనిచో నడియుద్ధమునఁ బార్శ్వభంగ మొనర్చి తాము మన సైన్యమునఁ జేరునట్లును నిర్ణయించినారు.

రామరాజు : మీ మేధావిశేషము మెచ్చఁదగినది. ఈ పద్ధతి బాగుగనే యున్నది. కాని పెద్దలు కీడెంచిగదా మేలెంచుమనిరి ! ఒకవేళ విజయరాఘవ నాయకులు మనతోఁ గలిసిరానిచోఁ దంజావూరు నెట్లు పట్టుకొననగునో యరసి వచ్చితిరా ?

వెంకన్న : ఆ పనిచేయకుండ నెట్లు తిరిగివత్తును ?

రామరాజు : అచటి కోటయందలి విశేషములనుఁ జెప్పఁగలరా ?

వెంకన్న : దానికేమి ? ప్రహరిలోపలిభాగమున మున్ముందుగ శిఖరాగ్ర ములయందు స్వర్ణకలశములతోనొప్పు హజారము. తరువాత ఘనమైన గజ ఘటలు కలిగి పెనులాగడపుఁ బెద్దభవంతియు నున్నవి. హజారమునకుఁ గొంచెము దూరమునఁ దక్షిణపార్శ్వమునఁ బతాణిబవంతి సజ్జయు, సంప్రతి

కరణములు సమాలోచనములు సల్పి వ్రాయుచుండెడి విశాలమగు శాలయు నున్నవి. సంప్రతికరణముల శాలకు తరువాత శ్రీరామభద్రశాల గలదు. దీనిని దాటి చనినఁ గోటెవాకిలి. ఈ కోటెవాకిలికడఁ గుఱిగొల్ల లెల్లవేళలను వెదురు గఱ్ఱలు పుచ్చుకొని యనిమేషదృష్టిఁ గావలియుందురు. కోటెవాకిలి దాటగనే సామంతరాజులకు వసతియైన లక్ష్మీవిలాసభవన మున్నది. దాని సమీపమునఁ జలువరాతితోఁ జెక్కిన సింగములుగల ద్వారము. ద్వారముదాటి లోనికేగినఁ బున్నాగ వృక్షచ్ఛాయయం దచ్యుత రంగకూటము, నాకపురీవిలాసగేహము, లాగుల చప్పరము, గరడికూటము, నవరత్నమయమైన నాటకశాల, మదనగోప విలాసమందిరము, శ్రీరామసౌధరాజములు నున్నవి. శ్రీరామసౌధము దాటి చనిన సువర్ణద్వారములుగల విజయభవనరాజ మున్నది. అచ్చటనున్న వేదికపై నెల్లవేళలయందును గంచుకివర్గము కావలియుండును. విజయభవనరాజ స్వర్ణ కవాటఘటిత మార్గము నధిగమించిన మందిరములలోనెల్లఁ బ్రశస్తమైన యిందిరామందిర మున్నది. కోట దక్షిణభాగమునఁ గొంత శిథిలమైనట్లు కనుపించును. ఆ వైపున నుండియైన ముట్టడివలన ననతిప్రయాసముతోఁ గోట లోనికిఁ బ్రవేశింపవచ్చును. ఇంతకుఁ బ్రతికూలము సంభవించినగద! విజయ రాఘవనాయకునికి శ్రీరంగరాయలవారనిన గౌరవము మెండుగ నున్నట్లు దోచుచున్నది.

రామరాజు : విగ్రహము సంభవించిననే. అనుకొనినట్లు జరుగుచో నంతకన్నఁ గోరఁదగినదేలేదు. విపరీతము పరిణమించిన నుపాయ మేమిగల దని భావించి యడిగితిని.

వెంకన్న : అటులే. భోజనసమయ మతిక్రమించుచున్నది. మరలఁ గలిసికొందునా ?

రామరాజు : అటులనే కానిండు.

వెంకన్న వెడలిపోయెను. వెంకన్న దూరాలోచనకు రామరాజు సంతోషించెను. "ఆయనతో జాగ్రత్తగ మెలఁగవలయును. ఆయనకుఁ దమ కోట గుట్టుమట్టులన్నియుఁ దెలియును. ఆయన మిక్కిలి స్వార్థపరుఁడు. ఎట్టి కష్ట మాయనకుఁ గలిగించినను నాయన యెదిరిపక్షమునఁ జేరి తమ గుట్టుమట్టులఁ

దెలిపి తమ్మే వారిచే నిర్జింపఁ జేయఁగల్గిన సాహసికుఁడుకూడ. కాని బింకముల మారి. పొగడ్తల కుబ్బిపోవు రకము. ప్రశంసించుచుండినంతకాలమాతనినుండి తమకెట్టి హానియుఁ గలుగఁజాలదు. ఆయనవలన నెఱవేర్చుకొనఁదగిన కార్యము లనేకము లుండును" అనుకొనినాఁడు.

నాఁడు చక్రవర్తి సైన్యములు మధుర చెంజి తంజాపుర సైన్యములు యుద్ధమునకు సన్నద్ధములైనవి. చక్రవర్తియైన శ్రీరంగరాయల సైన్యములు దండెత్తివచ్చినవి. ఉభయసైన్యములు కావేరీనదీతీరమునందు సమకూడినవి. తిరుమలనాయకుని గుడారమున ముగ్గురు నాయకరాజులును సమావేశమై ముందు నడవవలసిన యుద్ధవిషయముఁగూర్చి యాలోచనలు జరుపుచుండిరి. మధురనాయకునిపై విజయరాఘవ నాయకునికిఁ గోపమంతరమున రగుల్కొని పోవుచున్నది. కాని యణచిపెట్టుకొనినాఁడు.

తిరుమల : విజయరాఘవనాయకులేమియు మాటాడకున్నారు!

విజయ : ఏమి మాటాడవలయును? వారి సైన్యములు తీర్చియున్నవి. మన సైన్యము లెదురుతీర్చియున్నవి.

చెంజి : అయిన నిప్పుడు కర్తవ్యమేమి?

విజయ : అసలు యుద్ధము జరుగకముందు జరుగవలసిన కార్య మొక టున్నదని మా యభిప్రాయము.

తిరుమల : అది యెట్టిది?

చెంజి : మన నిర్ణయమునకు వ్యతిరేకమైనదియా?

విజయ : తొందరపడకుడు. మీ యాలోచనకు భంగకరమగు విష యము కాదు. మనకు శ్రీరంగరాయలకు కప్పముఁగట్టు టనిష్టము. మనము స్వతంత్రులము గానెంచితిమి.

తిరుమల : అవును, అయిన?

విజయ : ఈ విషయము మనము వారికిఁ గట్టిగఁ దెలియఁజేయలేదు. వారు కప్ప మడిగినపుడెల్ల మన మెలయించితిమిగాని 'మే మీయము, మేము స్వతంత్రులముగా నుందు'మని నిశ్చయముగాఁ జెప్పలేదు.

తిరుమల : మనమట్లు తెలియపఱచినను ఫలితమిదియే.

విజయ : మనము తెలియఁజేసిన బాగుగ నుండునని తోచుచున్నది. ఒకవేళ వా రంగీకరింపవచ్చును. అగుచో నీ యుద్ధమువలన ననవసరముగ నిరుకక్షలయం దొదవు జననాశము, ప్రజాఘోషయుఁ దప్పునుగదా! వా రంగీకరింపరేని యుద్ధము సిద్ధము. నా యభిప్రాయమున నొకపర్యాయము వారికి మన స్వాతంత్ర్యేచ్ఛను విశదమొనర్చి దానిఫలితమునుబట్టి కర్తవ్యమును నిర్వర్తించుట లాభదాయకముగఁ గనుపట్టును.

చెంజి : ఆ పద్ధతియు బాగుగనేయున్నది. మన యాశయమును వారికిఁ దెల్పి వారు దానినిఁ ద్రోసిపుచ్చినపుడే యుద్ధము కావచ్చునని నా యభిప్రాయము గూడ. తిరుమలనాయకుల యూహ యెట్టిదో ?

తిరుమల : ఈ యిరువురి కంగీకృతమైన మార్గమును మేముమాత్ర మేల కాదనవలయును ? శ్రీరంగరాయలవారు దీనికి సమ్మతింతురని తోచదు.

విజయ : తెలియఁబఱచుట వీరలక్షణము.

తిరుమల : ఏమని సందేశ మంపవలయును ?

విజయ : ఏమనియా ? 'మీరును, మేమును నొకే తెలుఁగువారము. అందఱమును కలసిమెలసి యుండవలయును. అందఱకు సమానస్వాతంత్ర్య ముండవలయును. ఒకరికొకరు కప్పముఁ జెల్లించుటయేమి ? అందరము సుహృద్భావముతో మెలఁగవలెను. కప్పముఁ గట్టుటయనఁగనే యొకరి యాధిక్యమును నొకరి యల్పత్వము ; ఒకరి యున్నతి, వేఱొకరి యవనతియు భాసించి కలహములకు దారిఁదీయును. అదియుఁగాక స్వాతంత్ర్యాభిలాష ప్రతిజీవికిని స్వతస్సిద్ధముగ నుండు లక్షణము. అట్టియభిలాష నణచివేయుచో నెట్టి కల్లోలములకు దారిదీయునో యోచించుకొనుడు. మిత్రభావమున నెట్టి దుర్ఘట కార్యములనైన సులువుగ సాధించుకొనవచ్చును. అప్పుడందఱికిని నానందము. సేవ్యసేవకభావము హృదయమునఁ గలకఁ బుట్టించును. మనము నల్వురమును స్వతంత్రాధీశులవలె మెలంగుచు స్నేహము నభివృద్ధిఁ గావించు కొందము. మనదేశమును సురక్షితముగఁ గాపాడికొందము. మీ యభిమత మట్లు కాదేని మిమ్ములఁ బ్రతిఘటించుట మా కనివార్యమగును. మనలో

మనము కలహించుకొనుటఁ గాంచినఁ బరరాజులకు మన తెలుఁగుసీమపై దండెత్తివచ్చుట సులభమగును. కావున సర్వవిధముల యోజించి మీ రొసఁగు నిర్ణయమున కెదురుచూచుచున్నా'మని తెలియఁజేయుదము.

తిరుమల : బాగున్నది. ఈ రాయబార మెవరికృతమున నెఱపఁదగును ?

చెంజి : శ్రీరంగరాయల రాజ్యస్థాపననాఁడు విజయరాఘవనాయకుల వారు చాల సాయపడినారు. రఘునాథనాయకులవారును, వేంకటపతినాయకుల వారును ప్రాణమిత్రులు. ఈ సంబంధములఁ బురస్కరించుకొని విజయరాఘవ నాయకులవారే యీ రాయబారమును నిర్వహింప సమర్థులు. శ్రీరంగ రాయలవారికి వీరియందు లక్ష్యమున్నది. కావున నీ కార్యనిర్వహణమునకు విజయరాఘవనాయకులవారు పూనుకొనినచో నిర్విఘ్నముగఁ గొనసాగఁగలదు.

తిరుమల : విజయరాఘవనాయకులవారి యుద్దేశ'మేమియో ?

విజయ : మన నిర్ణయము ననుసరించి మీ యిరువురి యభిప్రాయములును నేనేల స్వీకరింపకుందును ? ఆ పనిని నేనే నిర్వహించెదను.

తిరుమల : ఈ కార్యము నేడే ముగియవలయును.

చెంజి : అవును. మీరు నేఁడే శ్రీరంగరాయలవారిని కలిసికొనవలెను.

తిరుమల : అటులనే చేయుదము.

ఎవరిగుడారములకు వారు పోయిరి.

నాటి సాయంకాలము శ్రీరంగరాయలు సభతీర్చిరి. శ్రీరంగరాయలవారు మణిమయ సువర్ణపీఠి నలంకరించిరి. సింహాసనమునకు దిగువభాగముననున్న యాసనములఁ దాడిగోళ్ళ రామరాజును, ఆయనప్రక్క నియోగివెంకన్నయు నాసీనులైరి. కవులు, గాయకులు, పండితులు, కరణములు, దళకర్తలు, దండనాథులు మొదలగువారందఱు యథోచితాసనములఁ బరివేష్టించియుండిరి. తగినంత పరివారముతో విజయరాఘవనాయకుడు సభకు విచ్చేసెను. శ్రీరంగ రాయలవారికి నమస్కరించెను. రాయలు సింహాసనముడిగ్గి యాతని గౌరవించి తనకు దక్షిణభాగమున నొక స్వర్ణపీఠముమీఁద గూర్చుండఁజేసెను. విజయ రాఘవనాయకుని రాకకుఁ గారణమేమో రామరాజునకును, వెంకన్నకును దురవగాహముగనున్నది.

శ్రీరంగ : విజయరాఘవనాయకుల రాకకుఁ గారణ మేమైయుండును ?

విజయ : ప్రభూ ! మధుర చెంజినాయకులు స్వతంత్రులుగ నుండుటకు వాంఛించుచున్నారు.

శ్రీరంగ : ఇదియేమి ? మాసామంతుల యూహలివియా ? సామంతులు స్వతంత్రులగుట యననేమి ?

విజయ : చక్రవర్తికిఁ గప్పముఁ జెల్లించుట వారి కనిష్టమని తోచుచున్నది.

శ్రీరంగ : అరిగాపులు కప్పముఁగట్టకున్న నర్థమేమి ?

విజయ : వారికి వ్యయ మమితముగ నగుచున్నదఁట. దేశరక్షణకు ఖర్చులు పెరిగిపోవుచున్నవఁట. అందుచే నింతంత గప్పములఁ జెల్లించుట యసాధ్యమట.

శ్రీరంగ : అటులైన సామంతచిహ్నముగ నేకొలఁదియైనను దెచ్చి ప్రతివర్షమునను మాయొనర్చు నుత్సవములయందుఁ బాల్గొననైన వలయును గద ? ఇది యీనాటి విధానముగాదు. పూర్వమునుండియు వచ్చుచున్న యాచారము.

విజయ : అది నిజమే. కాని ప్రభూ ! వారు ప్రతిసంవత్సరమును రాజ్యమును వదలి రావలయుననిన నచటి రాజ్యవ్యవస్థ సక్రమముగ నడువదు. అందువలన రాఁజాలరఁట.

శ్రీరంగ : సాకులువెట్టి స్వతంత్రులగుటకు యత్నించు వీరినూరక విడిచిపుచ్చరాదు. వారు సామంతులైనప్పుడు సామంతులవలెనే నడుచుకొనవలయును. కాని యీ యాగడమేమి ? కప్పమెట్లు చెల్లింపకుండెదరో చూచెదము.

విజయ : అటులైన, మధుర చెంజినాయకులకును, మీకును యుద్ధము సిద్ధము.

శ్రీ రంగరాయల హృదయము నీ మాటలు కలఁచివైచినవి. రామరాజు దెసఁ దనదృష్టిఁ బ్రసారించెను. ఆతనిమోమున నిశ్చలత యున్నది. అతని కన్నుల మందహాసము చిందుచున్నది. శ్రీ రంగరాయలు తృప్తిఁజెందినాఁడు.

శ్రీరంగ: యుద్ధ మింక ననివార్యముగదా! విజయరాఘవనాయకా! సీవిక వారి పక్షమువానివలెఁ గనుపించుచున్నావు.

విజయ: చక్రవర్తీ! ఎంతమాట! నేను సర్వదా మీకు విధేయుఁడనే. ఆ మాట వేరుగఁ జెప్పవలయునా?

వెంకన్న హృదయమున నొక యానందతరంగ ముబికినది.

శ్రీరంగ: విజయరాఘవనాయకా! అయినచో మీసైన్యమును విజయ నగరసైన్యముతోఁ గలిపెదరా?

విజయ: మహాప్రభువుల యాజ్ఞ. అటులనే చేయుదును.

కవితా గోష్ఠులకు, నృత్యగాన విలాసములకు సమయముగామిఁ జక్రవర్తి సభ చాలించెను.

మరునాడు తెల్లవారుసరికి నేల యీనినట్లు నాలుగైదుమైళ్ళ యెడముగ నుభయ సైన్యములుఁ దారసిల్లినవి. శ్రీరంగరాయలవారి గజ తురగపదాతి దళములు వరుసగ నిలబెట్టఁబడినవి. వీనికి సూటిగ నెదిరి పక్షమునఁ దిరుమల నాయకుని గజపదాతి దళములు నిలుపఁబడినవి. శ్రీరంగరాయల యశ్వదళ మునకు సూటిగ దక్షిణ పార్శ్వమున విజయరాఘవ నాయకుల యశ్వసైన్య మున్నది. గజదళమున కెదురుగ వామభాగమునఁ జెంజినాయకుల పదాతిదళ మున్నది. మధుర చెంజినాయకుల యశ్వసైన్యము ప్రధాన సైన్యమునకు దూరమున నిలిపిరి. చెంజినాయకుని దళములు వామభాగమునను, మధుర నాయకునిదళములు దక్షిణభాగమునను గలవు. ప్రథమమున శ్రీరంగరాయలవారి పదాతిదళ మెదురుగనున్న తిరుమలనాయకుని పదాతిదళముఁ దాకినది. గజ దళము చెంజికృష్ణప్ప నాయకుని పదాతిదళమును సమీపించినది. రాయలవారి యశ్వదళ మొకటి విజయరాఘవ నాయకుల యశ్వదళమును డీకొనినది. రెండు దళములు నొకదానితో నొకటి కలిసిపోయినవి. అంతట నా రెండు సైన్య వాహినులును జేరి సరాసరి తిరుమలనాయకుని యశ్వసైన్యమును వెనుకకుఁ దరిమినవి. రాయల గజదళముతోఁ బోరుచున్న చెంజినాయకుని పదాతిసైన్యము బలము క్షీణించినది. దానికిఁదోడుగ విజయరాఘవుని గజదళము వచ్చినటుల వచ్చి యా పదాతిబలమునే పరిమార్పఁ దొడగినది. తిరుమలనాయకుని యశ్వ

దళములఁ దరిమి వేసినది. విజయరాఘవుని యాశ్వికసైన్యము వెనుకపాటుగ వచ్చి తిరుమలనాయకుని పదాతిబలముతోఁ బోరొనర్చుచున్న రంగరాయలవారి పదాతి బలమునకు బలముఁ జేకూర్చినది. వీరిరువురి బలములుఁ గలసి తిరుమలనాయకుని పదాతి దళములఁ దెగటార్చినవి. మధురనాయకుని సైన్యము యొక్క దురవస్థ చూడగనే శ్రీ రంగరాయల గజదళముతో యుద్ధమొనర్చు చున్న చెంజినాయకుని పదాతిదళము ధైర్యముఁ గోల్పోయి తిరోగమింపసాగెను. మధుర చెంజినాయకులకు విజయరాఘవ నాయకుఁ డొనర్చినమోసము కన్నులకుఁ గట్టినట్లయినది. ఆయన యాచరించిన విద్రోహమునకు మండిపడిరి. తా మన్నివిధములఁ జిక్కునఁ బడిరి. నలువైపుల శత్రువులు చుట్టుముట్టిరి. తాము మధ్యఁ జిక్కుకొనిపోయిరి. తమ యశ్వపదాతి బలములు చాలవఱకు ధ్వంసమైనవి. తాము చేయునదేమియునులేదు. శేషసైన్య సమీకరణమొనర్చి తుదిదాకఁ దెగించి పోరాడుటయే. అదియే నిశ్చయమొనర్చుకొనినారు. సంకులసమరమైనది. శ్రీ రంగరాయల గజబలమును, విజయరాఘవనాయకుల యాశ్వికసైన్యమును వైరిబలములతోఁ దీవ్రముగఁ బోరినవి. క్రమముగ మధుర చెంజినాయకుల యాశలు సన్నగిలఁ జొచ్చినవి. విజయరాఘవనాయకుఁడు తమకు మాటయిచ్చి యింత ఘోరమున కొడఁబడెనా ? ఈ క్రోధము వారి నింకను రణోన్మాదుల నొనర్చినది. పోరుఘోరమైనది. తుదకు మధుర చెంజినాయకులు శ్రీ రంగరాయల సైన్యధాటిని నిలువరించలేకను, ఆకస్మికముగ విజయరాఘవనాయకుఁ డొనర్చిన విద్రోహచర్యవలనను పరాజితులైరి. సంగరరంగమున నెటుచూచినను బీనుగపెంటలు, నఱుకఁబడి విరిగిన దేహములుగల గజములు, అశ్వములు, నెత్తురులమడుగులు, బీభత్సముగ, జుగుప్సాకరముగనున్నది.

మధుర చెంజినాయకులు సమాధాన పడకఁ దప్పినదికాదు. ఇరువురును శ్రీ రంగరాయలవారికిఁ దిరిగి కప్పములఁ గట్టుటకును, యుద్ధము వలననైన నష్టపరిహారమును జెల్లించుటకును నంగీకరించి యవశిష్ట సైన్యములతో మధుర చెంజినాయకు లెవరిదారిని వారు బట్టిరి. వారి వెనువెంటఁ గప్పములఁ దీసికొని వచ్చుటకుగాను భటులను బంపిరి. శ్రీ రంగరాయలవారు తమ కీ యుద్ధమునం దత్యంత కౌశలమును మేధాసంపత్తిని వినియోగించి విజయమునకుఁ గారకులైన

రామరాజుగారిని బహువిధముల నుతించి యమూల్యములగు బహుమతులను బిరుదములను బ్రసాదించిరి. విజయరాఘవ నాయకుల వారిని మధురచెంజి నాయకులనుండి చీలఁదీయుటయందు తన మేధా విభవము నంతయు వినియోగించి కార్యసాఫల్యముఁ గావించిన నియోగి వెంకన్నను మిగుల మెచ్చుకొని యుచితరీతిని సత్కరించిరి. విజయరాఘవులవారి కేమి యొసఁగినను తీరని ఋణమున్నది. ఆయనను గౌరవించు టెట్లు ?

శ్రీరంగ : విజయరాఘవనాయకా ! మీ సాహాయ్యము మరువరానిది. మీరు మాకిట్టి సాహాయ్యముఁ బొనర్చుట కిది రెండవ పర్యాయము. మీకెట్టి ప్రత్యుపకృతిఁ జేయవలయునో బోధపడకున్నది. మీకు వలయుదానినిఁ గోరుకొనుఁడు.

విజయ : చక్రవర్తుల కృపయున్నచో మాకంతియ చాలును. అయినను తాము కోరుకొను మనినారు గనుక ............

శ్రీరంగ : చెప్పుటకు సందేహించుచున్నారు !

విజయ : ప్రభువులతో నేకాంతముగ ............

శ్రీరంగరాయలు కనుసన్న నటనున్న పరిజన మంతయు వెడలి పోయినది.

శ్రీరంగ : మీకోరికను వెలిబుచ్చుఁడు.

విజయ : మాయాస్థానమున నష్టవిధములగు నాట్యములును, వానియందుఁ బ్రవీణలైన నాట్యకత్తియలుఁ గలరు. ఇంకను బలురకముల నాట్యము లున్నవి. కాని భరతమున మాత్ర మంత ప్రసిద్ధినందినవారు లేరు. ప్రభువుల సంస్థానమునఁ జంద్రరేఖయను నామె భరతమునందుఁ జతుర యని చెప్పుకొందురు. ఆమెను దాము మా యాస్థానమునకు బహూకరింప వలనుపడునా ?

శ్రీరంగరాయలవారి మొగమునఁ జిఱునవ్వంకురించినది.

శ్రీరంగ : ఇంతమాత్రపుఁ గోరికయేనా ? ఆమెను పంపుటకు మాకెట్టి యభ్యంతరమునులేదు. ఆమెను తప్పక మీకొసఁగెదము.

విజయ : అంతకుమించి నాకుఁ గావలసినదిలేదు.

విజయరాఘవనాయకులవారి హృదయమున నానందము వెల్లువలై ప్రవహించినది. తనకుఁ జంద్రరేఖను బంపుదు మన్న శ్రీరంగరాయలవారికిఁ దాను జీవితాంతము కృతజ్ఞుడుగా నుండెద ననుకొనినాఁడు. నాడంతయుఁ జంద్రరేఖమీది మధుర భావములతోఁ గడపెను.

౬

నాఁడు సభాసదన మంతయుఁ గ్రిక్కిరిసి యున్నది. విజయనగర సంస్థానమునుండి వచ్చిన క్రొత్తనాట్యకత్తియ యగు చంద్రరేఖ నృత్యమొనర్చును. ఆవేళఁ దంజాపురియందలి సభ్యజను లందరును సభా భవనమునుండి రనిన నతిశయోక్తి లేదు. విజయరాఘవ నాయకులవా రింకను సభకు విచ్చేయలేదు. సభయందు నాడు జరుగఁబోవు నృత్యముఁ గూర్చియు, నాట్యమును గూర్చియు, నాట్యకత్తియను గూర్చియు వివిధ ప్రసంగములు జరుగుచుండెను.

ఒకరు : చంద్రరేఖ భరతనాట్యమునఁ మిన్నయట. ఎంత ప్రవీణు రాలైనను మన యాస్థానమునందలి నాట్యకత్తియ లందఱను మించుశక్తి యీమె కున్నదా ?

కాళకవి : శక్తియున్నదా యను ప్రశ్నయేమి ? మన యాస్థానమునందలి వారే యందఱకన్న సమర్థురాండ్రని నీవు చెప్పుట మాత్ర మేమంత బాగుగ నున్నది !

పురుషోత్తమ దీక్షితులు : అసలు చంద్రరేఖయం దేవిధమైన ప్రత్యేకత, వైశిష్ట్యము లేనిచో విజయరాఘవనాయకులవా రామెనేల స్వీకరింతురు ?

కోనేటి దీక్షితులు : రాజుగారు దీసుకొని వచ్చుటకును నృత్యమునకును సంబంధమేమి ?

కాళకవి : మహారాజులు భరతశాస్త్ర పారంగతులు. అట్టి వారి యనుగ్రహమునకుఁ బాత్రయైన యామెఁగూర్చి యిచ్చకు వచ్చినట్లు మాట్లాడ రాదు.

కోనేటి దీక్షితులు : నేను మహారాజుగారి నేమియు ననలేదు. ఆమె భరత నాట్యము నేర్చుకొనినది. ఒక గురువు నేర్పినాఁడు. ఆయన నేర్పినటులఁ

జేయును. దీనిలో విశేషమేమున్నది? అది నేర్చుకొనిన మన యాస్థానపు నాట్యకత్తియలు మాత్రమామెకుఁ దీసిపోవువారగుదురా?

పురుషో: అటులకాదు. గురువు చెప్పును శిష్యుఁడభ్యసించును. ఒకా నొక శాస్త్రమున్నది. అది కొందఱి కలవడినటుల మఱికొందఱి కలవడదు. సంగీతమున్నది. కొందఱి గాత్రమున నది విచిత్రముగ నొదుగును. మఱి కొందఱికిని సంగీతమునకును సగమెఱుక. అటులే నృత్యమును. గురువునొద్ద నందఱును నొకేరీతి నభ్యసించెదరు. కాని యా నృత్యము కొందఱి కలవడి నట్లు మఱికొందఱు కలవడదు. అందుచే మన మెవరినిఁ దృణీకరింపరాదు. గురువువద్ద నేర్చుకొనునది విద్య. ఆ విద్యనే యామె మనకుఁ బ్రదర్శించును. విశేషమేమి యనరాదు. ఒక్కొక్క ప్రకృతి కొక్కొక్క విద్య సులువుగ స్వాధీనమగును. అది వారిలో ననితరముగఁ గనుపట్టును. అటులే యీమె భరతనాట్యమునఁ బ్రశస్తి నొందినది కావలయును.

మహారాజుగారు వచ్చుచున్నటుల భేరీకాహళ మృదంగ ధ్వానములు వినవచ్చినవి. సభయంతయు వారిరాక కెదురుచూడఁ దొడఁగిరి. విజయ రాఘవ నాయకులు యువతులు కైదండ యొసగ, వందిమాగధులు కైవారములు సలుపఁ దనకుమారు లిరువురుఁ వెంటరా నేతెంచెను. సభయం దెల్లరు నొక లిప్తకాల మాసనములనుండి లేచి నిలువఁబడిరి. మరల నందఱుఁ దమతమ యాసనమ్ములయం దుపవిష్టులైరి. విజయరాఘవ నాయకులకు దక్షిణ పార్శ్వ మున నున్న హేమపీఠిని మన్నారు దాసును, వామ పార్శ్వమున నున్న సువర్ణాసనమున చెంగమలదాసును నాసీనులైరి. నాట్యరంగమున యవనిక వేయఁబడియున్నది. సభయంతయు నాట్యారంభ మెప్పుడాయని నిరీక్షించు చున్నది. నాట్యసూచక ఘంటారావము వినవచ్చినది. యవనిక యపసరింపఁ బడినది. తోడనే సభాసదుల కన్నులు జిగజిగ మనునటుల మణిదీపములు మెఱసినవి. వివిధ వాద్యములు నారంభమైనవి. సభయందంతటను బరిమళములు గుబాళించినవి. ఇంతలో రంగమున నపర రతీదేవివలెఁ జంద్రరేఖ కనిపించినది. ఆమె కాలి గజ్జెలు ఘలఘల లాడినవి. ఆమె యొక గులాబి రంగుచీరఁ గుచ్చెలులు కుచ్చెలులుగఁ వెనుకకు విరిచి గోచిపోసి కట్టినది.

దాని బంగరు జరీయంచు పాదములనుండి యూరుభాగమువఱకు నర్ధచంద్రాకృతులుగఁ గట్టబడినది. పైని నీలిరంగు ముఖమలుకాసె బిగించినది. వక్షోమండలమున బంగరు జరీస్తనవల్కలమును గట్టినది. కేశములను రెండు పాయలుగ నల్లి వానిని రెండు చౌళ్లెములుగ రెండువైపులఁ జుట్టినది. శిరమున హిరణ్మయ కిరీటమున్నది. ఆమె ముంగామురారి, రత్నకంకణములు, ఉంగరములు, ముత్యాల మురువులు, ముత్యాలకంఠె, ముంగర, నందిదండలు, గంటల మొలనూలు, ఒడ్డాణము, పచ్చఱాపలకల పాదపల్లవము, అందియలు, గిలుకుమట్టెలు, కిరీటి, వజ్రాలసరులు ధరించినది. ఆమె కిరుపార్శ్వముల మెఱుపుదీగెలవలెనున్న యిరువురు యువతులు బంగారుపావడలు ధరించి విచిత్రాభరణములఁదాల్చి నిలుచుండిరి. వా రిరువురిమధ్యనున్న చంద్రరేఖ మణిమయదీపముల తళతళలు ప్రసరించి విద్యుల్లేఖలచేఁ గొలువఁబడుచున్న చంద్రరేఖవలెఁ దోచినది. ఆమె యట్లుగానంబడి సభకు నమస్కరించినది. రంగమునఁ దీపములకాంతి యించుకంత తగ్గింపఁబడినది. చంద్రరేఖ పాడుచు నభినయింప నారంభించినది.

(అసావేరి — త్రిపుట)

ఎందుకు పగచేసెనో కమలజుఁ డికనైన లెస్స వ్రాయడో
అందుకందుకు చెలు లమరికతో నున్నారు
చందమామ యీ రేయి చల్లనుండదే దైవమా ॥ఎం॥
పగవారితోఁజేరెనో సామిమనసు
బాళిలేనట్లాయెనో చిగురుదోడిరొ వినవెచిననాటి నాపైని
తగుమే లెల్ల దిగఁజేసెనో దైవమా ॥ఎం॥

ఇట్లు పాడుచు నభినయించునంతవఱకును సభాసదులెల్లరి దృష్టులనిమేషముగ నామెదెస నాబద్ధమైయుండెను. ఆమె యభినయమున నొక్కొక్కసారి పవనాహత వల్లరివలెఁ గంపించును. ఒక్కొకసారి నిద్రాలసవలె నభినయించును. ఎవరినో ప్రతీక్షించుచున్నటులఁ జూచును. ఆశనిరాశగాఁ గనుల నీరువెట్టుకొనును. ఆమె యభినయించినంతపర్యంతము నామె శరీరాంచల రేఖలు, అవయవ విన్యాసము, నేత్ర నిమీలనోన్మీలనములు, భ్రుకుటీవిలసనములు

చిత్రచిత్రములుగ భాసించి జగన్మోహనముగనున్నది. ఆమె హస్తములన్నియుఁ బట్టగలదు. ప్రతి సహృదయ హృదయమునను, ఆమె భరతశాస్త్రమంతయు రూపముఁగొని తనయెదుట సాక్షాత్కరించునటుల ననుభూతమైనది. తెర వేయఁబడినది. సభలోఁ జర్చలు బయలుదేరినవి.

కాళకవి : ఆమె యభినయ మేనాయికను సూచించుచున్నది ?

కోనేటి : విప్రలబ్ధవలె నున్నది.

పురుషోత్తమ : కాదు. విరహోత్కంఠితవలె నున్నది.

కామరుసు : ప్రభువులెట్లు భావించినారో !

విజయ : విప్రలబ్ధకును విరహోత్కంఠితకును మధ్యనున్నది.

శ్రీనివాసతాతా : అవును. ఆమె యభినయమటులనే యున్నది.

తిరిగి యవనిక యపసరింపఁబడినది. చంద్రరేఖ వేషము మార్చినది. కేశముల విరియఁబోసికొనినది. ఎఱ్ఱని పట్టుపావడ ధరించినది. అంచలములు బంగరురంగుగలిగి మణిదీపికలముందు విచిత్రముగ మెఱయుచున్నవి. బంగరుపూలు కుట్టిన వలిపపుఁ బైఁటవైచినది. ముత్యములుకుట్టి సుందరముగ నున్న నల్లని ముఖమలు కంచుకముఁ దొడిగినది. పరిమితముగ భూషణములు దాల్చినది. శిరస్సున దక్షిణపార్శ్వమున బంగరుచంద్రవంక యుంచినది. రత్నముల పాపటబొట్టుఁ దీర్చినది. రంగమున సాలంకృతములైన మూడు ఘటము లుంచఁబడినవి. ఇరువురు యువతులు నిరువైపులను, చంద్రరేఖ మధ్యగను పేరణినృత్యము సల్పిరి. ప్రేక్షకులామె పేరణి దర్శించి దిగ్భ్రాంతు లైరి. ప్రతిదినమును, భాగీరథి పేరణినృత్యము సల్పును. ఆ నృత్యమునకు నీ నృత్యమునకు నెంత తారతమ్యము ! ఈమె నృత్యము, నాట్యము, అభినయము దివ్యములుకాని వేరుగావు. నాట్యాంతమున నామె సోయగముతో సభానమస్కార మొనర్చి వినీతభావ భంగిమమున నిలిచినది.

విజయరాఘవనాయకులవా రొక బంగరుపళ్ళెరమున ముత్యములు, రత్నహారములు, బహుమూల్యాంబరములు, వివిధభూషణములు నునిచి యామె కందఁజేసి బహూకరించిరి. ఆమె వానిని సవినయముగ స్వీకరించి యా పళ్ళె

రమునఁ గొన్నిముత్యము లుంచుకొని యందియలు ఘల్లుఘల్లనుచు మధురముగ మ్రోయఁ గంకణములు శ్రుతికింపుగ ఝణఝణ ధ్వనులనీన విలాసముగ నడచివచ్చి ప్రభువువారి పాదములఁ గొన్ని ముత్యములఁ జల్లినది. ఆ ముత్యములు విజయరాఘవనాయకులవారి పాదములఁబడి తమ కా భాగ్య మబ్బినందులకు గర్వించుచున్నటుల ధవళరోచుల వెలిగ్రక్కుచు హేమపీఠమునఁ జారినవి. గండపెండారపు నీలిమణులకాంతి వానిమీఁదఁ బ్రసరించి యవి యానీలములవలెనాయెను. విజయరాఘవనాయకుని మందహాస సుందర సితాపాంగచ్ఛటలు చంద్రరేఖశరీరమునంతయుఁ గిలికింతలుపెట్టి జారిపోయినవి. ఆమె నిలువెల్ల మధురలజ్జాపరికలితమూర్తియై విలాసముగ విజయరాఘవ నాయకులవారిని గడగంటఁజూచి మందహాస మొనర్చినది. రాజుకన్నులుజ్జ్వలములైనవి. రంగాజమ్మ మనస్సున నేదో కలుక్కుమనినది. వెలికేమియుఁ దెలియరాకుండఁ గూర్చుండెను. చంద్రరేఖ రంగాజమ్మనుఁజూచి యామె నిరుపమానాద్భుత సౌందర్యమునకు దిగ్భ్రాంతినొందినది. విజయ రాఘవనాయకులు వేఱొక పళ్ళెరమున నిండుగ చంద్రరేఖ కిచ్చినటువంటి యాభరణములు, అంబరములు రంగాజమ్మకు నిప్పించెను. రంగాజమ్మ వానిని స్వీకరించి నమస్కరించినది. ఆమెకనులలో నొక నీలినీడ కానిపించి మాయమైనది. అది యెవరును గమనించరానిది. చంద్రరేఖ కామె ఠీవిని జూడగనే యాశ్చర్య మొదవినది.

విజయ : కాళకవిశేఖరా! పెద్దివాసుగా రీమాసైన రాలేదు! కారణమేమి?

కోనేటి : ప్రభువులు మధుర చెంజినాయకుల రణమున నిర్జించి శ్రీరంగ రాయలవారిచేఁ బ్రశంసలందుకొని వచ్చినవిషయ మాయనకు తెలిసి యుండదేమో!

కాళకవి : ప్రభువుల విజయమున కాయన యెంతయో సంతసించినారు.

కోనేటి : అంత సంతసించిన యాయన రాజసభ కెందులకు రాగూడదు?

పురుషో : తెలిసియు రాకుండుటలో నాయనకు రాజసభయనినఁ దిరస్కార భావ మున్నటు లున్నది. ఎంత భక్తులైనను రాఁజావమానము చాలదోషము.

కాళకవి : ఆయనకు రాజాస్థానమనినఁ దిరస్కారబుద్ధి యేమాత్రమును లేదు. రాజుగారనిన గౌరవముకూడ చాలనున్నది.

కోనేటి : మీ మాటలన్నియుఁ జాల నద్భుతములుగ నున్నవి. అంత గౌరవము కలవాఁడైన రాజుగారు వర్తమాన మంపినను రాకుండుటలో నర్థ మేమైననున్నదా ? ఆయన నిరతము ధ్యానించు రాజగోపాలదేవునకును, రాజు గారికిని భేదమేమున్నది ? ఆయన యర్చావతారము. 'నావిష్ణుః పృథివీపతిః' అను నార్ష వాక్యా ననుసరించి ప్రభువులు పంశావతారమే.

విజయ : దీక్షితచంద్రు లట్లనరాదు. గోపాలదేవునకును మాకును నభేదవ్యవసాయముఁజేయకుఁడు. ఆదేవుని యంశలేమైన మాలో నుండవచ్చును. అసలు పెద్దిదాసుగారిని బోలిన భక్తులు సభకు వచ్చిన నానందింత మనుకొను చున్న మన సభకు వారు రాకపోవుట కేదేని బలమైన కారణ ముండవలయును.

పురుషో : ఆ కారణము కాళకవివర్యునకే తెలియవలెను.

విజయ : కాళకవీంద్రా ! మీ యభిప్రాయ మింకేమైన నున్నదా ?

కాళకవి : మహాప్రభూ ! ఆయన మీ కవితాగోష్ఠులకుఁ గాక తక్కిన సమయముల రాఁగలరనుటలో సందియములేదు.

విజయ : కవితాగోష్ఠులున్నచో నెందులకు రానిచ్చగింపరు ?

కాళకవి : ఆయనకు శృంగారాదులు సరిపడవు. ఆయన యెల్లవేళ లందును భక్తియుతములగు కీర్తనలు వ్రాయును. భక్తి ప్రధానములగు గ్రంథ ములఁ జదువుచుండును.

కోనేటి : వారి సిద్ధాంతము ననుసరించి భగవంతుఁడే పురుషుఁడు. భక్తులందరు స్త్రీలుగదా ! వారికి శృంగారము దూరముకాదు.

కాళకవి : వారి యభిప్రాయ మట్టిది.

విజయ : మార్గశిర పౌర్ణమినాడు మన సభకు క్షేత్రయ్యగారు వత్తురు. ఆయన మహాభక్తుడు. ఆనాటికైన మీరు పెద్దిదాసుగారిని సభకుఁ దప్పక తీసుకొనిరావలెను. నాటిసభకు వచ్చుటకు మా యాజ్ఞయని తెలుపుడు.

కోనేటి : నవరసములలో శృంగారమునకుఁ బూర్వకవు లగ్రస్థానము నిచ్చిరి. అట్టి శృంగారము మన యాస్థానమున నత్యంతముగఁ బోషింపఁ బడుచున్నది. ఆ శృంగారమును నిరసించుట పెద్దిదాసుగారికిఁ దగనిపని.

కాళకవి : ఆ మాట మీరుననఁగూడదు. రాజుగారి భావమునకు భిన్నమగు భావమే యుండరాదనుట యేమంత బాగుండును? ప్రభువులు గొప్పవారు. కాని వారును మానవమాత్రులే. ప్రతిజీవికిని రకరకముల మనోభావము లుండును. భావభేద మున్నంత మాత్రమున రాజుగారియం దాయనకు గౌరవమే లేదనుట సముచితముగాదు.

ఆ ప్రసంగ మప్పటి కాపివేయఁబడినది. రాజుగారి యాజ్ఞానుసారము రంగాజమ్మ తన మన్నారుదాస విలాసమునుండి కొంత భాగముఁ జదివి సభాస్తారుల మనముల మధుర మధుర భావములను గ్రుమ్మరించినది. తరువాతఁ గాళకవిలేచి తన రాజగోపాల విలాసమునందలి రసవత్తర ఘట్టములను కొన్నిటిని వినిపించినాఁడు. చివరకు విజయరాఘవ నాయకులవారి ధీరత్వమును సూచించుచు

సీ॥ చేరి కొల్చినఁ గల్గు తారహారావళు
లనుమాట నిజమె పాండ్యక్షితీంద్ర!
కని కొల్చినను గల్గు కనకకోటీరంబు
లనుమాట నిజమె మద్రాధినాథ!
భక్తిఁగొల్చినఁ గల్గు బాహుకేయూరంబు
లనుమాట నిజమె కొంగావనీశ!
నమ్మి కొల్చినఁగల్గు నవరత్న కమ్మలు
ననుమాట నిజమె యాంధ్రాధినాథ!
అనుచు మును మంత్రు లనుమాట లనువదింతు
రనుదినంబును సింజిత వ్యాజమునను
విజయ రాఘవ మేదినీవిభుని యంఘ్రి
గండపెండెపు బొమ్మలై యుండు దొరలు.

అని చదివెను.

సభ యంతయు జయజయ ధ్వానములతోఁ బిక్కటిల్లినది. సభ ముగిసినది. చంద్రరేఖ సరాసరి తనకు విజయరాఘవుల వారిచే నొసఁగఁబడిన భవనమునకు వెడలినది.

అది రెండంతరువుల మేడ. లోన విశాలములగు గదులున్నవి. గదిలో నేలమీఁదఁ బాలగచ్చు చేయఁబడియున్నది. ద్వారబంధములఁ జిత్రచిత్రములగు లతలు, పువ్వులు చెక్కఁబడినవి. మేడ నానుకొని ప్రహరిలోపల నొకచిన్న పూఁదోట యున్నది. దానియందుఁ బలువిధముల పూలమొక్క లున్నవి. చంద్రరేఖ భవనమునకుఁ బోయినది; కాని యామె మనమున రంగాజమ్మ మూర్తియే గన్పట్టుచున్నది. ఆమె యెంత సౌందర్యవతి! మానవ దుర్లభ మైన దా సౌందర్యము. ఆమె కనులలో నెంత తీవి కనుపించుచున్నది! ఆమె యేదియైన మాటాడినచో నాజ్ఞవలె నుండును. ఆమె యెవరో! ఆమె కంఠస్వర మెంత మధురమైనది. సభనంతయు మధుర భావవీచికలం దోఁప్పదోగించినదే! ఆమెకవితాగాన మొనర్చునప్పుడు స్వర్గసీమలకుఁ గొంపోవుచున్నట్లున్నది. అట్టి సౌందర్యము, గాన మధురిమ, కవితావిభవము నొకచోఁ గూడియుండుట దుర్లభము. అవియన్నియు నీమెలో మూర్తీభవించియున్నవి.

ఈమెకును రాజునకును సంబంధమేమైనఁ గలదా? ఆమె మనము నందు రంగాజమ్మను గూర్చిన భావన వినా యితర భావము లిముడుటలేదు. దాసి వచ్చినది. "అమ్మా! భోజనము సిద్ధమైనది. స్నానమునకు నీరు తోడి సిద్ధముఁ జేసితిని, వత్తురా?" యనినది.

చంద్రరేఖ: అట్లేకాని, రంగాజమ్మ యెవరే?

దాసి: రంగాజమ్మగారా? ఆమె యొక సుప్రసిద్ధమైన కవయిత్రి.

చంద్రరేఖ: ఆమెతో మీ రాజుగారి కేమైన ........

దాసి: అయ్యో! ఆమె నిచటికి రాజుగారు స్వయముగఁ దీసికొని వచ్చిరి.

చంద్రరేఖ: ఆమె యసలీ పురవాసిని కాదన్నమాట.

దాసి: కాదు. ఆమెను ప్రభువువారు పదునైదు సంవత్సరముల క్రిందటఁ దీసికొని వచ్చిరి.

చంద్రరేఖ : పదునైదు సంవత్సరముల క్రిందటనా !

దాసి : ఈమె వచ్చినప్పటి నుండియుఁ బ్రభువులు రాణిగారి సంపర్కమే వదలినారని చెప్పుకొందురు.

చంద్రరేఖ : అటులనా ! సరి. అయినచో రాజుగారు నన్నిచటి కేల దెచ్చినారో నీకుఁ దెలియునా ?

దాసి : మీరీ సంస్థానమునఁ గొఱవడియున్న నాట్యపద్ధతియందు నిపుణులట.

చంద్రరేఖ : రంగాజమ్మను మొదటఁ బ్రేమించియే ప్రభువులు తీసుకొని వచ్చినారన్నమాట.

దాసి : అవును. వచ్చిన కొలఁదికాలముననే యామె కొన్ని గ్రంథములు వ్రాసి ప్రభువులకుఁ గృతినిచ్చినది. క్రమముగ నాస్థాన కవయిత్రియై ఖ్యాతిఁ గాంచినది.

చంద్రరేఖ : ఊహు. రాణిగారిపై విముఖతకుఁ గారణము రంగాజమ్మ ప్రోద్బలమా ?

దాసి : అటులనుకొనరాదు. పాప మామె రాణిగారిపై ననుగ్రహ ముంచుడని శతవిధములఁ జెప్పునట. ఆమెవలనఁ దప్పేమియు లేదు.

చంద్రరేఖ : ప్రభువు........

దాసి : అవును. ప్రభువులు మొదటినుండియు నింతియే. కాని రంగాజమ్మగారు వచ్చిన పిమ్మట మాత్ర మట్టి ప్రవర్తన కానుపించుటలేదు.

చంద్రరేఖ : అటులనా ! రంగాజమ్మ........

దాసి : ఏమియో చెప్పఁబోవుచు నాపివేసినారు.

చంద్రరేఖ : ఆఁ ఏమియును లేదు.

వారిరువురును స్నానపుగదికిఁ బోయిరి. రంగాజమ్మ వచ్చిన పిమ్మట విజయరాఘవనాయకులవా రిట్లుండిరనుటలో సందియము లేదు. అకస్మాత్తుగా చంద్రరేఖ మనమున నేదో ప్రతికూలభావము తోచినది. రాజునకు నామీఁద మరులులేవుకద ! ఇట్లనుకొనుటలో నామె నిలువెల్ల వణకినది. దాసి యదేమని

యడిగినది. చంద్రరేఖ సమాధానము చెప్పలేదు. నాడు కృష్ణదశమి. రోహిణీ నక్షత్రమును వీడిన చంద్రుఁడు, అనూరాధను వీడు చంద్రుఁడు, చిత్రానక్షత్ర సంయోగలగ్న మానసుఁడగుచున్నాఁడు. కృష్ణదశమినాటి చంద్రుఁడే యాశ్చర్యము! అస్తమించుచుండియుఁ బ్రాగ్దిశావలంబియై యున్నాఁడు.

౭

పెద్దిదాసు తన యారామమునఁ బూలమొక్కలకుఁ బ్రోది సేయుచున్నాఁడు. ప్రాతర్మందానిలములు గట్టులనొరసి ప్రవహించు సహ్యజమీఁదఁ దారాడుచువచ్చి తోటయందంతటను వ్యాపించుచున్నవి. వికసితకుసుమములతోఁ దోట సుందరముగనున్నది. బాలభానుని మసృణారుణ కిరణజాల మా ప్రసవములపైఁ బ్రసరించి విచిత్రముగ వెలుగొందినది. పెద్దిదాసు నదికిఁ బోయి స్నానమొనర్చి ధ్యానమొనర్చుకొను నిమిత్తము కృష్ణవిగ్రహము కడకుఁ బోయి యచటి స్థలమును శుభ్రపరచుకొనఁ దొడఁగినాఁడు. ఇంతలో రాయసము వెంకన్న యచటికి వచ్చెను.

వెంకన్న : నమస్కారములు.

పెద్దిదాసు మొదట వెంకన్నను గుర్తింపఁజాలక పోయెను. ఊరక చూచుచు నిలబడినాఁడు.

వెంకన్న : నన్ను మఱచిపోయితిరా? వెంకన్నను.

పెద్దిదాసు : ఓహో! నీవా? ఎప్పుడు రాక? పెనుగొండ విశేషము లేమి?

వెంకన్న : విశేషము లేమున్నవి. ఎల్లరుఁ గుశలముగనే యున్నారు. నే నిచటికివచ్చి సుమారొక నెలయైనది.

పెద్దిదాసు : నెలదినములైనదా? అసాధ్యుఁడవే! యుద్ధమునకు బూర్వమే వచ్చితివన్నమాట.

వెంకన్న : అవును యుద్ధమునకుముందే వచ్చితిని.

పెద్దిదాసు : అయిన నీ కిక్కడఁ గాఁదగిన కార్యము లేమైనఁగలవా?.... లేక....?

వెంకన్న : అవును. కావలసినయవసరము లుండియే వచ్చితిని.

పెద్దిదాసు : ఆ యవసరములు నేను తెలిసికొనఁ దగినవేనా ?

వెంకన్న : దానికేమి ? విజయరాఘవనాయకులవారి యాస్థానమున నేదేని పదవి సంపాదించవలెనని వచ్చితిని.

పెద్దిదాసు : వచ్చినందుకు కార్యసాఫల్యమైనదా ?

వెంకన్న : మహారాజులు నా కనుగ్రహమున రాయసముపదవిఁ బ్రసాదించినారు.

పెద్దిదాసు : బాగున్నది. నీ వదృష్టవంతుఁడవే.

వెంకన్న : మీరు నన్నదృష్టవంతుఁడ వనుచున్నారు. ఎన్నిమారులు సమాచారమంపినను మీరు మాత్రము రాజసభకుఁ బోకున్నారట. ఎందువలన ?

పెద్దిదాసు : నాకు రాజసభాగౌరవాదులపై వాంఛలేదు. ఈ యారామము, పూలు, శ్రీకృష్ణదేవుఁడు ఇంతకన్నఁ గావలయున దే ముండును ? ఈ తోటఁ బోషించుకొనుచు నీ సుమములతోఁ కృష్ణదేవు నర్చించుకొనుచు నా జీవితమును పరమానందముగఁ గడుపుకొందును.

వెంకన్న : మీ మాటఁ గాదనను. కాని ప్రభువులు తామై మీ కెన్ని మారులో యాహ్వానములఁ బంపినారట. మీరొకపర్యాయమేని రాజసందర్శన మొనర్పకున్నారు. వారేమనుకొందురు ?

పెద్దిదాసు : ఏమనుకొందురు ? ఏమైన ననుకొనుటకును, అనుకొన కుండుటకును నాకు రాజుగారియందు గౌరవము లేకుండినఁగద.

రాయసము వెంకన్న మారాడలేదు. గుఱ్ఱపుడెక్కల ధ్వని వినవచ్చినది. వెంకన్న యారామ ప్రవేశమార్గముపైపునకుఁ జూచుచున్నాఁడు. ఒక జాత్యశ్వమునుండి దిగి, యువరాజు మన్నారుదాసు తోటలోనికిఁ బ్రవేశించి పెద్దిదాసునకు నమస్కరించినాఁడు. రాయసము వెంకన్న మన్నారుదాసును మిగుల గౌరవించినాఁడు. పెద్దిదాసేమియు ననలేదు. ఊరకఁ గూర్చుండి యుండెను. వెంకన్న మన్నారుదాసును దనప్రక్కనున్న నాపరాతిపై నాసీనునిఁ జేసెను. వెంకన్నకుఁ బెద్దిదాసు తత్వ మేమియు బోధపడుటలేదు. "యువరా

జంతటివాఁడు వచ్చిన మర్యాదఁజేయఁడేమి? ఈయన దొక విచిత్ర ప్రకృతి వలె నున్నది. యువరాజునకుఁ బెద్దిదాసుమీఁదఁ గోపమురాదేమి? ఆశ్చర్యముగ నున్న" దనుకొనినాఁడు.

వెంకన్న : పెద్దిదాసుగారూ! యువరాజుగారు వచ్చి నమస్కరించిన మీ చేయు మర్యాద లివియేనా? ఇంత నిర్లక్ష్యభావ మేమి?

పెద్దిదాసు : మన్నారుకు నేను మర్యాద చేయకపోయినను గోపము రాదు.

మన్నారు : వెంకన్నగారూ! పెద్దిదాసుగారు నాకు గౌరవముఁ జేసిననే గోపము వచ్చును. వారు పెద్దలు. నాకు గురుతుల్యులు.

పెద్దిదాసు : మన్నారెప్పుడును నిచటికి వచ్చిపోవుచునే యుండును. నేనెప్పుడు నింతే. మన్నారు కెన్నఁడును గోపమురాలేదు.

వెంకన్న : వారు కినియకుండు టటుంచుడు. మనస్థానము నెఱిఁగి మనము నడచుకొనవలదా? మన్నారా!

మన్నారు : వెంకన్నగారూ! పెద్దిదాసుగారు మహాభక్తులు. వారనిన నాకు భక్తిగలదు. మీరట్లనరాదు.

వెంకన్న కొలది సేపటివఱకు మాటాడలేదు. తరువాత పెద్దిదాసు నుద్దేశించి యనినాఁడు :

వెంకన్న : నిన్నటిసభకు మీరు రానందులకుఁ బ్రభువులకుఁ గోపము కూడ కల్గినదాయనునట్లు మాటాడినారు.

పెద్దిదాసు : నిన్నటి సభయని నొక్కి పల్కుచున్నావు. విశేషమేమైన నున్నదా?

మన్నారు : నేను చెప్పెదను, వినుడు. మా నాయనగారు కర్ణాటాధీశ్వరులకు సాయమొనరించి, మధుర చెంజినాయకుల మాయోపాయమున నోడించి యా కర్ణాటాధీశ్వరుని సంస్థానమునందుండిన చంద్రరేఖయను నొక నర్తకినిఁ దీసికొనివచ్చిరి.

పెద్దిదాసు : చంద్రరేఖ కంత ప్రాధాన్యమిచ్చుట కామెయందున్న ప్రత్యేకత యేమి ?

మన్నారు : ఆమె భరతనాట్యమునందుఁ బ్రవీణయట ! అదియుఁగాక మహారాజులవారికోర్కెఁ గాదనుట కెవ్వరు సాహసింతురు ?

మాటాడుచున్నంత సేపును మన్నారు దాసుని వదనమున నొక విధమైన నీరసభావమే కనిపించినది. ఆయన కీ చంద్రరేఖరాక యనిష్టమని యవగత మగుచున్నది. రాయసమున కాభావ మిదమిత్థమని తేలలేదు.

వెంకన్న : యువరాజా! మీరు మాటాడువైఖరి చమత్కారముగనున్నది.

మన్నారు : ఇందుఁ జమత్కార మేమున్నది ? నిజమంతియ. లేకున్న మా నాయనగారి వయస్సేమి ? ఆయన ప్రవర్తనయేమి ?

వెంకన్న : యువరాజులు తొందరపడుచున్నారేమో ! రాజుగారు పరమ భక్తులు, రణధీరులు, దానశీలురు. వారినిట్లు నీరసముగ మాటలాడుటఁ జూడ చిత్రముగనున్నది. వర్షాకాలమున నొకప్పుడు ప్రభువులు వంటచెఱు కభావమై తమ భవనము నొకదానినిఁ బడగొట్టించి యా కలపతో వంటఁ జేయించి బ్రాహ్మణ సహస్రమునకు భోజనము పెట్టించి, తరువాతఁ దాము భుజించిరట. పెద్దిదాసుగారూ ! ఈ వృత్తాంతము తమకుఁగూడఁ దెలియుననుకొందును.

పెద్దిదాసు : తెలియకపోవుటేమి ? ప్రభువుల దానశీలత కర్ణున కెన యగును.

మన్నారు : అసలాగాథయేమి ?

పెద్దిదాసు : మీ నాయనగారికి ప్రతి దినమును సహస్ర బ్రాహ్మణుల కుదయమున జాముతిరుగకమున్నె సంతర్పణఁజేయు దీక్షయున్నది. అది మీకునుఁ దెలియును. ఆ సంవత్సరమున వర్షములు బహుళమై జలప్రళయము వలె మాసములకొలదిఁ దెఱపి యీయకుండెను. ఒక యింటిమనిషి వేఱొక యింటి కరుగుటయే దుర్లభమయ్యెను. అప్పటి కింకను మీరు జన్మించియుండ లేదు. బయటినుండి వంటచెఱకుఁదెచ్చుట కిమ్ము గలుగకుండెను. సంగ్రహించి యుంచిన వంటచెఱకంతయు వ్యయమయ్యెను. వంటచేయుటకే వీలులేక

పోయినది. అప్పు డన్నదానశాఖ కార్యకర్తలు విజయరాఘవనాయకుల వారిం జేరవచ్చి 'మహాప్రభూ! దివారాత్రము లెడవిడువక వర్షములు పడుచుండుటచే నెక్కడఁజూచినను జలప్రవాహములు నదుల ననుకరించుచున్నవి. గృహముల వీడి మనుజ సంచారమేలేదు. ఇంధనములకుం జాల చిక్కువాటిల్లినది. నిలువ యున్న కట్టెలన్నియు నేటితో వ్యయమైనవి. రేపటినుండి బ్రాహ్మణసంతర్పణ సాగుట దుర్లభము. కనుక సంతర్పణను నిలిపివేసి వర్షములు వెలసి బయటి నుండి కట్టెలు వచ్చినపిమ్మట యథావిధిగం దిరిగి యత్నముం జేయవచ్చు'నని మనవిఁజేసిరట.

ఆ నుడువులు ప్రభువులకుం గర్ణకఠోరములైనవి. దిగ్గునలేచి 'అటులైన మేమును నగరియందలివారును నంతవఱకు నిరాహారులుగ నుండవలసినదేగాని భోజనముకూడ' దని నుడివిరి. కార్యకర్తలు గడగడ వడఁకుచు, 'స్వామీ! మాయం దెట్టిదోసమునులేదు. తమయాజ్ఞ ననుసరింతు' మనిరట. ప్రభువు లంతట మిద్దెలను ప్రాంతవానిని వీడఁగొట్టించి దూలములు పలకలు తలుపులను జీర్పించి వానిని వంటచెఱకుగ నుపయోగించునట్లు చేసి బ్రాహ్మణ సంతర్పణ మునకు మాత్రము లోటులేకుండ నడిపించ వలసినదిగ సెలవిచ్చిరి. అట్లు రెండు మూడు దినములు మరల సంతర్పణ సాగినది. తిరిగి వంటచెఱ కభావ మయ్యెను. కార్యకర్త లా విషయమును రాజునకు నివేదించిరి. అంతటం బ్రభువులు రాచనగరునందలి యనర్ఘమైన వస్త్రాదులన్నియుం దెప్పించి యగ్రా ణమునన్న యంగళ్ళన్నిటియందునుగల నూనెకుండలు, నేతికుండలుం దెప్పించి వానియందావస్త్రములను ముంచి వానిఁదగులఁబెట్టి వంటచేయుడని సెలవిచ్చిరి. ఆ ప్రకార మొనర్చిన మీఁదటం బొగచుట్టుముట్టి వంటవారెంత శ్రమపడినను పాకము దుర్లభమైనది. బ్రాహ్మణభోజనమునకుం బూర్వము తాము భుజింపమని ప్రభువుల వ్రతము.

ఇది యిటులుండ శ్రీరంగమున వెలసియున్న దేవి నాంచారమ్మ యమ్మవారి ముత్యముల ముక్కర కానరాక యా దేవళము నందలి యధికారి స్థానికులను, అర్చకులను రప్పించి యందులకు సమాధాన మిందని యతికఠిన ముగ నడిగిరట. అమ్మవా రంతట నొక బ్రాహ్మణి ముత్తైదువయం దావేశించి 'వీరు నిరపరాధులు. వీరిని దండింపనేల? నాభక్తుఁడు విజయరాఘవనాయకుడు

బ్రాహ్మణసంతర్పణమునకు వంట శీఘ్రముగఁగాఁ ప్రతభంగమున కియ్య కొనక తాను నుపవాసమున్నాడు. కనుక నేనా వంటశాలకుఁ బోయి వంట త్వరగ నగునట్లు చేసినందున నచ్చటి పొగ నాకండ్లలోనికిఁ బోయి యిబ్బంది పెట్టినది. అప్పుడు బియ్యముఁ గడుగు కొప్పెరయొద్ద ముక్కు జీదివేసితిని. ముక్కెరయూడి తొట్టెలోఁ బడినది' అని చెప్పినది.

అంతట దేవాలయాధికారి, స్థానికులను, అర్చకులను దండింపక పిలిచి పుచ్చి యాక్షణమునసే రాజగు చొక్కనాథుని సముఖమున నీవిషయమును వినిపించెను. చొక్కనాథులవారి యనుజ్ఞ ననుసరించి వారి భటవర్గమును గుడిస్థానికులును తంజావూరునకు వచ్చి విజయరాఘవనాయకులవారి కీ విషయ మును నివేదించిరి. ప్రభువులు దీనినివిని యాశ్చర్యమునొందిరి. అంతఱును వంటశాలనుజేరి కడుగుతొట్టిఁ బరిశోధింపఁజేసిరి. అమ్మవారిముక్కఱ యందుండెను. రాజుగారా ముక్కఱకు నమస్కరించి కండ్లకద్దుకొని శిరమునఁ జేర్చుకొని యానందబాష్పములు జాలువార నీ యపచార మే రీతిగఁ బాపు కొందుమని యమ్మవారినిఁ దలంచుకొని నమస్కరించిరి. పిమ్మట నట్టివే పండ్రెండు ముక్కఱలను ముత్యములతోఁ జేయించి యందు రత్నములఁ దాపింపఁజేసి వానిని, యిరువదినాలుగువేల వరహాలనుకలిపి, అమ్మవారి ముక్కఱతోసహా పల్లకియందుఁ బెట్టించి నగారా, నౌబత్తు మొదలగు నష్టావశ వాద్యములతో నటనాటకులతో శ్రీరంగమునందలి యమ్మవారి సన్నిధికిఁ బంపిరి. అదిమొదలు మీ నాయనగా రమ్మవారిసన్నిధికిఁ బోవుటకు తంజావూరు నకును శ్రీరంగమునకును మధ్యనున్న మూడామడల మార్గమునకు నేబది జోళ్ళ బోయీలను నిరంతరము తపాలయుంచిరి.

వెంకన్న : మీరు ప్రభువులనుగురించి యింతగఁ జెప్పుచున్నారు, వారి యెడల మీకిట్టి గౌరవమున్నది. వారిసభకుమాత్రము మీరరుగరు. అచటి కవిబృందమంతయు మీ రాక కెదురుచూచుచున్నది.

పెద్దిదాసు : ఆ సభయంతయు శృంగారప్రధానముగ నుండును. అందు జరుగు చర్చలు, నృత్యములు, కవితాగానములు నన్నియు శృంగారరసోద్దీప కములు. అదియుఁ గేవలము దైహికసంబంధమైన శృంగారము. సభయంతయు

గామచర్చాదూషితము. నా ప్రకృతి కవి సరిపడనివి. అట్టితావులం దెట్టివారికైనఁ జిత్తవైకల్యము కలిగితీరును. శృంగారరసమునందలి కాముకభావము జాంతవమైనది. అట్టి కామోద్దీపిత శృంగారము రుచింపకపోవుటయే నా సభావైముఖ్యమునకుఁ గారణము.

మన్నారు: అవును. పెద్దిదాసుగారు నుడివిన దక్షరశః నిజము. మా నాయనగారిసభ కేవల మటులేయున్నది. వారు తమవయస్సునఁ జేయరాని కార్యము లొనర్చుచున్నారు. మహాపతివ్రత మాయమ్మగారిఁ జూచిన నాకు గుండెతఱుగుకొనిపోవుచున్నది. ఆమె దినదినము శుష్కించిపోవుచున్నది. రంగాజమ్మగారి నగరప్రవేశమే యీ దుఃస్థితికంతకుఁ గారణము. తిరిగి చంద్రరేఖ యొకతె వచ్చినది. ఏమిగానున్నదో, ప్రభువువారి కిది తగనిపని.

రాయసము వెంకన్న మన్నారుదాసు చెప్పుచున్నదంతయు నతిశ్రద్ధగ వినుచుండెను. ఆయనకనులలో నేదియో తళతళలాడినది. పెద్దిదాసాయన వైఖరి గనిపెట్టుచునేయున్నాఁడు. ఆయనముఖమున వైవర్ణ్యము తోచినది. మన్నారుదాసు వదనసీమ నించుకంత క్రోధ మంకురించినది.

వెంకన్న: యువరాజుగా రెన్నియైనఁ జెప్పవచ్చును. సాక్షాత్తు శ్రీకృష్ణస్వరూపుడైన తండ్రిగారి నంత తిరస్కారముగ మాటలాడుట భావ్యముగ లేదు. అంత భక్తాగ్రేసరుని, దానశీలుని........

మన్నారు: అవునటులేయుండును. అయినను మీ కేమి తెలియును లెండు.

పెద్దిదాసుని హృదయమున నేదో శిక్షితమైనది.

వెంకన్న: అంత తెలియరాని రహస్యమేమైన నున్నదా?

మన్నా: మహారాజుగారీ దానధర్మములన్నియు నెందులకుఁ జేయుచున్నారో నాకుఁ దెలియును.

వెంకన్న: మహారాజుల దానశీలతనే శంకించుచున్నారా?

మన్నారు: శంకించుటకాదు.

వెంకన్న: కానిచో మరియేమందురు?

మన్నారు : మహారాజుగారు దామొనర్చిన ఘోరపాతకములనుండి విముక్తులగుటకు సల్పు కార్యములివి.

వెంకన్న : ఎంతమాట ! మహారాజుగారును ; ఘోరపాతకములునా !

మన్నారు : అవును. తమ యగ్రజు లిరువుర కనులఁ బీకించివేసిన మహాపాపము మీ కెట్లు తెలియును ? ఆ పాపోపశమనమునకే యీ దానధర్మ నియతి.

రాయసము వెంకన్న మనమున నొక విచిత్రమగు భావము తోచినది. వా రిరువురియొద్ద సెలవుదీసికొని వెడలిపోయినాఁడు. పెద్దిదాసు మన్నారుల మధ్య కొన్ని నిముసములు నిశ్శబ్దముగఁ గడచినవి.

పెద్దిదాసు : మన్నారూ ! నీవు పసివాఁడవు. నీ కేమియుఁ దెలియదు.

మన్నారు : నే నేమి చేసితిని ?

పెద్దిదాసు : వెంకన్నయెదుట నిన్నిమాటలంటివి. వాఁడు వట్టికుత్సితుఁడు· కయ్యాలమారి. వానిది వక్రబుద్ధి. వాని యాలోచనలన్నియుఁ గుటిలములు. తలఁచుకొనినఁ గూడుకొను కాపురములఁ గూలఁద్రోయఁగలఁడు. వాని ప్రకృతియే యట్టిది. ఈ మాటల నాధారముచేసికొని యెంతలేసి కార్యములనైన సాధింపఁగలఁడు.

మన్నారు : ఆయన యంతవానివలె నాకుఁ దోచలేదు. మొన్న జరిగిన యుద్ధమునఁ జూచితినిగదా !

పెద్దిదాసు : అందులకే చెప్పుచున్నాను. అతఁడు తేనెఁబూసినకత్తి. పైకి సాధువువలెఁ గానుపించును. కాని వానిఁబోలిన దుర్మార్గుడులేడు. నీపై నిప్పుడు మహారాజుతో నేమైనఁ బలుకఁగలఁడు. వాని కనులలో నాకట్టి దుర్భావము గోచరించినది. మీరు కానున్న ప్రభువులు.

మన్నారు : ఇందులోనేమున్నదిలెండు.

పెద్దిదాసు : అటులఁ గాదుబాబూ ! వీఁ డిట్లాకస్మికముగ వెళ్ళిపోవుట కూడ నా కంత శుభసూచకముగ లేదు.

మన్నారు : ఆయన నన్నేమి చేయఁగలఁడు ? ఏమియు భయములేదు. ప్రొద్దెక్కి వచ్చినది. సెలవొసఁగెదరా ?

పెద్దిదాసు : మంచిదిబాబూ ! పోయిరమ్మి. నీకు శుభమగుఁగాక !

మన్నారుదాసు పెద్దిదాసుగారికి నమస్కరించి వెళ్ళిపోయినాఁడు. పెద్దిదాసునకు మన్నారుదాసనిన నమిత వాత్సల్యము. మన్నారుదాసు నిష్కళంక హృదయుఁడు. దైవభక్తి గలవాఁడు. ఎల్లరను మంచివారుగనే భావించి విశ్వసించును. కొంచెె మమాయకుఁడనియే చెప్పవచ్చును. పెద్దిదాసునెడల మన్నారునకు వినయవిధేయతలు, గౌరవము నెక్కుడు. పెద్దిదాసు మన్నారు పోవుచున్నదెసకుఁ గనుచూపుమేర చూచుచు నిలుచుండెను. జాము ప్రొద్దైనది. ధ్యానమున కెన్నడంత విలంబము కాలేదు. 'నియోగివెంకన్నకు రాయసము పదవియు, రాజుతో నింత దగ్గిఱితనమును దంజావూరున కంత శ్రేయోదాయకములు గావు. అసలు వెంకన్న తంజావూరునకుఁ బదవీ వ్యామోహముతో వచ్చినటులలేదు. మన్నారుదాసుదెస నదొకరీతిగఁ జూచుచు వచ్చినాఁడు. మన్నారు పాపము పసివాఁడు. ఆతనిపై రాజున కెట్టి కొండెములఁ జెప్పునో ! తంజాపురభవిష్య దాంధ్ర మహావైభవోన్నతి కతఁడు ధూమకేతువువలె నవతరించినాఁడు. ఆతనివాలక మటులే యున్నది. ఆదినమునఁ బెద్దిదాసునకు ధ్యానము కుదురలేదు.

౮

ఆ సౌధము నగరమునకుఁ గొంచెము తుదిభాగముననే యున్నదన వచ్చును. అది విజయరాఘవవిలాస సదనమును బోలుచు నంతకన్న నించుక చిన్నదిగ నున్నది. దానియందున్నంత శిల్పచాతుర్యముసైత మిందులేదు. కాని దర్శనీయముగ నుండును. ఆ సౌధము విజయరాఘవనాయకులవారి యష్టమహిషులలో నొకెతెయగు ధీరాంబికాదేవిది. చెంగమలదాసుని తల్లియామె. విజయరాఘవనాయకులను ప్రేమించి పెండ్లియాడినది. ఆమెకు రాజుగారేమియొనర్చినను సంతసమే. తానాయనకు భార్యననుకొనుటయే యాబిడకుఁ జాలును.

రాయసము వెంకన్న యెందులకో యాసౌధాభిముఖముగఁ బోవు చున్నాఁడు. ఆయన భ్రుకుటీసంకోచముతో నేదియో తీవ్రముగ యోజించు చున్నట్లున్నది. ఆకసమున నొక కారుమొయిలు తోఁచి దక్షిణమునకుఁ గ్రమ్ము కొని వచ్చుచున్నది. రాయసము వెంకన్న సౌధముఖ ద్వారమునఁ బ్రవేశించి నాఁడు.

చామనచాయదేహమువాఁడు, ఆజానుబాహువు, ఆకర్ణాంత విశాల నేత్రుఁడునగు చెంగమలదాసు సోఫాలోఁ గూర్చుండియుండెను. ఆతఁ డన్ని విషయముల తండ్రిపోలిక. తండ్రియనిన నచంచలమగుభక్తిగలవాఁడు. తల్లి సుగుణములన్నియుఁ బుణికిపుచ్చుకొనినాఁడు. మహారాజేమిచెప్పిన నంత యాతనికి. ఏమిచేసిన నదియంతయుఁ దనమంచికొఱకని భావించును. చిరు గాలి కాతనిముంగురులు కదలాడుచున్నవి. ఆతని వయస్సు పదునారు సంవ త్సరముల లోపుండును. వెంకన్న సరాసరి యాయన సమీపమునకేగి 'మహా రాజులకు నమస్కార' మనినాఁడు. చెంగమలదాసాయనను జూచి యాశ్చ ర్యమునందెను. 'ఈయన యీసౌధమునకు వచ్చినపనియేమో !'

చెంగమలదాసు : ఓహో ! వెంకన్నగారు ! రండు, కూర్చుండుఁడు.

వెంకన్న యచటనున్న మరియొక సోఫాపై నాసీనుఁడయ్యెను.

చెంగమలదాసు : వెంకన్నగారిట కేమిపనిమీఁద వచ్చిరో తెలియ వచ్చునా ?

వెంకన్న : విశేషమేమియునులేదు. మహారాజులను మిమ్ముఁజూచి చాల దినములైనది, ఒకసారి తమదర్శనము చేయుదమని వచ్చినాను.

చెంగ : మానాయనగారు కుశలమేగద ! మాయువరాజును చూచి నాలుగైదురోజులైనది. అచటి విశేషములేమియుఁ దెలియుటలేదు.

వెంకన్న : మహారాజా! మీనాయనగారు కుశలమే. మొన్న నీయుద్ధమై మధుర, చెంజినాయకులను బరాజితులనొనర్చి వచ్చిననాటినుండియు మీమన్నారు దాసునకును మహారాజునకును బడకుండ వచ్చినవి. మన్నారుదాసుగారు రాజు గారి పరోక్షమున వారి ననరానిమాట లనుచున్నాడు.

చెంగ : మాయువరా జంతటివాఁడుకాఁడు. అతఁడు చాల బుద్ధిమంతుఁడు. అతఁ డిట్లు తండ్రిగారినిగురించి మాటలాడునని నే ననుకొనను.

వెంకన్న : మీరింకను చిన్నవారు మహారాజా! ఆయన వర్తన మేమియు బాగుండలేదు. ఆమాట నేననినచో మీకుఁ గోపము రావచ్చును.

చెంగ : మీరింతగ మాటలాడుట కాతఁ డేమనినాఁడు?

వెంకన్న : మీనాయనగారు తమ యన్నగార్లిద్దరికండ్లు పీకించి వేసిరట. ఈసంగతి మీకుఁ దెలియునా? తెలిసినంతవఱకు నిజమా?

చెంగమలదాసునకుఁ దన తండ్రినిగుఱించిన యీ ఘోరవార్తను విని నంతనే క్రోధము కలిగినది.

చెంగ : మా నాయనగారా! అగ్రజులకండ్లు పీకించిరా? మీకెవరు చెప్పిరి? ఆయన సాక్షాద్విష్ణుస్వరూపుఁడు, పుణ్యాత్ముఁడు. ఆయనపై నీ నీచమైన నిందలు మోపినదెవరు?

వెంకన్న : ప్రభువులాపనిఁ జేయలేదన్నమాట. నాకేమి తెలియును. ఎటులఁజెప్పిన నటులనే విశ్వసించితిని. ప్రభువు లట్టి దుష్కృత్యములఁ జేసి యుండుటవలన నిప్పుడిట్టి సత్కర్మల నాచరించి యాపాపమును పోగొట్టుకొనఁ జూచుచున్నారఁట.

చెంగమలదాసునకుఁ గ్రోధము పెరిగి పోవుచున్నది. ఆతనికన్నులెఱ్ఱబడినవి. రాయసము వెంకన్న కనుల నవ్వు చిందినది.

చెంగ : ఈమాటలన్న దెవరు? చెప్పితిరి కారేమి?

వెంకన్న : మహారాజా! ఇంకను తెలిసికొనలేదా? అందులకే మిమ్ము నేను చిన్నవారంటిని.

చెంగ : మీరే చెప్పుఁడు.

వెంకన్న : మన్నారుదాసుగారే. ఇప్పుడు ప్రభులకును, మన్నారుదాసుగారికిని సరిపడుటలేదు. మన్నారుదాసుగా రనినఁ మీనాయనగారి కిష్టములేదు.

చెంగ : ఆఁ, మాయన్నగారే యనినారా! హరిహరీ! తండ్రిగారి నట్లనవచ్చునా?

వెంకన్న : ఇంతే కాదు. తమ తల్లిగారిని చూచుటయేలేదఁట. అవమానించుచున్నారఁట. ప్రభువులు నిరంతర కామలీలా దత్పరులట. ఇంకను రకరకములుగ మాట్లాడినారు.

చెంగ : తాను యువరాజు. రాఁబోవు ప్రభువు. తండ్రిగారు కేవలము మన్నారు దేవుడేను. వారి నిట్లాడుట కూడనిపని.

వెంకన్న : అవును, మహారాజా! వయసునఁ బెద్దయైనను మీకున్న ప్రాజ్ఞత యాయనకులేదు.

చెంగమలదాసునకు వెంకన్న తన్ను 'మహారాజా!' యని సంబోధించుట వింతగఁ దోచెను. వచ్చిన క్షణమునుండియుఁ దన్నట్లే సంబోధించుచున్నాఁడు. తన ముఖము నూరక పరిశీలించుచున్నాఁడు. ఆ పరిశీలన, యీ సంబోధనము చెంగమలదాసున కాశ్చర్యమును గలిగించినవి.

చెంగ : వెంకన్నగారూ!

వెంకన్న : ఏమి? మహారాజా!

చెంగ : అదియే నేను నడుగఁబోవునది! మీరు వచ్చినప్పటినుండియు నన్ను 'మహారాజా!' యని సంబోధించుచున్నారు. కారణమేమో?

వెంకన్న : నాకది యేమియో మీరు మహారాజు లగుదు రనిపించు చున్నది. మీ ముఖమున మహారాజకళ యుట్టిపడుచున్నది.

చెంగ : అదెట్లు? మా యువరాజు మన్నారుదాసుండగా మేము రాజగుట యెట్లు సంభవించును?

వెంకన్న : మీ జన్మనక్షత్రముఁ జెప్పఁగలరా?

చెంగ : అటులనే తెప్పించెదను.

లోపలినుండి ధీరాంబిక జాతకచక్రము నొక దాసిచేఁ బంపినది. వెంకన్న దానిని జూచి యనినాఁడు: "మీ జాతకమునుబట్టి మీ రేకచ్ఛత్రాధిపత్యముగ భూమి నేలఁజాలి యుందురు".

ధీరాంబిక సన్నని జలతారు తెర మరుగుననుండి యతిశ్రద్ధగ నాలకించు చుండెను. చెంగమలదాసుని హృదయమున నానంద మురకలు వేసినది. రాయసము వెంకన్న చెంగమలదాసునకుఁజెప్పఁ మొదలిడినాఁడు.

మకరోత్తరార్థమందు బలయుక్తుఁడైన శని, సింహమున రవి, తులయందు శుక్రుడు, మేషమునఁ గురుడు, కర్కాటకమునఁ జంద్రుఁడు, కన్యయందు బుధుఁడును నున్నారు. ఇట్టిగ్రహముల కూడలిలోఁ బుట్టినవాఁ డేకచ్ఛత్రాధిపత్యముగఁ బృథివినేలు రాజగును. మీ జాతక మిట్టిది.

వీరాంబికకుఁ దన కుమారుని పట్టాభిషేక మహోత్సవము కనులకుఁ గట్టినట్లయినది. రాయసము వెంకన్న చెంగమలదాసు చేయిఁజూచి చేతిలోని రేఖలుగూడ జాతకమున కనుగుణముగ నున్నవని చెప్పినాడు. తల్లికొడుకుల యానందమునకు మేరలేకుండెను. వారికి వెంకన్న దేవునివలెఁ దోచినాఁడు. చెంగమలదాసు మనమున నొక సందేహము పట్టుకొనినది. అతఁడేమియు మాటాడకుండుటఁ జూచి రాయస మనినాఁడు: "ప్రభువులేమో యోజించుచున్నారు. నా జ్యోతిష మబద్ధమనియా ?"

చెంగ : ఎంతమాట ! మీ మాటను కాదందునా ? కాని నా కొకసందేహ మున్నది.

వెంకన్న : ఏమది ? చెప్పుడు. నాకేమైనఁ దెలియునేమో ?

చెంగ : ఎంత తండ్రిగారితో మాటలు లేకపోయినను రాజ్యము మన్నారుదాసునకు సంక్రమించునుగాని మా కెట్లు లభించును ?

వెంకన్న : ఇదియా మీ సందేహము ? మన్నారుదాసునకుఁ బట్టభద్రత్వము లేదు.

చెంగ : అది మీ రెట్లు చెప్పఁ గలుగుదురు ?

వెంకన్న : మీరు మహారాజు లగుదురని యెట్లు చెప్పుచున్నాను.

చెంగ : మీ రాతని జాతకమునుగూడ జూచితిరా ?

వెంకన్న : అవును. ఆతనికి రాజ్యభ్రష్టత యున్నది. రాజు కావలసిన యోగమే లేదు. ఆతనిలో రాజలక్షణములు లేవు. పైగా ప్రభువున కాతనిపైఁ గినుక యున్నది. అదియుఁగాక యొకవేళ రాజ్యలక్ష్మి చేహరించినను సంబాళించుకొనఁజాలఁడు. మధుర, చెంజి నాయకులకుఁ దంజావూరనిన దీరని క్రోధమున్నది. వారు మనపైఁ గసిపట్టినారు. విజృంభించి మనరాజ్యముపై దండెత్త

వచ్చును. యుద్ధముఁజేయు సామర్థ్యము మన్నారుదాసునకు లేదు. అన్నివిధముల మీరే సమర్థులు. మీకుఁ దండ్రిగారనిన నత్యంత గౌరవయుతమైన ప్రేమ. తండ్రిగారికి మీరనిన నపరిమితమగు వాత్సల్యము.

చెంగమలదాసునకు వెంకన్న యనిన నపారమగు గౌరవ మొదవినది. వెంకన్న చెప్పినదంతయు వేదవాక్యముగ నున్నది ధీరాంబికకు. తెరవెనుక గాజులు గలగల లాడినవి. మహారాణులకు స్వస్తివాచక మనినాడు వెంకన్న. "తల్లీ! మీ బిడ్డ మహారాజు కాఁదగియున్నాఁడు. జాతకము ననుసరించి మీ కుమారు లేకచ్ఛత్రాధిపతులు కాఁగలరమ్మా!"

ధీరాంబిక : ఏమో, మహాత్మా! పట్టమహిషి కుమారుఁడుండ మా కొడు కెట్లు రాజు కాఁగల్గును?

వెంకన్న : పట్టమహిషియు నామె కుమారుఁడును ప్రభువు నెంత మాత్రము లెక్క సేయకున్నారు. ఎంతెంత మాటలనుటకైన వెనుదీయుటలేదు. అందుచే ప్రభువులకు వారనిన నాదరము క్షీణించుచున్నది. ప్రభువులు రంగాజమ్మను దీసికొని వచ్చిరట. వారు మోహాంధకారమునఁబడి కనులు కానకున్నారట. ఇవన్నియుఁ బట్టపురాణి నుడువులు.

ధీరాంబిక : మహారాజులు సాక్షాత్తు శ్రీకృష్ణ స్వరూపులు. వారు రంగాజమ్మను దెచ్చిన నేమి? ప్రభువుల యభిమత మది. ప్రభువు లేమి యొనర్చినను జెల్లును. ప్రభువులు పుణ్యాత్ములు. అయినను రంగాజమ్మయంత మహాసౌందర్యవతి తా నగునా? ప్రభువు లామెయం దనురాగబద్ధులగుటలో దోసమేమి? ప్రభువు లెన్నఁడు బహుపత్నీకులేగదా? తానెంత పట్టమహిషియైనను ప్రభువుల నట్లుమారుట తగనిపని. చిన్నవాఁడు మన్నారు మాత్రము తల్లిమాట విని తండ్రిగారి నట్లు తేలికఁజేయవచ్చునా? అది యాతని దుడుకుతనమును వెల్లడి చేయును.

వెంకన్న : అదికాదు తల్లీ! మీరిట్లు మాటాడుచున్నారు. మీపద్ధతియే వేరు. మీరన్నచోఁ బ్రభువులకుఁగూడఁ గొండంత గౌరవమున్నది.

ధీరాంబిక : కాదు వెంకన్నగారూ! పట్టమహిషియైనను మన స్థితిని

మించి మాటలాడిన బాగుండునా? అందులో భర్తను మహారాజును. మహారాజుగనుక సరిపోయినది. లేకున్న వీరి తిరస్కారములేమి వీరేమి!

వెంకన్న : తల్లీ! అటులనే, ప్రభువుల మంచితనము వారల కలుసైనది.

ధీరాంబిక మాటాడలేదు. ఆమె మనమున నానందతరంగము లెగయుచున్నవి. తెరచాటుననుండి చెంగమలదాసు నీక్షించినది. ఆతని విశాలఫాలమున నానందము తాండవించుచున్నది. ఆతని కనులూర్ధ్వములై తీయని తలఁపులలోఁ దేలిపోవుచున్నవి. పెదవులు కదలీకదలని మందహాస మాతనిమోమునఁ దొణికిస లాడుచున్నది. ధీరాంబిక కన్నులనుండి మంచుబిందువులను బోలిన రెండశ్రు బిందువులు రాలినవి.

ప్రదోషమైనది. దాసి మణిదీపములనమర్చి వెళ్లిపోయినది. ధీరాంబిక బంగరు పళ్ళెరముననుంచి కొన్ని ఫలములను రాయసమునకుఁ బంపినది. రాయసము వానిని స్వీకరించెను. తాను పోయివత్తు ననినాడు వెంకన్న. చెంగమలదాసు వెంకన్నకు నమస్కరించినాఁడు. వెంకన్న సింహద్వారము దాటి వెలుపలికి వచ్చెను. చలిగాలి వీచుచున్నది. రాత్రికేమైన వర్షము పడునేమో! ఆతని హృదయము తేలికయైనది. వెంకన్నను సాగనంపి చెంగమలదాసు లోని కేగెను. ఆతని కెదురుగఁ దల్లి నిలిచియున్నది. ఆమెకు స్వర్గసీమలఁ దేలిపోవుచున్నటులున్నది.

చెంగ : అమ్మా!

ధీరాంబిక : నాయనా!

వారిరువురి కనులుఁ గలసినవి. ఇరువురి మనముల నానందము, ఆశ, తృష్ణ, ప్రేమ తళుక్కు మనినవి. చెంగమలదాసు ధీరాంబికకు నమస్కరించినాడు. ఆమె యాతని వదనమును ముద్దువెట్టినది.

చెంగ : అమ్మా!

అతనికి మాట పెగిలి వచ్చుటలేదు.

ధీరాంబిక : మహారాజవు కమ్ము నాయనా!

ఆమె కనుగొలఁకులనుండి యానందబాష్పము లాతని శిరమున రాలి, ముత్తైపు సేసలవలె, రత్నదీపముల వెలుగున మిలమిల లాడినవి.

౯

ఆదినమున నాకసమునఁ బ్రొద్దుటినుండియు మేఘములు పట్టియేయున్నవి. తరణిబింబ మే రెండుమూడు మారులో మాత్రము కనిపించినది. మరి కనిపించ లేదు. వచ్చెడిజల్లు పోయెడిజల్లుగ నున్నది. చల్లనిగాలి వీచుచున్నది. ప్రకృతి యంతయు మందగతి ననుకరించుచున్నట్లున్నది.

రాజగోపాలాంబికకు నాడేమియుఁ దోచుటలేదు. ఆమె తన మేలి ముసుగున నొడలెల్ల నిముడ్చుకొని పర్యంకముపైఁ బన్నుండెను. కపర్దిని ప్రక్కనే కూర్చున్నది. రాణి హృదయమున నేదో తీరని బాధ వేధించు చున్నది. ఎల్లి సోమయాజులు తా నేమో సాధించెదననినాఁడు. అట్టిదేమియుఁ గానిపించుటలేదు.

రాణి : కపర్దినీ !

కపర్దిని : ఇచ్చటనే యుంటినమ్మా !

రాణి : సోమయాజులుగా రీమధ్య నెప్పుడైనఁ గనిపించినారా !

కపర్దిని : రెండు నెలలై యీమధ్య కనుపించలేదు. నిన్న సాయంత నమున నగుపడి రేపు మీ రాణిగారి దర్శనమునకు వత్తుననినారు.

రాణి : ఏమో !

చల్లగాలి కిటికీగుండ దూసికొని వచ్చినది. కపర్దిని కిటికీ తలుపులు మూసివైచినది. మన్నారుదాసు వచ్చినాఁడు. కపర్దిని వెడలిపోయినది. రాణి లేచి కూర్చున్నది. మన్నారుదాసు తల్లికి సాష్టాంగముగ నమస్కరించినాఁడు. రాణి యాతని చిబుకముఁ బుణికి ముద్దుపెట్టుకొన్నది.

రాణి : లెమ్ము నాయనా ! దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

రాణి కన్నుల నీరు గ్రమ్మినది. ఆమె దానిని క్రిందఁ బడనీయక కన్నులలోనే నిలుపుకొనినది. మన్నారుదాసు తలయెత్తి చూచినాఁడు. తల్లి కనుల నీటి పొరలు గ్రమ్ముట కనుఁగొనినాఁడు. అతని హృదయమున నొక వేదనా తరంగములేచి కలవరము పెట్టినది. తనతల్లి యెంత కుములిపోవు చున్నదో ! అతని నయనము లశ్రుసిక్తము లైనవి.

మన్నారు : అమ్మా !

ఆతని స్వరమున గాద్గద్యము గానుపించుచున్నది. తన్నుఁగూర్చి కుమారుఁ డెంతబాధఁ జెందుచున్నాఁడు ! ఆమె హృదయమునఁ బుత్రప్రేమ వెల్లువలై ప్రవహించినది. కొడుకును రెండు చేతులతో నెత్తి లేవఁదీయుచు ననినది :

"లెమ్ము నాయనా ! నీవే నా యాశాజ్యోతివి. నయన మణివి. నా ముద్దులపట్టివి."

ఆమెకుఁ బుత్రుని మొగమున నశాంతి, విచారముఁ బెనవైచుకొన్న ట్లనిపించినది. ఆతని నెట్లైనఁ సంతసింపఁ జేయవలయును. ఆతఁడు పసివాఁడు. తానన్న నపరిమితమగుప్రేమ. తనకెట్టి కష్టము కలిగినను, సహించుకొనలేఁడు. కష్టమన నెఱుఁగనిబిడ్డ. పాపము తన మూలమునఁ దండ్రి కిష్టుఁడు కాకపోవుచున్నాఁడు. ఆతని కెటులయినఁ దండ్రిమెడ వైముఖ్యము పనికిరాదని చెప్పవలయు ననుకొనినది. ఒక చిన్న జల్లు వచ్చినది. ప్రాంగణమున బాలతృణమును గొఱుకుచున్న హరిణశాబకము చెంగుచెంగున గంతులిడుచు గదిలోనికి వచ్చినది. మన్నారుదాసు దానినిఁ దనదగ్గరకుఁ దీసికొనినాఁడు. అది యాతని చేతిలో గిలగిలలాడి రాణి సమీపమునకుఁ బోయినది. రాణి కుమారునివంకఁ జూచినది. పరాకుగనున్నట్లున్నాఁడు. చిక్కియున్నాడు. రాణి కన్నుల దైన్యము గురిసినది.

రాణి : మన్నారూ !

మన్నారు : ఏమమ్మా !

రాణి : నీవు భోజనముఁ జేసితివా ?

మన్నారు : చేసితినమ్మా !

రాణి : నీవు దినదినమునుఁ గృశించి పోవుచున్నావు. ఎందువలన నాయనా ? మహారాజులు నీతో సరిగ మాటలాడుచున్నారా ? నిన్నుఁ జూచిన నా కదేమో దిగులుగనున్నది. నీ వీవేళ భోజనముఁ జేసినటుల లేదు.

మన్నారు నవ్వి యనినాఁడు : "అమ్మా ! తల్లులందఱకుఁ దమ

తనయులు చిక్కుచున్నటులనే గ్రామపించెదరు. ఇందుఁ గ్రొత్తయేమున్నది? కృశించిపోవునది నేనుకాదు."

రాణి: నాయనా! నీ మనమునందున్న బాధ నాకుఁ దెలియునయ్యా! మహారాజేదో నాయెడల సక్రమముగఁ బ్రవర్తించుటలేదని నీ యభిప్రాయము. నా యదృష్టము నాది. అందులకై నీవు బాధపడి తండ్రితో విరసముగ నుండిన బాగుండదు. ఇటుఁ జూడుము నాయనా! నీ మొగముఁ జూచిన నాకుఁ గడుపులో చేయిపెట్టి కలఁచినట్లున్నది. నీమోమునఁ జిరునగవుఁజూచి యెన్ని నాళ్ళయినది. ఏదీ ఒక్కసారి నవ్వుము.

మన్నారు: అమ్మా!

రాణి: ఏమి నాయనా!

మన్నారు: అదికాదు. మహారాజెవరితో నెటులుండినను మిమ్ము సవ్యముగఁ జూచినఁ జాలును. మీయం దాయన కింత నిర్లక్ష్యము, నిరాదరము నెందులకు?

రాణి నవ్వినది. ఆ నవ్వులో నవ్వుదనములేదు. తెచ్చిపెట్టుకొని నటులున్నది. ఆమె పెదవులయందలి లేనగవు చిరుగాలితరగచేఁ గదలాడిన గడ్డిపూవు కదలికవలె నున్నది. ఆమె కన్నులలో విషాదమే తొంగి చూచుచున్నది. దానిని గప్పిపెట్టఁ బ్రయత్నించినది. కన్నీటి కెరట మడ్డువచ్చినది. రాణి తనదృష్టినిఁ గ్రిందికిఁ ద్రిప్పుకొనినది. ఆమె కనుతుదలనుండి జారి నాలుగైదు పెద్ద కన్నీటిబొట్లచటనే యున్న లేడిపిల్ల తలమీఁదఁ రాలినవి. అది బెదురుబెదురుగఁ జూచినది. రాణి దానిని చెంతఁ జేర్చుకొనినది.

రాణి: ఇదియా నీసందేహము? బాగుగనే యున్నది! మహారాజు నన్నాదరముగఁ జూచుటలేదని నీకెవరు చెప్పినారు? వారు నన్నాదరింపక పోవుటేమి? నీ కీ దిగులేమి? నీ మనస్సు ననవసరముగఁ జీకాకుఁ బెట్టుకొనకుము. నీవు కాబోవు ప్రభువవు. నీకుఁ దండ్రిగారితో మనస్పర్ధ కూడదు.

మన్నారు: ఏమోనమ్మా! తండ్రిగారి నడవడి నాకు నచ్చుటలేదు. మీరాయనను సమర్థించుచున్నారు. మిమ్ము సాదరముగఁ జూచుచున్నా రనుచున్నారు.

రాణి : కాదు నాయనా! మహారాజులు నీవు భావించునట్లుగ లేరు. వారు నన్ను సర్వవిధములఁ జూడఁ దగినట్లుగనే చూచుచున్నారు.

మన్నారుదాసునకుఁ గోపము వచ్చినది.

మన్నారు : మీరన్నియు నిట్లే దాచుచున్నారు. మీరెప్పుడు నింతియే.

రాణి మాటాడలేదు. మరల తుప్పర మొదలు పెట్టినది. మన్నారుదాసు కోపముతో నాజల్లులోననే వెడలి పోయినాఁడు. రాణి యభ్యంతరపెట్టలేదు. ఆమె కుమారుఁడుపోవుచున్న దిక్కునకుఁ జూచుచు నిలిచినది. ఆమెచూపులోఁ గదలికలేదు. నిశ్చలముగ నున్నది. తాను చూచుచుంటి ననుజ్ఞాన మామెకు లేదు. ఆమె కనుల కేమియుఁ గనుపించుటలేదు. ఆమె చెక్కిన ప్రతిమయో! చిత్రించిన చిత్రమో! జడమూర్తియో! ఆమె యటులఁ జాలసేపు నిలువలేక పోయినది. పర్యంకమున వ్రాలిపోయినది. మన్నారుదాసు వర్షములోఁ బోవు చుండఁ దాను చూచుచునిలబడినది. పసివాఁడు; పాపము తన్నుఁ జూడ వచ్చినాఁడు; తానాతని మందలించినది. ఆతనిహృదయ మెంత బాధపడినదో! లేకున్న నతనికిఁ దనపైఁ గోపమురాదు. తన యీ నీరసనిరాశాంధకార జీవితమున నతఁడొక్కఁడే యాశాకిరణము. పాపము వానలోవెళ్ళిపోయెనే! వలదని వారించుజ్ఞానముకూడఁ దనకు లేకపోయినది. ఆమెలో నీభావమే యామ్రేడితముగ రా మొదలు పెట్టినది. ఆమె మనసంతయుఁ జీకాకుచెందినది. ఆమె పెద్దతడ వేడ్చియేడ్చి నిదురపోయినది. నిదురనుండి లేచుసరికిఁ జీకటి పడినది.

కపర్దినివచ్చి యెల్లు సోమయాజులుగారు వచ్చినారని చెప్పినది. రాణి సత్వరముగలేచి యిందిరామందిరమునకుఁ జనినది. సోమయాజుల నుచితరీతి గౌరవించినది.

రాణి : మీరు నా కన్నిట నాదుకొందు రనుకొంటిని. మీ రటులనే చెప్పితిరి. ఫలితమేమియుఁ గానుపించుటలేదు.

రాణికిఁ దానేమి మాటాడుచుండెనో తెలియుటలేదు.

రాణి : మీరు మాటలను చెప్పుచునే యుండుఁడు. వత్సరములు గతించుచున్నవి.

సోమయాజులకు రాణి యీనాటిప్రవర్తన మాశ్చర్యముఁ గొలిపినది. ఆమె యెన్నడు నట్లు మాటాడియెఱుఁగదు. "నేఁ డిదే మిట్లు సంభాషించినది? ఈనాఁ డీమె మనస్సునకు బాధకలుగువిశేష మేమైనఁ జరిగియుండవలయును. తుద కీమెజీవిత మిట్లు పరిణమించుచున్నదేమి!"

సోమ : మహారాణీ! నే నా ప్రయత్నముననే యుంటిని. ఏమఱి యుండలేదు. రెండుమూఁడు పర్యాయములు రాజుగారినిఁ గలిసికొని మాట్లాడవలయునని యత్నించితిని. కాని దర్శనమే దుర్లభమైనది. ఏమిచేయుదును? చంద్రరేఖద్వారా దర్శనమున కవకాశ మేర్పడునేమో యనిపించుచున్నది. అది యీరోజుననే యత్నింతును. మీమన స్సీనాఁ డేలనో కలకఁజెందినట్లున్నది.

రాణి : ఏమట్లనుచున్నారు? నేనేమైనఁ దొందరపడి మాటలాడితినా? అయిన క్షమింపుము. మన్నా రింతకుముందు వచ్చి వెళ్ళినాఁడు. ఆయన నన్నుఁ గూర్చి యేమో బాధఁజెందుచున్నాఁడు. నేను తన తండ్రిగారిని వెనుకవైచుక వచ్చుచుంటినట. ద్వేషించుచుంటినట. అందుల కాయన తండ్రిగారే కారణమట. అట్లని మహారాజుగారితో వైరస్యముఁ బూనుట బాగుండునా? ఆయన మొగముఁ జూచిన జాలి పొంగి వచ్చుచున్నది. ఎటులో సమాధాన పఱచితిని. కినిసి వానలో వెడలిపోయినాఁడు.

ఆమెకు మాటలు తడబడుచున్నవి. కంఠము నేదో నొక్కిపట్టినట్లున్నది.

రాణి : మన్నారును జూచి యైన మీరు............

సోమయాజులకు రాణి, నాటిదుఃఖము, తొందరపడి మాటాడుటకుఁగల కారణమును దెలిసినది. కొడుకు రాకయే యామెనట్లార్చిన దనుకొనినాఁడు.

సోమ : నేను వెళ్ళివచ్చెదను మహారాణీ!

రాణి : మంచిది. ఆ విషయమును మాత్రము విస్మరింపకుఁడు.

సోమ : రేపే ప్రయత్నించెదను.

రాణి మరి మాటాడలేదు. సోమయాజులు వెళ్ళిపోయినాఁడు. చంద్రరేఖ మూలమున రాజదర్శనమనుమాట రాణి హృదయమునుండి నారాచమువలె దూసికొనిపోయినది. రంగాజమ్మ యొక్కతెతోనే చిక్కుగనున్న మరల నీమె

యెవతె? రాణీ కేమియుఁ జాలు వోపుటలేదు. చంద్రరేఖ క్రొత్తయావిడ. ఆమె ముందుఁగూడ దనయసదతనము బయల్పరుపఁబడ వలయునా? ఏమో! సోమయాజులుగా రెందుకట్లనినారో! మన్నారు పాపము వానలో వెళ్ళినాఁడు. తడిసెనేమో! పలువనిమైనఁ దా ససరపోయెనే! ఏమనుకొనినాఁడో! చంద్రరేఖ తనసంగతి నంతయు విని నవ్వివేయునేమో! తన తలిదండ్రు లున్న నెట్లుండెడినో! ఆమెలోఁ బలువిధములుగ భావతరంగము లెగయుచున్నవి.

మఱునాఁడు సోమయాజులు చంద్రరేఖకు వర్తమాన మంపినాఁడు. "తనవద్ద నందికేశ్వరుని భరతనాట్యగ్రంథ మున్నది. అది సామాన్యముగ నెచ్చటను లభింపనిది. చంద్రరేఖనుబోలు భరతనాట్యప్రవీణవద్ద నుండవలసిన గ్రంథము. ఆ భరతము నాట్యములలోనికెల్ల నుత్కృష్టమైనది" అని.

చంద్రరేఖ నందికేశ్వరుని భరతముకొఱకుఁ జాల ప్రయాసపడినది. శ్రీరంగరాయలవారి యాస్థానమున నున్నప్పుడు నందికేశ్వర భరతశాస్త్ర గ్రంథముకొఱకుఁ జాలమంది భరతశాస్త్రవేత్తల నడిగినది. కాని దాని జాడఁ జెప్పినవారైన లేకుండిరి. చూచాయగ నా విషయము సోమయాజులకు తెలియ వచ్చినది. తన వద్ద నా గ్రంథ ముండుటచే దాని సాహాయ్యమునఁ దన కార్యమును సాధించుకొనవచ్చునని భావించి యామె కా విషయముఁ దెలియఁ జేసినాఁడు. ఈ వార్త వినినంతనే చంద్రరేఖ యానందమునకు మేరలేక పోయినది. సోమయాజులనే తన యావాసమునకు రమ్మని యాహ్వాన మంపినది. సోమయాజు లామె సదనమున కరిగినాఁడు. చంద్రరేఖ యాయనను మిక్కిలి గౌరవించినది. ఫలముల నర్పించినది.

చంద్రరేఖ : మీ శుభనామము తెలియఁగవచ్చునా?

సోమ : నన్ను యెల్ల సోమయాజు లందురు.

చంద్రరేఖ : నందికేశ్వర నాట్యగ్రంథము తమవద్ద నున్నదా?

సోమ : అనియే కదా తెలియఁజేసితిని.

చంద్రరేఖ : నాకేల వర్తమాన మంపితిరి?

సోమ : నీవా భరతశాస్త్రముకొఱకుఁ జాల యత్నించితివని వింటిని.

చంద్రరేఖ : అయినచో మీరు నా కా గ్రంథము నీయఁగలరా ? నిజముగ నేనా నాట్యశాస్త్రముకొఱకు చాలమంది నడిగితిని. కాని లభింపలేదు. నేటికి మీవద్ద నున్నట్లు తెలిసి యెంతయో సంతసించితిని.

సోమ : దానిని నీ కిచ్చుటకు నా కెట్టి యభ్యంతరమును లేదు. కావుననే తెలియఁజేసితిని.

చంద్రరేఖ యానందమునకు మేరలేకపోయినది. తానిఁక నందికేశ్వర నాట్యము నభ్యసించును. తన కదికూడ వచ్చును. తా నొకనాటి సభలో నా నాట్యముఁ జేయును. సభయంతయుఁ గన్నులై యామెను జూచును. ఆమె సోమయాజులకు మనసునందే నమస్కరించుకొనినది.

సోమ : అమ్మాయీ ! నీకు దీని నిచ్చెదను. కాని నీవు నాకొక సాహాయ్యముఁ జేయవలెను.

చంద్రరేఖ : అది యెట్టిది ? నాకు సాధ్యమైనదైనచో నటులేయొనర్తును.

సోమ : నీ కసాధ్యము కాదనియే తలంతును.

చంద్రరేఖ : ఇంతకదియేమో తెల్పుడు.

సోమ : చల్లకువచ్చి ముంతదాచనేల ? చెప్పుచున్నాను. మహారాజుగారు రంగాజమ్మగారిమీఁది మోహమునఁ బట్టమహిషి రాజగోపాలాంబికను జూచుట కూడ మానివేసినాఁడు. ఆమె యెన్నిమారులు పిలువనంపినను తిరస్కరించు చున్నాఁడు. నీవైన మహారాజుతోఁ జెప్పి రంగాజమ్మనుండి యాయన బుద్ధిని మరల్పఁగలవేమో యని........

చంద్రరేఖ : చాల కష్టమైన పనియే. నాకు సాధ్యమైనంతలో యత్నింతును.

దాసి వచ్చి మహారాజుగారు వచ్చుచున్నారని చెప్పినది. సోమయాజు లచ్చటనైనఁ దనకు రాజదర్శన మగునని సంతసించినాఁడు. విజయరాఘవ నాయకులవారు వచ్చినారు. చంద్రరేఖ యమిత భక్తిశ్రద్ధలతో వారిని గౌర వించినది. రాజుగారు సోమయాజులనుజూచి, ఆయన యటకేల వచ్చెనో యనుకొనినారు.

సోమ : మహారాజులకు మంగళ మగుఁగాక!

విజయ : మీరిట కేల వచ్చితిరి?

సోమ : మహారాజా! తాము మహారాణి, పట్టమహిషి రాజగోపాలాంబికా దేవినిఁ బలుకరించుటయేలేదు. ఆమె కృశించిపోవుచున్నారు. ఆమె నొకసారి చూడనైనవచ్చునే! ప్రభువులు మిన్నకుండినఁ దుద కామె స్థితి యేమగునోయని భయము గలుగుచున్నది. మీ యాగమమునకై యామె యనుదినమును క్షణములు లెక్కిడుచుఁ గృశించిపోవుచున్నారు. శల్యావశిష్టయై యున్నారు. తల్లిగారిస్థితిని జూచి యువరాజు మన్నారుదాసుగారు కుమారిలిపోవుచున్నారు. ప్రభూ! ఆయన మొగమును జూచియైన మహారాణి ననుగ్రహింపుఁడు.

సోమయాజుల మాటలలో దీనత్వమును జాలియు నుట్టిపడుచున్నవి. చంద్రరేఖ మనమున రాణియనిన నొకవిధమైన గౌరవము, ప్రేమ, జాలి ముప్పిరిగొనినవి. రంగాజమ్మయెడల విచిత్రమగుభావము గలిగినది. రాజుగారి దెసఁ జూచినది. ఆయన మొగమెఱ్ఱవడినది. ఆయన పెదవులు చలించుచున్నవి. చంద్రరేఖ యుండగా వేళావేళలు లేకుండ మాటాడిన యా బ్రాహ్మణుని నమిలి మ్రింగుద మనిపించినది రాజుకు. కాని యాయన సాహసమునకు రాజు నివ్వెఱపోయినాఁడు. సోమయాజులు సమాధానమేమైనవచ్చునా యని యెదురు చూచుచున్నాఁడు. చంద్రరేఖ నొకపరిఁ దిలకించినాఁడు. ఆమె మొగమున నైర్మల్యము గాననగుచున్నది. సోమయాజు లటనుండి వెళ్ళిపోయినాఁడు. రాజునకుఁ బ్రాణములు కుఘుటఁబడిన ట్లనిపించినది.

చంద్రరేఖ యింటికి రాజు వచ్చును. కాని యేమి మాటాడవలయునో, ఏమి చేయవలయునో యాయనకు బోధపడదు. చంద్రరేఖ యనిన రాజునకు మోహసంబంధమగు ప్రేమయున్నది. రాజు శృంగారప్రియుఁడు. చంద్రరేఖను జూడగనేరాజునకుఁ గామభావ మొదవును. ఆమె కది గిట్టదు. రాజామె నెన్ని రీతులనో యనునయించును. ఆమె యనంగీకారముఁజూపును. ఆమె విలాసవతి. తన విలాసవైభవముచే రాజును దనకు వశవర్తినిగఁ జేసికొనును. రాజామె విలాసములకు ముగ్ధుడైనాఁడు. కాని, ఆయన వాంఛాపరిపూర్తిమాత్ర మెన్నటికిని గానిది. ఆమె యిచ్ఛావతివలె నున్నది. ఆమె ప్రకృతియే విచిత్రము.

ఆమె యెదుటనున్నంతసేపు రాజు తన్నుఁదాను మఱచిపోవును. స్థానచ్యుతి కలిగిన భావచ్యుతియు కలుగును. చంద్రరేఖ రాజును సమీపించి యనినది: "మహాప్రభూ! పట్టమహిషుల యంతఃపురమున నేనాఁడును వెళ్ళరట! ఇదియేమి?"

విజయ: చంద్రా! ఆయన యష్టేయనును. మన్నారుదాసునకు మేమనిన బొత్తుగ లక్ష్యగౌరవములు లేకుండఁ బోవుచున్నవి. దీని కంతటికిఁ గారణ మాతనితల్లియే. వా రిరువురుఁ జేరి నన్ను లెక్కసేయుటలేదు. తప్పంతయుఁ దనవద్ద నుంచుకొని యీ సమాచారములు పంపుటయేమి? ఆమె పద్ధతి నా కెంతమాత్రము నచ్చుటలేదు.

చంద్రరేఖ: ప్రభువులి ట్లనుచున్నారు. పాపము, మహారాణి తమకై ప్రతీక్షసేయుచుఁ దమ దర్శనమునకై తపించిపోవుచున్నారట.

విజయ: ఆమెప్రసక్తి నా వద్ద తేకుము.

చంద్రరేఖ: మహారాణిగారి నట్లు........

విజయ: చంద్రా! నీవేమైన ననుము, నా హృదయమునఁ నామెకు స్థానముండఁజాలదు. ఆమె మా కుమారుని మాకే రాకుండఁజేసి మా మీదికే పంపుచున్నది.

చంద్రరేఖ మాటాడలేదు. రాజుగారికి రాణివిషయమున జంద్రరేఖ తనతో నట్టి ప్రసంగముఁజేయుట మనస్కరించలేదు. చంద్రరేఖ విలాస వీక్షణములకు ముగ్ధుఁడై కొంతతడ వామె నృత్యగానములచే నానందించెదమని వచ్చినాఁడు. ఎప్పుడామెవద్ద కేగినను నిట్లే యేదోయొకవిషయ మడ్డువచ్చు చుండును. రాజుమనస్సునందు వైకల్య మొదవినది. ఆయన యౌదాసీన్యముఁ గనుఁగొని చంద్రరేఖ యనినది "ప్రభూ! నే నొక క్రొత్తనాట్యము నభ్యసించు చున్నాను. అది నాట్యములలోనెల్ల శ్రేష్ఠమైనది."

రాజు మాటాడలేదు. చంద్రరేఖ మొగము ముడుచుకొనినది. రా జది గ్రహించలేదు. మెల్లగ నటనుండి వెడలిపోయినాఁడు. ఎటులైనఁ రాజు మనమును రంగాజమ్మనుండి మరలించి రాణిగారిమెడల సుముఖముగ నొనర్ప వలెనని చంద్రరేఖ యాశయము. ఆమె యట్లు సంకల్పించుకొనినది.

తిరిగి సోమయాజులు వచ్చినాఁడు.

చంద్రరేఖ : రండు, ఆసీనులుకండు.

సోమ : ప్రభువులేమనినారు ?

చంద్ర : ప్రభువులేలనో పట్టమహిషియనిన మండిపడుచున్నారు. ఆమె గారు తమకుమారులను ప్రభువులకుఁ గాకుండఁ జేసివేయుచున్నారట. తల్లి కొడుకు లిరువురునుజేరి తమ్ముఁ దిరస్కరించుచున్నారట. ప్రభువులమాట లన్నియు నీ తీరున నున్నవి.

సోమ : మరి మార్గమేమి ?

చంద్ర : మీ రిపుడు రంగాజమ్మవద్ద కేగవలయును.

సోమ : పోయి ?

చంద్ర : ఆమె కిట్లుఁ జెప్పవలయును : "అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన భార్య పట్టమహిషి యుండగా నీ వెవ్వతవు ? మగనికి మందుబొగ్గొల్పితివి. మంచముఁబెట్టితివి. ఇరువదియేండ్లనుండి మహారాజును గుప్పిటఁ బెట్టుకొనినావు. అంతఃపురమున రాణి కుమిలిపోవుచున్నది. నీ కిది శుభముకాదు. ఆమె మహా పతివ్రత. ఆమెయుసురు నీకుఁ దగులగలదు. ఇప్పటికేని రాజుగారిని మహా రాణిగారియెడఁ బ్రసన్నునిఁజేయుము. లేనిచో నీకు మంచిదికాదు". ఆమె యేమనునో చూడుము.

సోమయాజులు వెళ్ళినాఁడు. రంగాజమ్మ యిందులకు సమ్మతించునా యనుకొనినది చంద్రరేఖ. ఏమగునోకానిమ్మదే తేలఁగలదని భావించినది.

ఆ దినముననే సాయంకాలమున సోమయాజులు రంగాజమ్మ గృహము నకు వెళ్ళినాఁడు. ఆ మందిరము చిన్నదేకాని సుందరముగనున్నది. ఇందిరా మందిరమునకుఁ జెల్లెలివలె నున్నది. ద్వారమున నిరువురు యువతులు కావలి యుండిరి. సోమయాజులు మందిరప్రవేశమున కంగీకారము నడిగినాఁడు. వా రిరువురిలో నొకతెపోయి రంగాజమ్మతో నీ విషయమును మనవిజేసినది. రంగాజమ్మ యొకచిన్న బంగరు టూగుటుయ్యేలలోఁ గూరుచుండి పైడి గంటముతోఁ దాళపత్రములపై వ్రాయుచుండెను. ద్వారపాలిక వచ్చినంతనే

భ్రుకుటిఁ జిట్లించినది. "ఇప్పుడెవరికిని బ్రవేశములేదు" అని చెప్పి పంపినది. ద్వారపాలికవచ్చి సోమయాజులకీవార్తఁ దెలియఁజేసినది. ఆయన తల పంకించినాఁడు. "నేను చంద్రగిరినుండి వచ్చిన బ్రాహ్మణుఁడను. అచటి వార్తలఁ గొనితెచ్చితిని" అని రంగాజమ్మతోఁ జెప్పుమని ద్వారపాలికకుఁ జెప్పినాఁడు. ఆమె మరల లోనికిఁబోయినది. రంగాజమ్మ గంటము క్రింద నునిచి యామెపైఁ గసరుకొనినది.

ద్వారపాలిక : అమ్మా! ఎవరో చంద్రగిరినుండి వచ్చిన బ్రాహ్మణుఁడట. అచటి వార్తలఁ దీసుకొని వచ్చెనట. మీ దర్శనముఁ జేసికాని పోవఁడట.

రంగాజమ్మ : చంద్రగిరిబ్రాహ్మణుఁడా! అయినచో లోనికిఁ గొనిరమ్ము.

ఆమె తిరిగి వెళ్ళినది.

'చంద్రగిరినుండి వచ్చెనా? ఆయనయెవరో!' అనుకొనినది రంగాజమ్మ.

తన యుక్తి పారినందులకు సంతసించి సోమయాజులు లోనికిఁ బ్రవేశించినాఁడు. రంగాజమ్మ మిగుల గౌరవించిన దాయనను. మందిరమునందలి శిల్పచాతుర్యమునకు ముగ్ధుఁడైనాఁడు సోమయాజులు. రాణిగారి సౌధముకన్న నొకింత యీ మందిరమే మెఱుగేమో! ఆయన కనులు తిరిగిపోయినవి. రంగాజమ్మ. ఆయన యాశ్చర్యపడుటను గుర్తించకపోవలేదు. రంగాజమ్మ ప్రక్కనున్న యొక దాసి "తాము చంద్రగిరినుండి వచ్చినారా? అచటి విశేషములఁ జెప్పుఁ" డని యడిగెను.

సోమ : నేను చంద్రగిరినుండి వచ్చినవాఁడనుగాను. మహారాణివద్ద నుండి వచ్చితిని.

రంగాజమ్మ : మహారాణి యనిన?

సోమ : పట్టఁపుదేవి, రాజగోపాలాంబిక.

రంగాజమ్మ : ఆమె కిట నేమి పని యున్నది? నా నుండి యామెకుఁ గావలయున దేముండును?

సోమ : అదికాదు. మహారాజు లామెను నిరసించుచున్నారట. ఆమె ప్రార్థనములను దిరస్కరించుచున్నారు. ఆమె యంతిపురమునకు వారేగి

సంవత్సరములు గతించినవి. నీవు ప్రభువును వలలో వేసికొనుటయే దీని కంతటికిని గారణము.

చంద్రరేఖమాటలన్నియు నప్లే సోమయాజులు రంగాజమ్మకుఁ జెప్పి నాఁడు. రంగాజమ్మకుఁ గోపమువచ్చినది. తాను చాలసారులు రాజునకు నచ్చఁ జెప్ప యత్నించినది. కాని రాజుగారికి రాణియన్న నిష్టములేదు. తా నేమి చేయును? అయినను మధ్య నీ చంద్రరేఖ ప్రసక్తియేమి? తన్నామె యన్నిమాట లనుటయేమి? ఆమె స్త్రీ కాదా? తాను మహారాజును వశపఱచుకొనలేక పోయినది. రాణికి వశపఱచునట. బాగున్న దనుకొనినది.

దాసి: అమ్మా! మహారాజుగారు మహారాణీవారితో సరిగ నుండునట్లు మీచేతనైనఁ జేయరాదా?

రంగాజమ్మ: ఓసీ! నా చేయునదేమున్నదే! స్త్రీ పురుషునిఁ దన హావ భావ విలాసములచే వశపఱచుకొనవలయును. మధుర హేలలచే లొంగఁదీసు కొనవలయును. తాను గాఢముగ నాతనిఁ బ్రేమించి యాతనినుండి తాను ప్రేమను బడయవలెను. అంతియ కాని యిది యొకరు బోధించిన నలవడు విద్యయా? స్వతస్సంభవముగ నుండవలెను. తన పతి శృంగారరస సర్వ స్వము. ఆ రసమన్న ముక్కు మొగ మెఱుఁగనిది రాణి. ఆయమ వాని నెట్లు వశపఱచుకొన నేర్చును? మధువుండిననేకద, భ్రమరము పుష్పముకడ కేగు నది. అది మృగ్యమగుచో? అప్లే రసజ్ఞశేఖరులగు మహారాజులు నీరసస్వ రూపిణియగు రాణి ప్రేమను గ్రహించుటెట్లు?

సోమ: నీ వేమైన నెటులైన ననవచ్చును. కాని మహారాణి నిన్నేమ నునో, నిన్నుగూర్చి యెట్లూహ చేయునో యోజించుకొనుము.

రంగాజమ్మకు రోష ముబికి వచ్చినది. ఆమె యొయ్యార మొలుకునట్లు ఠీవి వెలయునట్లు నొక విచిత్రమైన భంగిమ శరీరమునందుఁదోప

"ఏ వనితల్ మమున్ దలప నేమెపనో? తమ రాడువారు గా
రో వలపించు నేర్పెఱుఁగరో! తమ కౌఁగిటిలోన నుండగా
రావదియేమిరా! విజయరాఘవ! యం చిలుదూరి బల్మిమైఁ
దీవరకత్తెనై పెనగి తీసుకవచ్చితినా? తలోదరీ?"

అని యాళువుగ ననినది.

సోమయాజులామె యాశుకవితాధారకు, కవితావైశిష్ట్యమునకు నబ్బుర పడినాఁడు. ఒకసారి తలయెత్తి యామెఁ బరికించినాఁడు, ఆమె సౌందర్యమునకు వెఱఁగందినాఁడు. ఆమెమొగ మెట్టివారి సుందరముగ నున్నది. రణోన్ముఖియగు సత్యభామవలె నున్నది. ఆమె యెఱ్ఱని చీరఁగట్టి పసుపుఁబచ్చని కంచుకముఁ దొడిగినది. బంగరు పూలుగల తెల్లని శాలువఁ గప్పుకొనినది. ఆమె మోమున గర్వము, అహంకారము మెరయుచున్నవి. "ఈమె నిజముగ రూపజితరతీదేవి. ఈమెకును రాణికిని రూపమున సామ్యమేలేదు, ప్రభు వందువలననే యీమెకు వశవర్తి యైనాఁడు" అనుకొనినాఁడు సోమయాజులు.

రంగాజమ్మ లోనికేగినది. సోమయాజులు తలవంచుకొని వెడలిపోయినాఁడు. అస్తమయ సూర్యుని యరుణకాంతులు రంగాజమ్మ కట్టినచీర తళతళవలె రాణి హృదయమున మండుచు నెగయు నవమానజ్వాలలవలె భాసించినవి సోమయాజులకు.

అవమానితయైన రాణి హృదయమునుండి వెలువడిన శాపమువలె నల్లని చీఁకట్లు క్రమ్ముకొని వచ్చినవి. పొద్దు పోయినది. క్రమముగఁ బట్టణమంతయు మాటు మణిఁగినది.

మఱునాఁడుదయమునఁ బ్రతి గృహమునందును రంగాజమ్మ పద్యమునందలి రసభావముల చర్చయే. రవిగాంచనిచో రసభావములు రసికశిఖామణుల దృష్టి నతిక్రమించునా ?

ఒకరు : ఆమె ప్రౌఢధీరనాయికవలె మాటాడినది.

మఱొకరు : ఇందులో నెంత యహంకార మిముడియున్నది, స్త్రీ యహంకృతి యిటులుండును కాబోలు !

వేరొకరు : ప్రతి స్త్రీయు నిట్లుండునా ? ఆమె శృంగారరస పరమావధి.

ఇంకొకరు : అసలాపద్యమునందలి పదవిన్యాస మెంత యద్భుతముగ నున్నది ?

ఒకరు : అసలా పద్యములో లేని దేమున్నది ? అన్ని భావములు నున్నవి !

ఇంకొకరు ; ఈ పద్య మమరుకమునందలి శ్లోకమును దలపింపఁ జేయుచున్నది !

మరొకరు : ఈ యొక్క పద్యమున రామెకుఁ గనకాభిషేకము చేయ వచ్చును !

ఒకరు : ఇట్టి రసస్వరూపిణి గనుకనే మన మహారాజుగారి నిట్టె వశ పఱచుకొనఁ జాలినది.

౧౦

ఆ యింటిముందు జనసమూహము కోలాహలముగ మూగియున్నది. నేడాయింట గొప్ప సంగీతవేత్తయు, ప్రసిద్ధ వాగ్గేయకారుఁడు, ఉభయభాషా కోవిదుఁడు, రసజ్ఞ శేఖరుండును నగు క్షేత్రయ్య వచ్చి విడిసినాఁడు. అక్కడ మూగిన జనసమూహము క్షేత్రయ్య పుట్టుపూర్వోత్తరముల పలువిధములైన కథలఁ జెప్పుకొనుచుండిరి.

ఒకరు ; క్షేత్రయ్యగారు 'మొవ్వపురి' వాసులట.

మరొకరు ; కాదు. మోపనాడు.

మూడవ వ్యక్తి ; అవును. మొవ్వపురినే మోపనాడని కూడ నందురు.

మొదటివ్యక్తి : ఆ గ్రామ మేప్రాంతమున నున్నది ?

రెండవవ్యక్తి : కృష్ణాతీరమునందలి 'ఘంటసాల'కు సమీపమున నున్నదట.

మూడవ : భాగవతుల కూచిపూడికూడ నచ్చటనే యున్నదట. ఈ రెండును దగ్గఱనే యున్నవట.

మొదటి : క్షేత్రయ్యగారు తమ చిన్నతనమున నొక మహాయోగివలన గోపాలమూలమంత్రోపదేశమును బొందిరట. అటు తరువాత మువ్వపురి గోపాలుని బహు భక్తిశ్రద్ధలతో చాల సంవత్సరము లామంత్రరాజముతో జపించిరట. కొంతకాలమునకు శృంగారరసాధి నాథుఁడగు గోపాలదేవుఁడు దర్శన మొసఁగి యనుగ్రహించెనట. తదాదిగ నీయన వాగ్గేయకారులైనారు.

రెండవ : అదికాదు, క్షేత్రయ్యగారు మొదట రాజులమీఁద శృంగారరస సంబంధములగు పదముల వ్రాసెడివారట. తానా శృంగార రసమున మునిఁగి తేలుచు తన స్వగ్రామమేగి యచటి గోపాలస్వామివారి యాలయమునకుఁ బోయిరట. అచటఁ గల లావణ్యవతియగు నొక దేవదాసిని జూచి మోహించి నారట. అప్పుడా దేవదాసి "నీవు రాజులందరిఁగూర్చియుఁ బ్రసిద్ధములైన పదముల వ్రాసిన మహాకవివి. ఎన్నఁడును భగవంతునిఁ గూర్చిన పదములఁ జెప్పలేదు. నాకు గోపాలదేవుఁడే పరమదైవము. ఆ స్వామివారిపైఁ బదములఁ జెప్పి మెప్పించుము." అనినదట. ఆ మాటపై నామెయం దాయనకుఁ గల యగ్గలమైన ప్రేమచేఁ బ్రబోధితుఁడై యామె యభిమతము నీడేర్చి తన యిచ్ఛా పూర్తిఁగావించుకొన నెంచి యాయన చాల కష్టించి నిష్ఠగఁ గృషిసల్పి యుపవసించి తదేక ధ్యానబుద్ధిగ కొన్నాళ్లాలయముననే యుండి ప్రార్థనలు సలుప నా దేవుని కనుగ్రహము కలిగి యాయనకు దర్శన మొసఁగెనట. స్వామి వారి కృపావిశేషమున నంతరుఁబూర్వ మెఱుఁగని యలౌకికానుభూతి నానం దాతిశయముతో నేకధారిగ మువ్వగోపాలపదములఁ జెప్పినారట. అటుపై వీరికి వైరాగ్యముకలిగి తంబుర చేతఁబట్టి యీ విధముగఁ బుణ్యక్షేత్రములను, రాజాస్థానములను దర్శించుచు బయలుదేరిరట.

ఒకరు : అసలు వీరిపేరే క్షేత్రయ్యగాదు. వీరి నామము వరదయ్యయట. వీరు వరదయ్యగ నున్నప్పుడు గొడ్లఁ గాచికొని పామరునివలెఁ గాలక్షేప మొనర్చెడివారట. అప్పుడీయన యొకవిధమైన మూఢభక్తితోఁ దరచు గోపాల స్వామి యాలయమునఁ గూర్చుండెడివారట. ఆ సందర్భమున నొక గొల్ల పడుచును ప్రేమించెనఁట. ఆమె నిరక్షరాస్యుఁడగు నతనితోఁ దనకుఁ బొందేమి యని నిరాకరించినది. ఆ యవమానము భరింపఁజాలక నీతఁడు గోపాలస్వామి యాలయమునఁ గూర్చుండి యా దేవుని వేడుకొని యచ్చటనే కదలక రెండు మూఁడునాళ్లుండి ధ్యానించెనఁట. స్వామివారికి దయగల్గినది. ఆయన యనుగ్రహమున హఠాత్తుగ నీయనకుఁ గవితాధోరణి యలవడినదఁట. అది గేయరూపమైనది. ఆ సన్నివేశమే వరదయ్యను భక్తాగ్రేసరునిగఁ జేసినది. తాను వలచిన కాంతయందలి వ్యామోహము మారినది. వారిరువురును గోపాల దేవుని భక్తులైరి. తదుపరి వీ రనేక క్షేత్రములు సందర్శించి తమ పదముల

గానమొనర్చుచు, అభినయముచేయుచుఁ దిరుగుచున్నారు. బహుక్షేత్ర సందర్శనమునఁ వీరికి క్షేత్రయ్య యను పేరు వచ్చినది.

ఎండవేడిమి ప్రఖరతఁ దాల్చుచున్నను వారు సంభాషణను విరమింప లేదు. ఇంటిలోపల క్షేత్రయ్య స్నానాదికములఁ దీర్చికొని ధ్యానమగ్నుఁడైనాఁడు. ఆయన కెదురుగ గోపాలదేవుని చిత్రముగల పట మొకఁ డున్నది. ఆ పటము సమక్షమునఁ బద్మాసనము వైచుకొని క్షేత్రయ్య ధ్యానములో మునిఁగియుండెను. ఆయన కట్టినది పట్టుపీతాంబరము, పై నొక పట్టుత్తరీయము, చేతులకు స్వర్ణ కంకణములు నున్నవి. మెడయందు యజ్ఞోపవీతమును, తులసిపూసల పేరును నున్నవి. గౌరునామముఁ బెట్టినాఁడు. నెఱికురులు దువ్వి విరుల ముడిచినాఁడు. ఆయన మీసములు సువాసనగల నూనెరాచి దువ్వబడినవి. కనులు సోగలుదేరి యున్నవి. కండ్లకు సన్నని కాటుకరేఖలు కూడ నున్న వనవచ్చును. ఆయన తన ధ్యానమును ముగించి గిలుకుపావలు తొడిగి సావడిలోనికి వచ్చెను. అచట శుభ్రమైన తాటియాకు చాపలపైఁ గాళకవి, కోనేటి దీక్షితచంద్రుఁడు మరి కొందఱు పౌరులును గూర్చుండియుండిరి. వారెల్లరు క్షేత్రయ్యను మిక్కిలి గౌరవించి యాసీనులుగం డనిరి. ఆయన వారందఱిమధ్య నాసీనుఁడయ్యెను.

కోనేటి : అయ్యా! తమ రే యే క్షేత్రములు సేవించినారు? ఏ యాస్థానముల దర్శించినారు? అచ్చటచ్చటి విశేషముల వినఁ గుతూహలము గల్గుచున్నది. సెలవిత్తురా?

క్షేత్రయ్య : వరహూరునందలి యాది వరాహస్వామిని దర్శించితిని. చిదంబరక్షేత్రమునఁ దిల్లగోవిందుని సేవించితిని. కడప వెంకటేశుని సంస్తుతించితిని. కంచి వరదరాజస్వామి సంకీర్తన సలిపితిని. వేదపురి నిలయుని, చెవ్వంది లింగని, హేమాద్రి విరూపాక్షదేవుని, మైసూరులోని యదుగిరి చెలువరాయని, ఇనపురస్వామిని, పాలగిరి చెన్నకేశుని, తిరుమల వెంకటేశుని. తిరువళ్లూరు వీరరాఘవుని, శ్రీరంగేశుని, మధుర శ్రీరంగేశ్వరుని నామ సంకీర్తనములు చేసితిని. మధుర, చెంజి, గోల్కొండ సంస్థానముల సందర్శించితిని.

కాళకవి : తాము మా తంజనగరమునకు దయచేయుటచే మేము ధన్యులమైతిమి.

క్షేత్రయ్య యెల్లప్పుడును బరధ్యానమున నుండును. ఆయన కన్ను లర్ధ నిమీలితములు. క్షణక్షణమునకును దా నేదో దర్శించుచున్నటుల నులికిపడును. తనలోఁ దా నేదో పాడుకొనును. ఆయన ప్రవృత్తి యచటివారలకు విచిత్రముగఁ దోచినది. ఆయన భక్తితత్పరత వారల కాశ్చర్యముఁ గలిగించినది.

పురుషో : తాము మహాభక్తులు. సాక్షాత్తు గోపాలస్వామి యనుగ్రహ పూర్ణుఁడై స్వయముగ దర్శనభాగ్య మలవడఁజేసిన మహనీయులు. భగవ దారాధనకు సులభోపాయ మేదైన నుపదేశించి మమ్మనుగ్రహింపవేడెదము. తమ దేమైనఁ బ్రత్యేక మార్గ మున్నదా ?

క్షేత్రయ్య : నా మార్గమని ప్రత్యేకముగ నొకటియుండునా? శ్రీకృష్ణదేవుఁ డాశ్రితసులభుఁడు. ఆయనయే పరమాత్మ. పరమపురుషుఁడు. జీవాత్మలెల్ల స్త్రీసమములు. ఈ జీవాత్మలన్నియు నాయికలు. ఈ నాయిక లెల్లరకు నేకైక నాయకుఁడును భర్తయు శ్రీమువ్వగోపాలుఁడే. జీవాత్మలన్నియు నా మధురిమ స్వారాజ్యమును బొందుటకై యోగమార్గము నవలంబించుచున్నవి. ఇది మధుర భక్తి. జీవాత్మ పరమాత్మలకు స్త్రీ పురుష సంబంధముఁ జెప్పుట మధురపద్ధతి రహస్యము. ఈ భక్తి యలౌకిక శృంగారసంవేద్యము. "అఖండం పుణ్యానాం ఫలమ్" దానివలననే గాని యిట్టి భక్తి యలవడదు. ఈ విధానమునందు ప్రేమ యొక్క యాధ్యాత్మికతత్వము పూర్తిగ నిండియుండును. ఈ భక్తిచైతన్య మతమునకుఁ జీవగఱ్ఱయైనది.

పురుషో : మధురభక్తికాక యింకను సులభమార్గములు లేవా ?

క్షేత్రయ్య : లేకేమి ? పలురకముల భక్తులున్నవి. రాగాత్మకభక్తి, అహేతుకభక్తి, సహేతుకభక్తి లేక గౌణభక్తి, ముఖ్యభక్తి మొదలైనవి. అహేతుకభక్తినే ముఖ్యభక్తియనియుఁ జెప్పుదురు. నారదాదులభక్తి యట్టిది. అది యనితరసాధ్యము. మనవంటివారికి రాగాత్మకభక్తి సులభము. ఇదియే మధురభక్తి. ఆ ప్రేమభక్తియందు నాయికల శృంగారలీలలు ప్రముఖమధురము లైనవి. అది వారి ప్రేమవిలాసము. వారి కృష్ణవిరహము లత్యంత సుకుమార ములు. స్వభావరమ్యములు. ప్రేమభక్తి పరిణామరమణీయము. ఆ ప్రేమరసము స్రవించి స్రవించి భక్తియందుఁ బర్యవసించును. గోపికలు, రాధ, రూప గోస్వామి మొదలగు భక్తు లీ విధానము నవలంబించిరి.

కోనేటి : ఈ భక్తి ననుష్ఠించుట యెట్లో సెలవిచ్చెదరా ?

క్షేత్రయ్య : దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము మొదలగు సాధనము లాధ్యాత్మిక భక్తిమార్గములు. అనన్యమైన యాత్మార్పణమే యీభక్తికి పరాకాష్ఠ. ఇందు భగవానుఁడు భోక్త. చరాచరము భోగ్యము. మనయందు భోగ్యదృష్టి యలవడిననే పరమాత్మయందు భోక్తృత్వ ముదయించును. చిరసంధానమే శృంగారభక్తికి ధ్యేయము. క్షణకాలమేని విరహసహన ముండదు. ఈ మధుర భక్తిచేతనే గోపికలు గోపాలదేవుని వశపఱచుకొనినది. మువ్వగోపాలుఁడు మన్మథ మన్మథుఁడు. జగతామేకాభిరామాద్భుతం కిమపి తేజః. వల్లవీభాగధేయం. నిగమవాగగోచరం. సర్వజగతాం స్వస్త్యయనం. మునీనాంపరిషది పరామృశ్యోపనిషదర్థం. ఆయన షోడశసహస్రగోపీకుచ కలశాలింగన కస్తూరీ కుంకుమాలేప చిహ్నితోరు పక్షస్కుఁడు. రాధామధురాధరసుధాపాన మత్తమధుకరము.

కళాకవి : మిముఁ బోలు భక్తుల వాగమృతఝరియందు మునుకలాడు భాగ్యము మాకుఁ గలిగినందుల కెంతయు సంతసించుచున్నాము.

క్షేత్రయ్య : మీపురమునఁ బెద్దిదాసుగారనెడి మహాభక్తాగ్రేసరు లొక రున్నారని వినియుంటిని. వారిని దర్శించలేదు.

కాళకవి : వారిని దర్శించవలెనన్న వారి యారామమున కేగవలెను.

కోనేటి దీక్షితుని మొగమున నొక విచిత్రమైన భావము దోచినది.

క్షేత్రయ్య : వారు రాజసభకు వత్తురుగదా !

కోనేటి : రాజసభకు వారు రారఁట.

క్షేత్రయ్య : రాజసభకే రారా ?

కాళకవి : ఇంతవఱ కెన్నడును రాలేదు.

క్షేత్రయ్య కన్ను లహంభావమును వెలికిఁ జిమ్మినవి.

క్షేత్రయ్య : నేను వచ్చితినని చెప్పుడు. ఆయన తప్పక రాఁగలరు. అచ్చట నున్నవారందఱు మొగములు చూచుకొనిరి.

సాయంతనమున కాళకవి పెద్దిదాసును జూడఁబోయినాఁడు. ఆయన 'విశేషములే' మని కాళకవి నడిగినాఁడు.

కాళకవి : క్షేత్రయ్యగారు వచ్చినారు.

పెద్దిదాసు : అటులనా ?

కాళకవి : ఆయన మిమ్ము దర్శింపవలెననినారు. మేము మిమ్ముఁ జూడవలెనవిన విచటికి రావలయునంటిమి. ఆయన 'మీరు రాజసభకు రారా' యని యడిగినారు. మే 'మింతవఱ కెన్నడును రాలే' దని చెప్పితిమి. ఆయన, తాను వచ్చితినని చెప్పిన మీరు తప్పక సభకు వత్తురనినారు.

పెద్దిదాసు : నే నాయన పదములు కొన్ని వినినాను. వానియందు భక్తి కన్న శృంగార మెక్కుడు. అయినను నాకు రాజసభకు రానను నిషేధ మేమున్నది. అచటి నృత్యగీతాదులు నాకు సరిపడవనిగాని ? ప్రభువులు చాల తడవులుగ వర్తమాన మంపుచున్నారు. నేను రేపటి సభకు వచ్చెదను. కాళకవి లేచి గంతువై చెను.

మఱునాఁడు సభ. విజయరాఘవనాయకులు కొలువు తీర్చిరి. సభ్యు లందరును విచ్చేసిరి. క్షేత్రయ్యగారి నృత్యాభినయ సంకీర్తనముల నాస్వాదిం చుటకై పురజనులనేకులు వచ్చిరి. పెద్దిదాసు వచ్చినాడు. ఆయన గండభేరుం డపుటంచు దోవతిఁగట్టి యట్టిదే యుత్తరీయమును వలెవాటుగ వేసుకొనినాఁడు. కంఠమునఁ దులసిపూసల మాలిక ; చేతులకుఁ దులసిదండలు ; కర్ణములఁ దులసి మొగ్గలు, నుంచినాఁడు. ఫాలమునఁ బట్టెవర్ధనములు దేహమున ద్వాదశోర్ధ్వపుండ్రములఁ దీర్చినాఁడు. విజయరాఘవనాయకుడు వచ్చిన పెద్ది దాసును బెద్ద యాసనమునఁ గూర్చుండఁబెట్టి గౌరవించినాఁడు. క్షేత్రయ్య రాజు పెద్దిదాసునకుఁ జేసిన గౌరవమున కచ్చెరుపడినాఁడు. దీక్షితాదు లంద ఱకుఁ కన్నెఱ్ఱయైనది. క్షేత్రయ్యకు విజయరాఘవనాయకు లమూల్యములగు పట్టుపీతాంబరములను, తారహారములను, వివిధములగు నుపాయనములను సమర్పించిరి.

విజయ : క్షేత్రయ్యగారు భగవత్సంకీర్తనము సల్పుచో మే మెల్లరముఁ దరించిపోదుము. మా యాస్థానమునకు మీరాక యీనాడు మాకు పర్వదినముగా నున్నది.

పురుషో : క్షేత్రయ్యగారిచటికి వచ్చియుండిన మాకందఱకు సర్వక్షేత్ర సందర్శన మైనటుల నున్నది.

కోనేటి : క్షేత్రయ్యగారివంటి మహాభక్తుల దర్శనముచే మేము ధన్యులమైతిమి.

క్షేత్రయ్య లేచినిలచి పాడుచు నభినయింప నారంభించినాఁడు. భుజమున తంబుర, కాళ్ళకు గజ్జెలు, చేతిలో చిరతలు, నడుమునకు బిగించిన పట్టుత్తరీయము.

(మోహన — ఝంప)

మగువ తన కేళికామందిరము వెడలెన్
వగకాడ మాకంచి — వరద తెల్లవారెననుచు॥
విడజారు గొజ్జంగి — విరిదండ జడతోను
కడుచిక్కుబడి పెనగు — కంటసరితోను
నిడుదకన్నుల నీను — నిమురముబ్బుతోను
తొడరిపదయుగమునఁ — దడబడెడునడతోను॥
సొగసిసొగయని వలపు — సొలపుఁజూపులతోను
వగవగల ఘనసార — వాసనలతోను
నగముకుచముల విదియ — చందురులతోను॥
తరితీపుసేయు సమ — సురతి బడలికతోను
జరుతపావడ చెరగు — జారైవుటతోను
ఇరుగడలకైదండ — లిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగో — పాల తెల్లవారె ననుచు॥

చిట్టిముత్యములవలె సాత్విక స్వేదబిందువు లాయన కుందనపుకాంతిగల ముఖమునఁ బొడమి తళుక్కులీనినవి. ఆయన నేత్రములు సోగలై, నిమీలితములై, సమ్మోహనకరముగ నున్నవి. ఆయన గానమాధుర్యమునకును, అభినయౌచిత్యమునకును, పదలాలిత్యమునకును, సభయందెల్లరును ముగ్ధులైరి. సభయంతయు శృంగారరసమున మునకలెత్తినది. విజయరాఘవ నాయకులు క్షేత్రయ్య సంకీర్తనము చేసినంతసేపు పెద్దివాసు వంకనే చూచు

చుండిరి. పెద్దిదాసు కనులయందుమాత్ర మొకానొక యనిష్టభావ సూచకమగు సన్ననిరేఖ భాసించినది. సభాస్తారులు క్షేత్రయ్యను బలువిధములఁ బ్రశంసించిరి.

విజయ : పెద్దిదాసుగారూ ! క్షేత్రయ్యగారి సంకీర్తన మెటులున్నది ?

పెద్దిదా సేమిచెప్పునో యని సభయంతయు నెదురుచూచుచున్నది.

పెద్దిదాసు : మహాప్రభూ ! ఈయన గానవిద్యానిధి. సంగీతకళాప్రవీణుఁడు. గొప్పదైన భావనాపటిమ గలవాఁడు. మృదుశబ్దసంఘటన ఘటనాసమర్థుఁడు. భాషావిషయమున నన్నమయ్యగారి మార్గావలంబి. రచనాపద్ధతి కైశికీవృత్తి సంబంధమైనది. ఈయన సారస్వతము తంజాపురాంధ్ర సారస్వతముతో సామ్య మేర్పఱచుకొనలేదు. ఈయన మార్గము వేరు, మనమార్గము వేరు.

సభలో నందఱు పెద్దిదాసు విమర్శనాపటిమ కాశ్చర్యముఁ జెందిరి. క్షేత్రయ్య నిస్తబ్ధుడైనాఁడు. ఈయన తన కవితాప్రస్తావన చేయుచున్నాఁడు. తన భక్తినిగూర్చి యొకమాట యనఁడు. ఆయనలోని యహమిక యంతయు నపాస్తమైనది. క్షేత్రయ్య పెద్దిదాసునకు నమస్కరించినాఁడు. క్షేత్రయ్య పెద్దిదాసునకు నమస్కరించుటచూచి ప్రభువును సభ్యులునుఁ దెల్లవోయిరి. పెద్దిదాసు విమర్శ సునిశితముగానున్నది. పండితులంద రాయన విమర్శనజ్ఞానమున కబ్బురపడిరి.

విజయ : పెద్దిదాసుగారూ ! తాముఁగూడ సంకీర్తనము గావించిన కర్ణపేయముగ విని యానందింతుము.

పెద్దిదాసు : నేను స్వామివారి సన్నిధినిమాత్రమే గానమొనర్తును. వేరొకచోఁ జేయఁజాలను.

పురుషో : మహారాజులు రాజగోపాలుని యవతారము. ఈయనకూడ భగవంతుఁడే. కావున వీరిసమ్ముఖమునఁగూడ గానము చేయవచ్చును.

పెద్దిదాసు : ఈశ్వరుఁ డనంతకల్యాణపరిపూర్ణుఁడు. సృష్టిస్థితి లయకారకుఁడు. షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు. సంపూర్ణమైన మహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యమును భగవల్లక్షణములు. ప్రభువు లీశ్వరాంశసంభూతులే. కాని యాయంశ యీయనయం దల్పిష్ఠము.

కోనేటి : కాదు. రాజు సంపూర్ణుఁడు.

పెద్దిదాసు : రాజు మనకుఁ గైవల్యమీయఁజాలఁడు.

కోనేటి : శిరస్సు తీయఁగలఁడు.

పెద్దిదాసుకుఁ గోపమువచ్చెను. ఇట్లనెను 'భగవదంశలు రాజునందున్నను రాజే భగవంతుఁడు కాఁజాలఁడు. నా రాజును నేను ప్రాణములతో గౌరవింతును, నా మనస్సుతో గౌరవింతును. ఆత్మతోఁ బరమపురుషుడైన మన్నారు దేవు నొక్కనినే యారాధింతును. ఈ శరీరము నా ప్రభువుది. ఆత్మ భగవంతునిది. నేను బ్రాహ్మణుఁడను. మహారాజు నన్నుఁ దమ పాదములు పట్టుకొమ్మనినఁ బట్టుకొందును. కాని నా ముఖమునుండి వెలువడు సంకీర్తనము నా యాత్మయందలి పరమేశ్వరుని వ్యక్తీకరణము. దానికిని ప్రభువులకును నెట్టి సంబంధమును లేదు. ప్రభువు నా కంఠము నుత్తరించగలఁడు. నా యాత్మ నేమియుఁ జేయఁజాలఁడు. సంకీర్తనము నా యాత్మవిషయము. అటులని ప్రభువులయందు నాకుఁగల గౌరవమునకుఁగాని, తక్కిన యే భావమునకుఁ గాని లోపము లేదు.

సభయందంతట నొక విచిత్రసంచలన మొదవినది. పెద్దిదాసుని యావేశ ముపశమింపలేదు. చెప్పుకొనిపోవుచునేయుండెను.

పెద్దిదాసు : అట్టి మాటాడినచో మహారాజునందు నాకుఁగల గౌరవ మీసభయం దెంతమందికున్నదియో నాకుఁ దెలియదు. అందరును ప్రభువులను దమతమ జీవికలకై యాశ్రయించుచున్నారు. అందుకొఱకు వారియందు గౌరవమును బెంపొందించుకొనుచున్నారు. నాకు మహారాజులయందలి గౌరవము వారు పృథ్వీభారము వహించుచున్నారనియే. నా కీ గౌరవము, శరకమత, గ్రావసంఘాత, వాతాశనరాజాకాంతదంతిస్థవిరకిరులయం దెంతయున్నదో మహారాజునం దంతయున్నది.

ఆస్థానకవిబృందమునకుఁ బెద్దిదాసనినఁ గ్రోధభావము పొంగివచ్చినది. సదస్యు లెల్లరుఁ బెద్దిదాసు చతురవాగ్ధాటికి దిగ్భ్రాంతులైరి. విజయరాఘవనాయకులకుఁ బెద్దిదాసునెడల నొకవిధమగు గౌరవమును నొకవిధమైన చిరుకోపమును లీలగఁ దోచినవి. కాని యెవరు నేమియుమెదలలేదు. సభ నిశ్శబ్దముగఁ జాలింపఁబడెను.

౧౧

అదియొక ప్రత్యేకమందిరము. ఆ మందిరద్వారమువద్ద ద్వారపాలకులు కావలియుండిరి. ద్వారముచెంగట పది పండ్రెండుమంది పౌరులు రాజదర్శనోత్సుకు లున్నారు. తమకు రాజదర్శనమును గలుగఁజేయుఁడని వారు ద్వారపాలుర వేడుకొనుచుండిరి. వారు లోనికిఁ బోనీయకున్నారు. బ్రతిమాలుటలుగ, నిరాకరణములుగ నున్నది. రాయసము వెంకన్న వచ్చినాఁడు. ద్వారపాలకు లాయనకు నమస్కరించి దారియొసఁగిరి. వెంకన్న లోనికిఁ బోయినాఁడు. పౌరులు విసిగి వెడలిపోయిరి.

విజయరాఘవప్రభువు లొంటరిగఁ గూరుచుండి యోజించుచుండిరి "మన్నారుదాసుని మొగముఁ జూచియైన రాణిని మన్నింపవలయునఁట. మన్నారునకు నే ననిన లెక్కయేలేదు. సోమయాజులు చంద్రరేఖవద్ద కెటులఁ జేరెనో! చంద్రరేఖ రాణిపక్ష మవలంబించి రంగాజమ్మకు సందేశమంపినదా! రంగాజమ్మయనిన నెవరనియెంచినదో!"

రంగాజమ్మ భావనమే యాయనకుఁ బులకలు లేపినది.

"రంగాజమ్మ మధురమోహనాద్భుత సౌందర్య శృంగారరసస్రోతస్విని ఆమెనవ్వు లేమినవ్వులు! నవవికసిత పారిజాతప్రసవగుంఫితములు! నిండారు పండువెన్నెలసోగతీగెలు. ఆమె వీక్షణములు ముగ్ధమనోహరములు. శివజటాటవీ తటాసన్న స్నిగ్ధహిమాంశుశీతలములు. త్రపామధురములు. ఆమె మందస్మితస్నిగ్ధసితాపాంగరోచిస్సులు మర్మభేదనకరములు. ఆమెకును వీరికిని సంబంధమేమి? ఆమె శాపవశమున భూమికిదిగ్గివచ్చిన యమర్త్యభామిని. కావుననే యట్టి సమాధాన మొసఁగినది."

రాజు వెంకన్నను జూచినాఁడు. ఆయన యోజనలు చెదరిపోయినవి.

వెంకన్న: ప్రభువు లేమియో యోజించుచున్నారు. నారాక దానికేమైన భంగకరము కాదుగద?

విజయ: లేదు, ఏమాలోచనలున్నవి?

వెంకన్న నేలపైఁ గూర్చుండినాఁడు. రా జాసనముపైఁ గూర్చుండు

మనినాఁడు. వెంకన్న ప్రభువుల దయయున్న నేలయే యాసనముకన్న నెక్కుడనినాఁడు. ప్రభువు మాటాడలేదు.

వెంకన్న: క్షేత్రయ్యగారి మధుర భక్తి యనన్య సామాన్యమైనది.

విజయ: అట్టి గానమధురిమను నేనెన్నడు నెఱుఁగను. ఆయన పద లాలిత్య మనితర సాధ్యము. కాని పెద్దిదాసుగారు చెప్పినటులాయన మన తంజాపురాంధ్ర సారస్వతానుయాయిమాత్రము కారు.

పెద్దిదాసు పేరెత్తగనే వెంకన్న మొగము వాడినది. రాజది గమనించి నాఁడు.

విజయ: వెంకన్నా పెద్దిదాసుగారు చెప్పినది నిజము కాదని నీ యభిప్రాయమా? ఇంతలో నిశ్చైతివేమి!

వెంకన్న కృతకహాసమొనర్చి యనినాఁడు. "పెద్దిదాసుభావము నెవరు కాదనఁగలరు? ఆయనకున్న విచక్షణత యెవరికున్నది! అది కాదు. మీరు సాక్షాత్తు కృష్ణస్వరూపులు ఆయన నీలవర్ణుఁడు. మీరును నీలవర్ణులే. ఆయనకుఁ బదునాఱువేల గోపికలున్నారు. మీకును పదునాఱువేల యువతులున్నారు. ఆ ద్వారక ప్రక్కన సముద్రమున్నది. మన తంజావూరు ప్రక్కన సహ్యజ యున్నది. ఆయన కష్టమహిషులుండిరి. మీకును నష్టమహిషు లున్నారు. ఆయన పాండవులకు సాహాయ్య మొనర్చెను. మీరు కర్ణాటాధీశ్వరుని నిలువఁ బెట్టితిరి. ఆయన భగవద్గీత వ్రాసినకవి. తమ రేఁబదిగ్రంథముల వ్రాసిన మహాకవులు. మా పెద్దిదాసు........

విజయరాఘవనాయకులకు వెంకన్న చెప్పుచున్న దంతయు నిజమే ననిపించినది. తనకును కృష్ణునకును నిజముగ భేదమేమి!

విజయ: 'మా' యేమిటి? అవును. ఆయన నీకుఁ జుట్టమంటివిగదా! అది యెట్టి చుట్టరికము?

వెంకన్న: మాకతఁ డేదోబంధువు.

విజయ: మీకాయన యేదో బంధువా?

వెంకన్న: అవును. పెద్దిదాసు చెప్పిన మాటలు ప్రభువులు తాము

గానిచో న్యాయమే కాని తామైనారు గనుక నాతని మాటలు క్షమార్హములు గాకున్నవి.

రాజు మనసునందు పెద్దిదాసుపైఁ గ్రోధము కలిగినది. కాని పెద్దిదాసనిన మాటలలో నిజములేక పోలేదను కొనినాఁడు.

విజయ : నిజమేనయ్యా ! మనమాయనకుఁ జేసినచో శిరశ్ఛేదము జేయఁగలము కాని యాయన యాత్మ నేమి చేయఁగలము ?

వెంకన్న : మీరు వైకుంఠమున కీశ్వరులు. ఆయనకు వైకుంఠము నీయవలదని నా ప్రార్థన.

విజయ : వెంకన్నా ! వైకుంఠము మనచేతిలో నున్నదా :

వెంకన్న : ప్రభూ ! తమ చేతిలోనే యున్నది. తమ హస్తములలోఁ బాదములలో శంఖచక్రము లున్నవి. హలకులిశాది రేఖ లున్నవి.

విజయ : మేము పెద్దిదాసు నేమైనఁ జేయు టటులుంచుము. మా కుమారుఁడైన మన్నారుదాసు నేమిచేయఁజాలితిమి ?

వెంకన్న మన్నారుదాసుపైఁ గొండెములు చెప్పుటకు సమయము చిక్కినదనుకొనినాఁడు.

వెంకన్న : ప్రభూ ! నాపైఁ గినుక వహింపకుందురేని, మన్నారుదాసు :

విజయ : మన్నారేమనినాఁడు ? చెప్పుటకు సందేహింపఁ బనిలేదు.

వెంకన్న : మన్నారుదాసుగారు మిమ్ములఁ గూర్చి రకరకములుగ మాట్లాడుచున్నారు. మీరాయన తల్లిగారి నవమానించుచున్నారని, సల్పిన పాపములను గడిగివేయుటకు సత్కార్యముల నొనర్చుచున్నారని, స్త్రీలోలురని. యింకను ననేకవిధముల నిందించుచున్నారు.

రాజు మాటాడలేదు.

వెంకన్న : చెంగమలదాసు మాత్రము బుద్ధిమంతుఁడు. గుణవంతుఁడు. ఆయనకు మీరన్న నపరిమితమగు గౌరవాభిమానములు. మిమ్ములఁగూర్చి యెవరేని యేమైన ననుకొనినట్లు తెలిసిన వారిని శిక్షించిగాని విడువరు. అంతటి ప్రేమ ! చల్లనితల్లి ఖీరాంబికాదేవిగారు మిమ్ములఁ దమ ప్రాణసమానులుగా

జూతురు. ఆమెకు మీరేమి యొసఁగినను ఘనకార్యమే. రాజగోపాలాంబికా దేవిగారి కట్లుగాదు. ఆమెకు మీరు చంద్రరేఖఁ గొనివచ్చుట యొప్పునిపని. ధీరాంబికాదేవిగారు సంతసించినారు. ఆమె సద్గుణములప్రోవు.

మధ్యాహ్న ఘంటారవము వినవచ్చినది. వెండి బెత్తములవారు వచ్చి 'మహాప్రభూ! మధ్యాహ్న మైన' దనిరి. వెంకన్న లేచినాఁడు. రాజుమనమున ధీరాంబికపైఁ బ్రేమ పెరిగివచ్చినది. ఆమెను జూడవలె ననుకొనినాఁడు. పరిచారికలువచ్చి భోజనమునకు లెమ్మనిరి. వెంకన్న వెడలిపోయెను.

విజయరాఘవ నాయకు లిరువురు యువతులు కైదండయొసఁగ నంతః పురాభిముఖులై వెడలినారు. అచట నొక కాంత బంగరుతంబుగ నిండుగఁ బన్నీరునించి దానితో వారి పాదములఁ గడిగినది. ఒక ముదిత పాదములతడి యొత్తినది. ఒక యువతి రాళంజిఁబట్టుకొని నిలిచినది. ఒక సకియ చలువ పన్నీరు నించిన చికిలిబంగరుగిండి మహారాజుచేతి కందిచ్చినది. ఆయన ప్రసూన పరిమళమిళిత మధురోదకముల ముమ్మారు పుక్కిలించెను. అధర మును పావడచే నొత్తుకొనెను. అటుపై నింపిరా మంచెరమున రాజిల్లు రాజ్యేందిరకుఁ గేలు మొగిచి నమస్కరించెను. రాణులాయన కెదురుగ నిలిచి తమకుఁ బరిచారిక లందిచ్చు నవరత్న నీరాజనము లొసంగిరి. పట్టమహిషి రాలేదు.

నిలువుటద్ద మొకసుందరి చేతఁబట్టి నిలిచినది. స్త్రీలు కడాని తట్టలు పట్టుకొని నిలుచుండగనే రాజు కొలువు శృంగార పుటాభరణములను సడలిం చెను. సరిగంచు చలువలఁ గట్టెను. చిన్నారియొంట్లు, శ్రీరామతాళి, సన్నవజ్ర ముల చేసరులు ధరించెను. అప్పుడు సింగపు మొగములతో నొప్పు చేరుళ్లచే వెలయు విశాలమగు భోజనశాలకు వచ్చెను. ధవళశంఖములు, తాళములు మ్రోగినవి.

పూఁబోడులు కొందరు బోసపుటటికలఁ దెచ్చి సరిగబంగరు తెఱచాటున నుంచిరి. కొందఱతివలు ప్రభువునకుఁ గుందనపు పీఠమున బంగారపు పురతకాల్పరువు ఘటించిరి. ఫలకములు, రత్నకంబళములు, తివాసులు, చక్కళములు నమర్చిరి. పగడాల నిగరాలచే మలచఁబడి జిగిదేరుచున్న

బంగారుసింగపు కోళ్ళతో నొప్పుచున్న యడ్డిగమీఁద పేరోదనపుఁ బెద్దబొడ్డు పళ్లెరముంచిరి. ఆ పళ్లెరమున కిరువైపులఁ గనక కదళీదళముల నుంచిరి. బటువులుగ, చౌకములుగ పట్టెలుగ ఘటియించిన బంగరుగిన్నెలుంచిరి. ఓరలఁ గీర, మయూర, దుల్తూర కోరక ముఖములుగఁ జేసిన క్రొత్తపైడి గిండ్లయందు కలువపాదిరి తావుల గమగమలాడు చలువనీరముల నుంచిరి. అంచమోములమించు హరివాణములు, కంచములు, పళ్లెరములు, గంగాళములు, కదళీదళములు, కత్తెరపొప్పులు, గిన్నెలు, ఓర లెరిగి రెండు బంతులుగ నమర్చిరి. కొండిక ప్రాయపు గుబ్బెతలు కొందరు భయభక్తులతో పళ్లెరముంచితిమని నివేదించిరి. అప్పుడు రాజు వేదండయాన కైదండఁగైకొని బంగరుపీట డిగ్గి చీనిపట్టు గద్దిగమీద రాణులు పరివేష్టించియుండ బంతిదీర్చి కూర్చుండెను.

గిలుకు మట్టియలు సన్ననిరవలు లీన నొకతె పచ్చడులు, జాళువాకడియములు సరిమోతమ్రోయ నొకయువతి శాలితండులపుఁ బ్రసాదము, ముంగామురంబులు మొరయ నొకతరుణి బంగారుచాయల పప్పులు, సందిదండలు మ్రోయఁగ నొకవనిత సద్యోఘృతమును దెచ్చి వడ్డించిరి.

సరిపెణలు తడఁబడుచుండగ నొక ముద్దియ సత్వరముగ శాకపుఁ గూరలు, ఒక లతాంగి యప్పడములును నువుపొడియు హవణించిన కప్పురపుకోడి, ఒకతె కరివేపపొడిఁ జల్లి తురిమిన టెంకాయఁజేర్చి కమ్మనినేతిలోఁ బొంకముగఁ దాల్చిపొదిగిన కుంకుమకోడి, చణక చూర్ణము మినపచూర్ణము సగములుగఁ గలిపిమేదించి కమ్మగ వండిన కస్తూరి కోడి నొకసుందరియు, వేఱొకసుదతి చీనిచక్కెరఁ జల్లిన నవనీతఖండములఁ గలిపి మృదుపాకముగఁ జవులూరునట్లుగఁజేసిన పాలకోడియు, ఒకపడఁతి లశునఖండములు, పలాండు ఖండములు వేపుడు పొళ్ళను గలయఁజల్లి యొనర్చిన కిట్టుకోడిని, నులువ కోడినిఁ దెచ్చిరి.

మృగమద ఘనసారమేళనజనిత ఘుమఘుమవాసనలు భవనమంతట వ్యాపించ నృపభోగ్యమైన పన్నీరుపాయసము నొకచకోరాక్షి, చపలాక్షియోర్తు వెలిచెలకజకుట్లు, వెన్న చక్కెర, చిలికెంచి వండినచేపల యిూర్పు. జాపత్రి, కురాసానియోమంబు, వేపుళ్ళు, కొలనురివిత్తులుఁగూర్చి రంజిలునట్లు చేసిన

పిరంజి నొక కంజాక్షియు, వడియములు వపకరిపి వండినపొడికూర లొక పొలతుకయుఁ దెచ్చియుంచిరి. వెలిచెల పూరేళ్ళ విలసిల్లు చలువయాన మ్మొక సఖియు, క్రొందునుకలుచేసి క్రొవ్విన పేటకందనకాయఁ దక్రంబునఁగడిగి, జంబీరసార సేచనముఁజేసి, గంబూర కస్తూరులు కలిపి వపవైచిన యుప్పురస మొక యొయ్యారియు, అప్పడములును వడియములును వైచి, కప్పురపుఁ దావులు ఘుమ్మనునట్లు వండిన చిక్కుడుకాయరొయ్య యూర్పొక తలిరుఁబో డియుఁ గొనివచ్చిరి. బిత్తరియోర్తు పేణీలు, మత్తకాశిని యొకతె మండెగలు, లలనామణియొకతె లడ్వములును, పూర్ణకలశము లొకకలికియు, ఒకసకియ వెన్నకజ్జాయమును, మకరలోచన యొకతె మణుగుఁబూలును, అతివయొకతె తెలియతిరసములును, సతియొకర్తుక సారసత్తులును, ఒక కలకంఠి కరివడలును నీలనేత్ర యొకతె దధివడలును, ఒకరిమణి యామ్రపువడలు, ఒక కోమలి పప్పుకుడుములును, వరుసగఁ దెచ్చివడ్డించిరి.

తెలికుక్కరొట్టె, టెంకాయరొట్టె, చలువలువెదజల్లు సాంబారురొట్టె, తెలుటు బాలు, తనిబాలు, తెంకాయ పాలు, గరగరనగు జీలకఱపాయసము, డాలువైచిన చలువపాయసము, సురభిళమగు సొజ్జిపాయసము, కమ్మని శిఖరిణులుకలిగిన వంటకములఁ గొందరుకొమ్మలు దెచ్చిరి.

రసభరితములగు రసదాడిపండ్లు కుసుమాస్త్రమును మించు నొక బోటియు, చిలుపచిలుప తేనెలు చిలికెడు పనసలొన లొక గంధసింధుర యానయు, తేనెలోవైచిన తీయమామిడిపండ్లు, ద్వీపాంతరపు ద్రాక్షపండ్లును, కర్జూరములు, నిగనిగలుదేటు నేరేడుపండ్లు. పగడములవలె జిగజిగలాడు రేగు పండ్లు, గేదంగిచాయల కిత్తడిపండ్లు, పాలపండ్లు, దోసపండ్లు వింతరుచులనీను వెలగపండ్లు, కెంపులవలెనున్న దాడిమపండ్లు, తళుకు చీనికడాని తట్టలనుంచి తీసుకొనివచ్చిరి. చొక్కమగు వెన్నరుచులు విసాళించు మీగడచట్లు, జంబీర సారము, ఉతముగ లవణము, శొంఠి, ఏలకి పొడివైచి వట్టివేళ్ళచే తావులు గట్టిన నీరు మజ్జిగ నొకభామ తెచ్చినది. వీనన్నిటిని మొదల శ్రీరామభద్రున కర్పణముఁజేసి ప్రభుపు తనరాణులతో భోజన మొనర్చెను.

పట్టపురాణి రానందుల కాయన కోపముగనున్నాఁడు. ఏలనో రాజు

సరిగభుజింపలేదు. శీతాంశువదన లిరువురు చేగిండ్లవంపఁ జేతులుకడిగెను. శుద్ధాచమనంబుచేసి, తులసిభక్షణ మొనర్చెను. శతపదన్యాసము సల్పెను. బాలరామాయణ పఠన మొనర్చెను. జాళువాబంగరు సరిగ పనులు దీర్చిన గద్దియమీఁద కూర్చుండి కప్రపుఁదాంబూలముఁ దన దేవేరులతో స్వీకరించెను. అప్పుడు ముత్యాల హారతులు రాజున కెత్తిరి. రాజు తన విశ్రామభవనమునకుఁ బోయెను. ఆయన భోజనమే చేసినటుల లేదు. వంటకత్తియలు తమ వంటకము లలో నేదేని బొరపాటు జరుగలేదుగదా యని సభయనేత్రలైరి. అంతఃపుర దాసీలు పలువిధముల గుసగుసలు వోయిరి.

సాయంకాలమైనది. అస్తాచలోన్ముఖుఁడగు దినమణి రాజునకుఁ బ్రియా మార్గగామిత్వముఁ బోధించుచున్నాఁడు. రాజసందర్శనమునకుఁ గువలయము త్వరపడుచున్నది. ఆకాశమున దూరదూరముగ నల్లనిమబ్బులు తారాడుచున్నవి. ప్రభువు తన సౌధోపరిభాగమున నిల్చినాఁడు. ఆయనదృష్టికిఁ దూరమునుండి మసకమసకగ ధీరాంబికా సౌధశిఖరాగ్రము కనుపించుచున్నది. ప్రొద్దున నామెనుగూర్చిన వెంకన్న పొగడ్త తలఁపునకు వచ్చినది. ధీరాంబికవద్దకుఁ బోవుద మనుకొనినాఁడు. సరాసరి స్నానపుగదికిఁ బోయి యచటనున్న బంగరు గద్దియపై నాసీనుఁడైనాఁడు. అచట నున్న సుందరీమణులు రాజు కనుసన్న జంతాయితముగ బంగరుపలక పీట సమర్చిరి. పరిమళములు వెదజల్లు పన్నీటి కొప్పెరయు వానిపద్ద కడానితంబుగయు నుంచిరి. జలకమ్మునకుఁ ప్రభువును హెచ్చరించిరి. ప్రభువు వేదండ నున్న యొకముద్దియ రాజునకు రత్నపాదుకలు దొడిగెనది. యువతుల సాహాయ్యమునఁ బీటవాఁక మెల్లనడచి రత్నపాదుకలు సడలించి పీటపైఁ గూర్చుండి జలజాక్షు లందిచ్చు లంబుగల నందికొని చలువ పన్నీట మజ్జన మాడెను. యువతులు చలువదువ్వటములఁ దడియొత్తిరి. బంగారు సరిగ దుప్పటి చారిగట్టి, బంగారుపూలుగుట్టిన యంగీతొడిగి, చెంగావి జరీరంగుగల యుత్తరీయమును భుజము మీదుగ జారునట్లు వైచికొనెను. అటనుండి యిందిరామందిరమునకు వచ్చెను.

అచటి స్త్రీలు ప్రభువులఁ గనకపు గద్దియపై గూర్చుండఁజేసిరి. ఒకతె జవ్వాది వాసనల విరజిమ్ము తైలమును రాచి నెఱికురులదువ్వి సిగవైచి ముడు

పులు చుట్టినది. వేరొకతె చిగురుచందురు కావిజిలుగు రుమాలసిగ చెంపకడఁ జారఁగట్టినది. చికిలిముత్యపుఁదురాయిఁ బెట్టినది. కట్టాణిముత్యములకంటసరులు వజ్రంపు చేసరులు హెచ్చు వెలగల సోగముత్తియపు టొంట్లు నలంకరించినది. లలాటమున మృగనాభితిలకముఁ దీర్చినది. గోవజవ్వాది, కుంకుమ, కప్పురముఁ గలిపి పన్నీట మర్దించిన కలపమలందినది. కెంపులు చెక్కిన పిడి గరిగి పలకవజ్రములు తాపఁబడి కళలుదేరెడు నడ్డకత్తి ధరింపనిచ్చెను. పూబంతి యొకడు చేతికిచ్చినది.

ఒక సుకుమారి పురతరాల్పాపోసులు తెచ్చి మునివ్రేళ్ళఁ దొడిగినది. అడపపుఁబడతి యందిచ్చు కప్పురపుముడుపు లందుకొనెను. ఇట్లు తన శృంగారాలంకరణము పూర్తిగావించుకొని యొక జాత్యశ్వముపై ధీరాంబికా సౌధమునకు బయలుదేరినాఁడు.

ప్రభువురాక తల్లికొడుకుల కిరుపురికి నాశ్చర్యమైనది. ధీరాంబిక యానందమున కవధిలేకుండెను. ఆమె రాజునకుఁ గర్పూరనీరాజన మిచ్చినది. హేమకలశముతోఁ జేటిక జలమువోయ పాదములు గడిగి తన జరీపూలు కుట్టిన తెల్లిపైట చెఱఁగులోఁ బాదము లొత్తినది. రాజామెను బలు విధములఁ బ్రశంసించినాఁడు. రాణివాసంచము తలమున్కలుగ నున్నది.

రాజు : ధీరా! మే మిచటికి వచ్చి చాలకాలమైనదనుకొందుము.

ధీరాంబిక : ప్రభువు లెల్లపు డిచటనే యున్నటులుండును. తమరు నా సదనమున కేతెంచుటయే యనుగ్రహము.

రాజు మనమున రాణి మాటలకు సంతసించినాఁడు. ఆయనకు ధీర యునినఁ బ్రేమ యధికమైనది. ఆమె యింత శాంతమతియని తా ననుకొనలేదు. నిజముగఁ దా నచటికి వచ్చినది చెంగమలదాసు పుట్టుకలకు; మఱి రాలేదు.

రాజు : ఓసి ధీరా! అందరు భార్యలును నీవలెనే యున్న నెంత బాగుండును.

ధీరాంబిక : మహాప్రభూ! వారి బిడ్డలు యువరాజులు; వారు పట్టపు దేవేరులు. నా బిడ్డఁడు వట్టి రాజకుమారుఁడే.

రాజు : చెంగమలుడు మాత్రము యువరాజేల కాఁగూడదు ?

ఈ మాట వినుటతోడనే ధీరాంబికకు వెంకన్న చెప్పిన జోస్యము జ్ఞప్తికి వచ్చినది. ఒక్కసారి కనులు మూసికొనినది. రాజు ధీరాంబికయింట భోజనముఁ జేసినాఁడు: వారిరువురును గడచిన యనుభవములను త్రవ్విపోసి కొనుచు వినోదములఁ బ్రొద్దుపుచ్చిరి. రాజు తెల్లవాఱుఝాముననే లేచి తన సౌధమునకు బయలుదేరినాఁడు. రాణి యాయనకు నమస్కరించినది. రాజామె చిబుకమును స్పృశించి ముద్దిడుకొనినాఁడు. కేళిమందిరము దాఁటి యీవలకు వచ్చెను. చెంగమలదాసు తండ్రికి సాష్టాంగనమస్కారముఁ జేసినాఁడు.

రాజు . నీ వింకను మేలుకొనియుంటివా ?

చెంగ : నా తండ్రి, నా ప్రభువు, సాక్షాత్తు మన్నారుదేవుని యవతారము నా యింటనుండ నేను నిదురపోయి యపచార మొనర్పఁగలనా ?

కొడుకునకుఁ దనయందుగల భక్తిశ్రద్ధలఁ జూచినప్పుడు రాజున కానందము, ప్రేమ పొంగివచ్చినవి. కొడుకు శిరము ముద్దిడుకొని హయారూఢుఁడై రాజవీధిని బయలుదేరినాఁడు. "వెంకన్న చెప్పిన దక్షణముల నిజము. ధీర యెంత సుగుణవతి ! చెంగమలునికి నాయందెంత భక్తి !" యనుకొనినాఁడు. రాజవీధిలో నక్కడక్కడ మనుజసంచార మున్నది. కొంతదూరమున నొక కుక్క రాజును జూచి యఱచినది. రాజు పోవుచునే యుండెను. కొన్ని గృహములందు మేలుకొలుపుపాటలు, భజనలు వినవచ్చుచున్నవి. ఆకసమునఁ గొన్ని నక్షత్రము లస్తమించుచున్నవి. కొన్ని యుదయించుచున్నవి. కొంత బాట గడచుసరికిఁ బుణ్యాంగనా ముఖము లెదురైనవి. రాజు సంతసించినాఁడు. రాజసౌధముఁ జేరునప్పటికి దిక్కులన్నియుఁ దెలతెలనైనవి. రాజు సరాసరి తన సౌధోపరిభాగమున కేగినాఁడు. ప్రాతరుదిత బాలభాస్కర ధవళారుణ సువర్ణదీధితులు నక్షత్రముల వెలుఁగులఁ బరాస్తమొనరించినవి.

౧౨

ఉదయవేళ. పెద్దిదాసు తన యారామమునఁ గృష్ణార్చనకై పువ్వులఁ గోయుచుండెను. రాయసము వెంకన్న వచ్చినాఁడు. పెద్దిదాసితఁ డింత ప్రొద్దు మొగమున వచ్చినాడేలనో యనుకొనినాఁడు.

పెద్దిదాసు : ఈనాఁడింత ప్రొద్దుననే వచ్చితివి! విశేషములేమైన నున్నవా?

వెంకన్న : మిమ్ముల దర్శించి చాలకాలమైనది. అదియుఁగాక నే నీ పురము వీడి కొంతకాలము కార్యాంతరమున వెడలవలసి యున్నది. అందుచే మిమ్ముల నొకసారి సందర్శించిపోయెదనని వచ్చితిని.

పెద్దిదాసు : ఈ పురమువీడి యెచటి కేగెదవు?

వెంకన్న : మధుర....కాదు పెనుగొండ.

పెద్దిదాసునకు వెంకన్నవాలక మానాఁడొకవిధముగఁ దోఁచినది.

పెద్దిదాసు : ఊరిపేరుచెప్పుట కిట్లు తడఁబడుచున్నావు. నీ మనస్సిచ్చట లేదు. నీ వేదో మనమునందు దుర్భావనఁ జేయుచున్నట్లున్నావు. నీ జన్మ యెట్టిదో కాని బుద్ధివచ్చినవాడి పిల్లిమీఁద ఎలుకను, ఎలుకమీఁద పిల్లిని నెక్కించుచుందువు. నీ వాలకమే యట్టిది.

వెంకన్న తా నచటికేల వచ్చితినా యనుకొనినాఁడు. తన భావము లాయన కెట్లు తెలిసినవో! అతనిలోని ధైర్యము సడలిపోయినది. మరుక్షణ మున గంభీరతను దెచ్చుకొనినాఁడు.

పెద్దిదాసు : నీవు విజయరాఘవనాయకులను మాత్రము పరమేశ్వరుని వలె భావింపుము. ఆయన గుణసంపన్నులు, ధీశాలులు, కళాభిజ్ఞులు, ఆశ్రిత కల్పకము. ఆయనగారి కెట్టి యపకార మొనర్పఁజూచినను జెడిపోయెదవు.

వెంకన్న : మీ రిన్నివిధములఁ బొగడుచున్నారు. వారియందు దోషములే లేవా? తమ యగ్రజు లిరుపురికనులు పీకించినారే! అది దోసముకన్నదోషము. గతయుద్ధమున మిత్రునివలె మెలఁగుచు మధుర చెంజినాయకులను నమ్మించి నడియుద్ధమునఁ బార్శ్వభంగమొనర్చిన ద్రోహము దోషము కాదేమి? తా మీ వయస్సున నట్లు విలాసములందు మునిఁగితేలుచుఁ బట్టఁపురాణి నవమానించుట దోసముకాదా? అట్టి ప్రభువును బరమేశ్వరునిగ భావించవలెనా?

వెంకన్నధోరణికిఁ బెద్దిదాసు కుపితుఁడైనాఁడు. వీఁడసాధ్యుఁడు. రాజునకుఁగూడ నేదైనఁ ద్రోహముఁజేయఁ దలఁకొనినాఁడా? పెద్దిదాసు కోపముఁజూచి వెంకన్న నవ్వుచు ననినాఁడు: "మన్నారుదాసు మీ శిష్యుఁడు.

ఆయన ప్రభువునుగూర్చి యథార్థముగ నిందించినను మీకుఁ గోపమురాలేదు. నే నూఱక నవ్వుచు ఛలోక్తిగ ననినమాటల కింత యాగ్రహింతురేమి ?"

పెద్దిదాసు : నీ మాట సరికాదు. మన్నారాయన కుమారుఁడు. ఎట్టి మనస్పర్ధలున్నను ప్రభువాయనతండ్రి. ఒకసమయమున నాగ్రహపడినను వేఱొకతరిఁ గలియగలరు. వారి భావము లేకము కాగలవు. వారియందలి పితాపుత్రసంబంధము నశింపనిది. నీ వన్నచో నట్లుకాదు. నీవు నియోగివి. నీవు గుండెయందు విషమునుంచుకొని పైకి నవ్వుచు మాటాడఁగలవు.

వెంకన్న : మీరుమాత్రము నియోగులు కారా ? నన్ననినచో మిమ్ముల ననుకొనినట్లు కాదా ?

పెద్దిదాసు : అదికాదయ్యా ! నేను రాజులకు నియోగినిగాను, రాజగోపాలునియోగిని.

వెంకన్న : బాగున్నది. ఆస్థానమునందలి కవులందరును సంపాదించుకొనుచున్నారు. అందుచే వా రందఱకు రాజుగారిమీద గౌరవము. రాజునకు వారిమీఁద ప్రేమ. మీ రనినచో నాయనకుఁ గోపముగఁగూడ నున్నది. ఆయనపై మీ కింత యభిమాన మెందులకు ?

పెద్దిదాసు : నా కాయనపై నభిమానముకాదు. ఈ రాజ్యముపై నభిమానము. ఇది తెలుఁగువారి రాజ్యము. నేను తెలుఁగువాఁడను. నా భగవత్సంకీర్తనమంతయుఁ దెలుఁగుననే చేసితిని. నా యేలిక తెలుఁగువాఁడు. ఈ తంజావూరు సురక్షితముగానిచో నా తెలుఁగుమర్యాద పోవును. నా తెలుఁగు గొప్పతనము పోవును. నా తెలుఁగునకు స్థానమే యుండదు. అది నశించిపోవును.

పెద్దిదాసునకుఁ దెలుఁగనినఁ బట్టరాని గౌరవము. తెలుఁగును దిరస్కరించువా రనిన నాయనకుఁ గిట్టదు. తెలుఁగున కేదైన నవమానము జరిగినచో నాయన యల్లాడిపోవును. తెలుఁగుపేరెత్తిన నాయన కావేశమెత్తును. పెద్దిదాసు చెప్పుకొనియేపోవుచుండెను. వెంకన్న తలవంచుకొని మారాడక గూర్చుండెను. అతని మొగము క్రూరత్వమును వెలికిఁ జిమ్ముచున్నది.

పెద్దిదాసు : విజయరాఘవనాయకులు తెలుఁగువారు కావుననే క్షేత్రయ్య యిచటికి వచ్చినాఁడు. కూచిపూడి భాగవతులు వచ్చి తమ భరతశాస్త్రము నిచట

వెదజల్లినారు. చేమకూర వెంకన్నవంటి కవి తంజావూరునకు వన్నెఁ దెచ్చినాఁడు. తెలుఁగుప్రతిభ దక్షిణమునకు వ్యాపించినది. తెలుఁగుభారతి మధుర భారతి. తెలుఁగు సరస్వతి సుకుమార సరస్వతి. ఆమె నవరసమూర్తి. సంస్కృతముతరువాత మఱల మహాభాష యనునదున్నచోఁ తెలుఁగుభాష యొక్కటే. ఇంకొకటి లేనేలేదు. సంస్కృతమును యథాతథముగఁ దీసుకొనిన దొక్క తెలుఁగుభాషయే. యజ్ఞనారాయణ దీక్షితులు, రత్నఖేట దీక్షితులు మొదలగు సంస్కృతకవుల ముఖసీమలందు గీర్వాణవాణి తెలుఁగు మెత్తఁదనము నలవఱచుకొనినది. ఆ తెలుఁగుభాష శ్రీకృష్ణదేవరాయలవారి దయా విశేషమున దక్షిణమున వెలసినది. ద్రావిడులను నాగరికులనుగఁ దీర్చిదిద్దినది. వారి యాచారవ్యవహారముల కొక రూపము నిచ్చినది. ఆ మధురభారతి యనేక కనకాభిషేకములందినది. ప్రభువులు బోయీలుగఁ బల్లకినెక్కినది. అట్టి తెలుఁగునకుఁ జేటొనర్ప యత్నించకుము.

వెంకన్న : మధురనాయకులును దెలుఁగువారే కదా ?

పెద్దిదాసునకు వెంకన్న దుష్టబుద్ధి తెలిసిపోయినది. "ప్రభువీతని కౌటిల్యముఁ దెలియలేకున్నాడు. అప నెట్లు తెలియఁగలడు ? వీని తత్వమే యిది. విశ్వాసద్రోహి ! అయ్యో ! తంజావూరున కెట్టి కష్టదశ ప్రాప్తించ నున్నదో." ఆయనకు వెంకన్నపై గోప మతిశయితమైనది. తన యావేశముఁ బట్టలేకపోయినాడు.

పెద్దిదాసు : వెంకన్నా ! నీ యాలోచనలు కుటిలములు. నీ కీ నడత మంచిదికాదు. నీవు విచిత్రపుఁజావు చచ్చెదవుసుమీ ! నీవంటివా రింతకుమున్ను బాగుపడినదిలేదు. ఇకముందు బాగుపడునదియు లేదు.

వెంకన్న వికటముగ నవ్వినాడు. ఆ నవ్వులో నొకవిధమగు నాందోళన లేకపోలేదు. పెద్దిదాసుకనులు ధగధగలాడుచు మండుచున్న చింతనిప్పులవలె నున్నవి. ఆయనచూపులు వెంకన్నశరీరమందంతటను బ్రసరించి దహింపఁ జేయునట్లున్నవి.

వెంకన్న : రాజుపై మీ కింతటిప్రేమ గలదు. తంజావూరనినను, తెలుఁగుసారస్వతమనినను నింత యభిమాన మున్నది కదా ! మీ భక్తియేమి ?

మీ రెట్టి భక్తులు? మీకు రాష్ట్రాభిమానమే వదలలేదు. విశ్వప్రేమ యెట్లలవడును? విశ్వనాథునియం దనన్యత్వసిద్ధి యెట్లు పొసగును?

పెద్దిదాసునకుఁ దనభక్తినిగూర్చి విమర్శించునరికి దుఃఖము పొంగి వచ్చినది.

పెద్దిదాసు : తల్లియందు పూజ్యభావ మలవడినఁగదా పర వనితలయందు మాతృదర్శనముఁ జేయఁగల్గుట 'స్వయంతీర్త్వా పరాంస్తారయతి' యనినారు పెద్దలు. "రాష్ట్రాభిమానము మాతృభాషాభిమానము లేని విశ్వప్రేమ కర్థమేమి? ఇంటఁ గెలిచి కదా రచ్చఁ గెలువవలసినది? రాష్ట్రాభిమాన ముండనేవలయును. కాని యది విశ్వశ్రేయస్సాధనయం దొక సోపానమాత్రముగ వినియోగ పడవలయును. ఆతంకగారి కారాదు. మూలమేలేని వృక్షమునకు శాఖావిస్తరణ మెట్లు? స్వరాష్ట్రమునందును, స్వభాషయందును నభిమాన ముండితీరవలయును. కాని యది దురభిమానముగఁ బరిణమింపరా దంతియే. వివిధదేశములందలి భావౌన్నత్యమును స్వీకరించి స్వకీయభారతి నలంకరింపవలెను. మన సంస్కృతిని, మన నుడికారమునందలి మధురిమను నితరులకు వితరణ మొనర్పవలెను.

వెంకన్న : అది భక్తియా లేక దుఃఖమా?

ఆతని ధ్వనిలో వెక్కిరింత, పరిహాసముఁ బ్రతిబింబించుచున్నవి. పెద్దిదాసు దుఃఖవివశుఁడై కూలఁబడి వలవల నేడ్చినాఁడు. ఏమియు మాటాడఁ జాలకుండెను. గగనమండలమున నాకస్మికముగ నొక కరాళకాలమేఘము తోచి తళుక్కున మెఱసినది. పెద్దిదాసు తలయెత్తి చూచినాఁడు. ఆయనయొడ లాయనకుఁ దెలియుటలేదు. ఆ మొగిలుఁ జూడఁగనే గోపాలసాక్షాత్కార మైనట్లయినదాయనకు. ఆయనహృదయము భక్తితరంగితమైనది. "నీలమేఘ సువర్ణా! రాజగోపాలా! జగదేకసుందరా!" అని యఱచినాఁడు. ఆయన నయనద్వయమునుండి యానందబాష్పవృష్టి కురియుచున్నది. క్షణక్షణమునకు భక్త్యావేశవిహ్వలత యతిశయించుచున్నది. లేచి నిలిచి చిందులువేయుచు పాడుచు నృత్యమొనర్ప నారంభించినాఁడు.

దయచూడరా ! ముకుందమన ! కలుషశమన !
పరాకేలరా ! బాలగోపాల ! రాజగోపాల ! కరుణాలవాల !
చదలు కదుపులోన మెల్ల కదలు సన్నని వెలుఁగ !
ఉదితాఘదనుజ మహోదరమునఁ గ్రుచ్చుకొన్నయలుగ॥

జలజల వాన కురియ నారంభించినది. పెద్దిదాసటులే భావావేశమున నృత్య మొనర్చుచుండెను. వెంకన్న యటనుండి వెళ్ళిపోయెను. ఆ వానలోనే ప్రయాణముఁ గట్టినాఁడు. ఆ దినమెల్లఁ బ్రళయముగ ఫెళఫెళార్భటులతోఁ బెనుగాలి వీచుచునే యున్నది. కడవపోతలుగ వర్షించుచునే యున్నది. కాఱు మేఘము లాకసమునంతయు నాక్రమించెను. దారి కనిపించుటలేదు. ఝంఝా ప్రకంపనములు మహా వృక్షములను గూకటిప్రేళ్ళతోఁ గూల్చివేయుచున్నది. క్షణక్షణమునకును మేఘనిర్ఘోషములును, అశనిపాతములునుగ నున్నది. వెంకన్న కేమియుఁ దోచుటలేదు. మార్గమున నెన్నియో గర్తములలోఁ గూలినాఁడు. పెనుగాలికిఁ దూలిపోయినాఁడు. తడిసి ముద్దయై వడవడ వణకిపోవుచున్నాడు. బట్టలన్నియు బురద మైనవి. ఏ వృక్షముమీదఁ గూలునో ! ఏ యశనిపాతము తనపై నగునో ! విసురుగాలికిఁ దా నేచెట్టును డీకొనునో! కటికచీకటి. ఏమియుఁ గానవచ్చుటలేదు. భయకంపిత గాత్రుఁడైనాఁడు. తన వెనుక మహాసైన్యములు పరువెత్తి వచ్చినట్లు, పిశాచగణము నాట్యముఁ జేయుచున్నట్లు, రణదుందుభులు మొరయుచున్నట్లు రకరకములుగ ధ్వనులఁజేయుచు వర్షము పడుచున్నది. బ్రహ్మాండములు బ్రద్దలైనట్లు, కనులు మిరుమిట్లుగొలుపునట్లు మెఱుపులు మెఱయును. అంతలోఁ దిరిగి యాంధ్యము. వెంకన్నకు భయ మెక్కుడైనది. తనకాలి నేదో చుట్టుకొనినది. విదలించినాఁడు. పడిపోలేదు. చేతితోఁ దీసిపారవైచినాఁడు. మెత్తగ నున్నట్లున్నది. మెఱుపు మెఱిసినది. అది పాము. వెంకన్న దేహము నిలువెల్ల జలదరించినది. పరువెత్త నారంభించినాఁడు. అతని కాళ్లలో సత్తువ సన్నగిల్లినది. తా నేదిక్కునకుఁ బోవుచున్నాడో తెలియుట లేదు. ఒక నదియొడ్డునకు వచ్చినాఁడు. నదిలో నౌక పిడుగు పడినది. నీళ్ళాకసమెత్తు లేచినవి. నదిని దాటు టసాధ్యము. ఎటు పోవలెనో! మెఱపుల కెడతెరపి లేకుండెను. వెంకన్న యొకచోఁ గూలఁబడి పోయినాఁడు. ఆకలి మిక్కుటముగ బాధించుచున్నది. తన దైవము దూరు

కొనినాఁడు. ఎవరో తన్ను సమీపించిన ట్లనిపించినది. తనమీఁదఁ జేయి పడి నట్లయినది. వెంకన్నకు ధైర్య మంతరించినది. దయ్యము కాదుగద! కెవ్వునఁ గేక వైచినాఁడు.

వ్యక్తి : భయపడకుడు.

వెంకన్న కొంచెము తమాయించుకొనినాడు.

వెంకన్న : నీ వెవరవు ?

వ్యక్తి : గొల్లవాఁడను బాబూ! మా యింటికి రండు. మా యిల్లిచటికి చాల దగ్గరలో నున్నది.

వెంకన్న తనకీప్రాపుఁ గలుగఁజేసిన దైవమును స్తుతించినాఁడు. ఇరువురును వానియింటి కేగిరి. గొల్లవాఁ డెండుచిదుకుల మంటవేసినాడు. వెంకన్న చలి గాచుకొనినాడు. గొల్లవాఁ డిచ్చిన యొక గొంగళిని గట్టుకొని బట్టలు పిండి యారవైచుకొనినాడు. అతఁడు కొన్ని మేకపాల నిచ్చెను. వెంకన్న వానిని ద్రావి క్షుద్బాధఁ దీర్చుకొనినాడు.

గొల్లవాఁడు : బాబూ! మీదేయూరు ?

వెంకన్న : తంజావూరు.

గొల్లవాఁడు : తంజావూరా ! బాబుగారూ! విజయరాఘవ నాయనయ్య గారు కులాసాగా నున్నారా ? ఆయన యెంతమంచిరాజులు. ఆయన యొకసారి వేటకు వచ్చినారు. పెద్ద గాలివాన వచ్చినది. ఈ యడవిలో వారి పరివార మంతయుఁ జెల్లాచెదరైనది. ఆయన, ఆయన గుఱ్ఱమునుమాత్రమే మిగిలి పోయిరి. వానలోఁ దడిసి ముద్దయై వణకిపోవుచుండిరి. గుబురుగానున్న యొక చెట్టున్నది. ఆ చెట్టు నాసరా చేసుకొని నేను నుంచున్నాను. రాజుగారిని చూచి నేనా చెట్టుక్రింద నాయనను నిలిపి వానలో నిలబడినాను. ఆ కొంచెపు మర్యాదకు, ఆయన నాకొక యూరు నిచ్చెదమనినారు ! నాకేల ప్రభూ! నావృత్తి నాకు చాలుననినాను. రాజుగారంతతో నూరుకొనలేదు. నా కైదువందలగొఱ్ఱెలను కొనియిచ్చినారు. నేనిపుడు వాని యెరువులను చేలకుఁ గట్టుచు వానివలన యాదాయముతో సుఖముగ బ్రతుకుచున్నాను. బాబుగారూ! రాజుగారితో నేదైన పని కావలయుననిన నెంతెంతవారును నా వద్దకువచ్చెదరు. వారు నా పలుకుబడి నుప

యోగించుకొందురు వోరా! ప్రభువులు నా మాట యనిన నిప్పటికిని మన్నించె దరు. ఆ మాత్రపు టుపకారమున కీలాటి దయఁజూపు ప్రభువులుందురా? మా దొర సాక్షాత్తు దేవుఁడేను. మీరిప్పుడు వెళ్లన దేయూరు?

వెంకన్న మాటాడలేదు. ఆతని గుండెలో నొక సన్నని బాధా తరం. గము లేచి మెలిక తిరిగినది. కాని వెంటనే సమసిపోయినది.

గొల్లవాఁడు: బాబూ! మాటాడరేమి?

వెంకన్న: ఏమిటి? నీవేమన్నావు?

గొల్లవాఁడు నవ్వి యనినాఁడు. "మీరువెళ్ళున దేయూరు?"

వెంకన్న: మధురకు పోవలెను.

గొల్లవాఁడు: మధుర! మధురలో నేమిపనిబాబూ! తిరుమల నాయకుల వారికిని మన ప్రభువులకును సరిపడదుగద; అచట మీ కేమిపని బాబూ!

వెంకన్న "గొల్లవాని కీ విషయములన్నియు నెట్లు తెలిసినవి? వీఁ డెంత ప్రభుభక్తి కలవాడు" అనుకొనినాడు.

తెల్లవారినది. వెంకన్న నది దాటినాడు. సాయంకాలమగువరకు మధుర చేరుకొనినాడు. మీనాక్షీ దేవి యాలయ హేమశిఖరము మబ్బులలో మెఱుపువలె మిలమిల లాడుచున్నది. వెంకన్న దేవ్యాలయమునఁ బ్రవేశించినాడు. అమ్మ వారు మణిమయ సువర్ణాభరణ శోభితమై యానందప్రదముగ నున్నది. అమ్మ వారి దరహసితవదనార విందమునుండి వెలువడు కృపాకటాక్ష వీక్షణము వెంకన్న హృదయమునకుఁ బరిహాసమువలె ననుభూతమైనది. ప్రసాదముఁ దీసికొని యీవలకు వచ్చినాఁడు. తూర్పువైపున మండపమున నతి భయంకరా కారులు, క్రోధరిక్తతామ్రాక్షులుగ వికటాట్టహాసములు చేయుచున్నట్లున్న రెండు ప్రమథుల ప్రతిమ లున్నవి. వానినిఁ జూచి వెంకన్న చలించిపోయినాడు.

మరునాఁ డుదయమునఁ దిరుమలనాయకుని యాస్థానమునకు వెళ్ళినాడు. సభాభవనమునకుఁ బోయెను. ఆ సభాభవనము సర్వభారతదేశ ప్రసిద్ధమైన కట్ట డము. పూర్వము ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునకుఁ గట్టించి యిచ్చిన సభ యిట్టిదే. విజయనగరముననే యిట్టి సభ లేఁదట. ప్రాచీన శిల్పవిద్య యెఱిఁగిన యొక పరమవృద్ధుఁడగు శిల్పి యీ సభా నిర్మాణమును జేసెనఁట. ఆ సభను

కట్టించుటచేతఁ దిరుమలనాయకుఁడు మహా కీర్తిమంతుఁడయ్యెను. చంద్రగిరి సభకూడ నట్టిదిరాదు. వెంకన్న సభాద్వారమునకుఁ జేరినంతనే యచటి దౌవారికులందఱు చిఱునవ్వులతో వెంకన్నను గౌరవించిరి. ఈ వెంకన్న యెంతటి వాఁడో! ఈయనను జంద్రగిరి కోటలో నడ్డగించువారు లేరు. తంజాపూరి కోటలో నడ్డగించువారు లేరు. మధురసభలోనికేగ నడ్డుపెట్టువారు లేరు. సభలోని కేగినంతనే యొక వినీలమేఘమాలాపరివృతగగనభాగమున కేగినట్లుండెను. ఏఁబదిధనుస్సులదైర్ఘ్యము, నలుబదిధనుస్సుల వెడల్పుంగల యా సభా మధ్యభాగమున కిఱుప్రక్కలను పర్వతోచ్ఛ్రయతకల స్తంభములు, బోదిగలు, మదనచేతులు, దంతపుచేరుళ్ళు, పై కప్పు రత్నాలు, వజ్రాలుపొదిగి శరద్రాత్రి యందలి యాకాశమువలె నున్నది. ఎట్టయెదురుగా మహారాజు కొలువుదీర్చి యుండు సింహాసనము. సభయంతయు వజ్రవైఢూర్య మరకత మాణిక్య పుష్యరాగకాంతులచేతఁ గనులు మిఱుమిట్లు గొలుపుచుండెను. నిర్జనమైన వట్టి బయలున నాకాశముక్రింద నిలుచుండిన నెంతభయము కలుగునో యా మహాసభ మధ్యమున నిలుచున్న నంతకుఁబదిరెట్లు భయము కలుగును. అచటనిలుచున్న మనుష్యుఁడు తాను చీమయో, దోమయో యనిపించును.

వెంకన్న సూటిగా రాజున్నచోటికే పోయెను. తిరుమలనాయకునిగాంచి నమస్కారము చేసెను. తిరుమల నాయకునికి వెంకన్న రాక యాశ్చర్యముఁ గలిగించినది. ఆయనను చూడగనే సభఁ జాలించి వేసినాఁడు.

తిరుమల : వెంకన్నగారిట కేమి పనిమీఁద వచ్చినారు ?

వెంకన్న : ప్రభువులు దయాసముద్రులు, ఆ విజయరాఘవనాయకులవారి పద్ధతి యేమియు బాగుండలేదు. తంజావూరునకుఁ ప్రభువులు మీరైనచో నెంత తీవిగ నుండును ?,

తిరుమల : అదికాదు వెంకన్నగారూ ! ఆయన యనిన మాకును చాల క్రోధమున్నది. ఆయన మమ్ములను నమ్మించి ద్రోహమొనర్చినాఁడు. ఎటు లేనిఁ దిరిగి ప్రతీకార మొనర్పవలెనని మా సంకల్పము.

వెంకన్న : ప్రభువులవద్దనుండి మేము వాంఛించున దదియే. విజయ రాఘవనాయకులవా రెల్లవేళలయందును విలాసములలో మునిగి తేలుచు రాజ

కార్యములనే పట్టించుకొనరు. ఆయన పాలనలో ప్రజల కష్టసుఖముల యుతిక గతియు లేకున్నది.

తిరుమల : అన్నియు నిజమే. వాని మేము దండెత్తిరావలెనని శ్రీరంగరాయలు వారికండగ నిచ్చెదరు. వారిని నిర్జించుట కష్టసాధ్యము.

వెంకన్న : ఇదియా మీసందేహము ? మీరిందుల కంగీకరించుచో మిగిలిన కార్యము నేను చేయుదును.

తిరుమల నాయకుని మనమున నాశోదయమైనది. 'వెంకన్న యంతకుఁ దగినవాఁడే' యనుకొనినాఁడు.

తిరుమల : మీ కా కార్య మంతసులభమా ?

వెంకన్న : అవును. తండ్రికిని యువరాజునకును పడుటలేదు. యువరాజైన మన్నారుదాసు నెటులైనఁ జంపించవలయును. చిన్నకుమారుఁడైన చెంగమలదాసునకు నేననిన లక్ష్య మెక్కుడు. వాని కాశలఁ గల్పించి కీలుబొమ్మను జేయుదును. అట్టితరిఁ దాము దండెత్తి వచ్చుచో రాజ్యమునకుఁ జెప్పుకొనఁదగిన వారలే యుండరు. తమ యభిప్రాయమేమి ?

తిరుమలనాయకుఁ డిదియంతయు విని యొక నవ్వు నవ్వినాఁడు. ఆ నవ్వు వికటముగ నున్నది. సభాభవనమంతయు ప్రతిధ్వనించినది. ఆ సభ నిర్మించినది తిరుమలశౌరి. ఈ తిరుమల నాయకుని పూర్వుఁడు. తిరుమలశౌరి నవ్వుతో నా సభ యెన్నడు ప్రతిధ్వనించలేదు. ఆయన మహాశౌర్యనిధి. మహానీతిశాలి. ఆ శౌరిముందు వెంకన్నవంటివారు నిలువలేరు. ఈ తిరుమలనాయకుని నవ్వుతో సభ ప్రతిధ్వనించినది. సభాధిదేవత పరిహసించిన ట్లుండెను. రాజు తనచేతిలో విజయరాఘవనాయకుఁడు కీలుబొమ్మయైనాఁడనుకొనెనుగాని, తాను వెంకన్నచేతిలోఁ గీలుబొమ్మయైనాఁడని తెలిసికొనలేదు.

౧౩

మధురనుంచి తిరిగివచ్చిన మరునాడు వెంకన్న ప్రభువునుదర్శింప నేఁగినాఁడు. ప్రభువు వెంకన్ననుజూచి యాశ్చర్యముఁ జెందినాడు. ఇన్ని నాళ్లెచ్చటికిఁ బోయెనో ! ఎప్పుడు వచ్చెనో !

విజయ : వెంకన్నా ? ఇన్నినాళ్లెచ్చటికిఁ బోయితివి ?

వెంకన్న : ప్రభూ ! మాతల్లిగారికి జబ్బుగనున్నదని వార్త వచ్చినది. ప్రభువులకుఁ జెప్పుటకుఁగూడ వ్యవధిలేకుండుటచే వెళ్ళవలసి వచ్చినది. ఆవిడ కంతప్రమాదముగ నున్నదని తెలియవచ్చినది.

విజయ : అటులనా ? ఇప్పుడు నెమ్మదించినదా ?

వెంకన్న : లేదు. ఆమెచనిపోయినది—శతవృద్ధ. అందుచేతనే యిన్ని దినములు పట్టినది.

విజయ : పాపము మీరిబ్బందిపడినారేమో ?

వెంకన్న : లేదుప్రభూ ! తమదయవలన నట్టిదేమియులేదు.

విజయ : ఏమో ! మీరందరు మమ్మిట్లనుచుందురు. మన్నారునకు మాత్రము మేమనిన లెక్కలేనితనము మితిమీరుచున్నది.

వెంకన్న : అట్లందురేమి ? మన్నారుదాసుగారు మంచివారే ప్రభూ ?

విజయ : మాటాడునది వెంకన్నయేనా ?

వెంకన్న : నాచెప్పువిషయమును సంపూర్ణముగ నాలకింపుడు. యువ రాజులు మంచివారని పెద్దిదాసుగారు చెప్పినారు.

పెద్దిదాసు మన్నారుదాసు లనినంతనే రాజున కాగ్రహము కలిగినది. దానిని గ్రహించిన వెంకన్న యేమియుఁ దెలియనటుల ననినాడు :

"ప్రభూ ! మన్నారుదాసులకు యౌవరాజ్యపట్టాభిషేక మొనర్పరాదా ?"

విజయ : వెంకన్నా ! వాని తల్లిమొగము చూడము. వానిని యువ రాజును చేయము. వారిమాట మావద్ద తేవలదు.

వెంకన్న : ప్రభువు లట్లాగ్రహించిన నెట్లు ? ఎంత కాదనినను మన్నారుదాసులు తమ ప్రథమసంతానము. ఆయన యువరాజులు. ఆమె తమ పట్టంపుదేవి. వారినట్లు తిరస్కరించు టంతబాగుగ నుండదనుకొందును. అదిగాక ప్రజలకు మన్నారుదాసులనిన నపరిమితమగు గౌరవాభిమానములు. తాము వారినిట్లు చులకనఁ జేసినచో ప్రజలకుఁ దమపై భక్తి క్షీణించును. ఆయనను యువరాజును జేయుటయేమంచిది.

విజయ : నీ వెన్నియైనఁ జెప్పుము. వారిప్రసక్తి పలుమారులు మావద్దఁ దేవలదని చెప్పియున్నాము.

వెంకన్న : ప్రభూ! మన్నారుదాసులు మీ రనుకొనునంత దుర్మార్గులు కారు. వారిలో నట్టివైనము నా కగుపించలేదు.

విజయ : వెంకన్నా! మా మాటలను లక్షింపకున్నావు.

ఆయన స్వరము వర్షాసమయఘూర్ణిత నవాంభోదగర్జవలె నున్నది. వెంకన్న యదరిపడినాఁడు. ప్రభువుపైపునకు కనులెత్తిచూచినాఁడు. ప్రభువు మొగము దుర్నిరీక్ష్యముగనున్నది. వెంకన్న సంభాషణక్రమమును మార్చినాఁడు.

వెంకన్న : అదికాదు ప్రభూ! మనపై నిదివరకే మధుర తిరుమల నాయకుని కాగ్రహముగ నున్నది. మన్నారుదాసు లొకవేళ కుట్రయొనర్చి వారితోఁ జేయికలిపిన రాజ్యమున నంతఃకలహమునకు దారిదీయవచ్చును. అది నీతికూడ కాదు. అందుల కనినానుగాని ప్రభువులమాటను వ్యతిరేకింపఁ జాలుదునా?

విజయ : మరలఁ గ్రొత్తగ విచిత్రముగ నారంభించితివి. మన్నారు దాసునం దట్టి లక్షణముల నేమైన గమనించితివా? నీకేమైన నట్టి యనుమానము తోచినదా?

వెంకన్న : నే నింటివద్దనుండి వచ్చుచుండగా నొక మధుర సేనాపతి కనుపించినాఁడు. అతఁడు మాటలసందర్భమున మన్నారుదాసును ప్రశంసించినాఁడు. వాని పొగడ్తను వినినప్పుడు నా కదేమో యట్లనుమానము తోచినది.

విజయ : మన్నారును బొగడినాఁడా? ఆతఁ డెవరు? మధుర సేనాపతియా? ఆతని కిచట నేమిపనియున్నదో! ఇదియంతయు నొక మాయగ నున్నది.

వెంకన్న : ప్రభూ! మాయగాదు. తిరుమలనాయకుఁ డేదో తంత్రముఁ జేయుచున్నట్లున్నది. అందు మన్నారుదాసులకు జోక్యమున్నట్లు తోచుచున్నది. తండ్రిగారిమీఁది పగఁ గొడుకుసాహాయ్యముతోఁ దీర్చుకొనఁదలంచుచున్నాఁ

డేమో! తండ్రి కుమారులమధ్యఁ గలహము కల్పించి తాను వినోదించును కాఁబోలు!

విజయ: నిజమే. తిరుమలనాయకుఁడు కుతంత్రములువన్నుటయం దఖండ ప్రజ్ఞకలవాఁడు. అతఁ డెట్టిపనికైన నొడిఁగట్టఁగలఁడు. మనము మన్నారుదాసు నొకకంటఁ గనిపెట్టుచుండవలయును. ఆయన తిరుమలనాయకుని భేదోపాయముల నెఱియఁజాలఁడు. ఆయనకుఁ గేవలము మాపైఁ గ్రోధమే తెలియును. తిరుమలుని తీయని మాటల కుబ్బిపోఁగలఁడు. వెంకన్నా! నీవు నిజముగ ధీశాలివి. మనము మన్నారుదాసును చెఱపట్టవలసియున్నది. అప్పు డాయన యేమిచేయఁగలఁడు? మఘునాయకుఁ డేమిచేయఁజాలును?

వెంకన్న: తమయోజన బాగుగనేయున్నది. కాని యట్టికార్య మతి జాగ్రత్తగ నొనర్పవలెను. ఏమాత్ర మేమఱిక కలిగినను రాజధానిలో గగ్గోలు పుట్టఁగలదు. ప్రజలనుండి తిరుగుబాటు రావచ్చును. అప్పుడు శత్రువునకు మనల జయించుట సులభమగును.

విజయ: అటులైన రాజధానియం దల్లరికలుగకుండునటుల నీ కార్యమును నీవు సమర్థింపఁజాలుదువా?

వెంకన్న తన వ్యూహము లొక్కటొక్కటిగ ఫలోన్ముఖము లగుచుండుటకు మిగుల నానందించినాఁడు.

వెంకన్న: నేను చేయఁగలనని నాకనిపించుచున్నది. కాని యీ యాస్థానమున నా కెట్టియధికారమును లేదు. నేనీపనిని సాధించుటెట్లు? తమరు నాకు రాయసముపదవి నొసఁగెద మనినారు. అట్టిదేమియు జరుగలేదు. నేనందఱతో రాయసము నైతినని చెప్పుకొనుచున్నాను. నేనేమిచేయుదును? ప్రభువుల యాజ్ఞయేమియో సెలవిచ్చిన నట్లు నడచుకొందును.

విజయ: అయినచో నిన్నీదినమందునే రాయసమును చేయుదుము. నీకు రాయసము పదవియేమి? అంతకుమించిన పదవిని గోరుకొనుము.

వెంకన్న: ప్రభువుల యనుగ్రహమున్న నేమికొఱత! నాకు రాయసము పదవి చాలును. నా కదియేకావలయును.

రాజా సాయంకాలమే సభఁజేసి వెంకన్నకు రాయసముపదవి నొసంగి సత్కరించినాఁడు. రాయసముపదవి ప్రాప్తించినినాటినుండియు వెంకన్న కుతంత్రములు హెచ్చుపెరిగిపోవుచున్నవి. కొన్ని దొంగలేఖల సృష్టించినాఁడు. వానిలో నొకలేఖ మధురలోనున్న సరదారొకఁడు మన్నారునకు వ్రాసినటులను. దానినొక మధుర సైనికుఁడు తీసుకొనివచ్చినటులను దా నా లేఖ నా సైనికుని నుండి బలాత్కారముగ గ్రహించినటులను గల్పించి విజయరాఘవనాయకులకు దానిని జూపించి యనినాఁడు: "ప్రభూ! దీనినిఁ జిత్తగింపుడు."

విజయ: ఏమది? ఆ కమ్మయేమి?

వెంకన్న: ప్రభూ! తాము స్వయముగఁ జూడవచ్చునుగదా?

విజయ: నీవే చదువుము.

వెంకన్న: ప్రభువులయాజ్ఞ.

వెంకన్న చదువ మొదలిడెను—తంజాపురాధీశులు మహారాజరాజశ్రీ మన్నారుదాసనాయకులసముఖమునకు మధుర తిరుమలనాయకులవారు వ్రాయించు లేఖార్థములు. మీరు లోగడ మాకుఁ దెలియఁజేసినటుల నడచుచున్నందులకు మిక్కిలిసంతసించితిమి. మీరు మీతండ్రిగారైన విజయరాఘవనాయకులతోఁ గలహముఁబెంచుడు. ప్రజలను మీపక్షమునకుఁద్రిప్పికొనఁజూడుఁడు. దోషమంతయు రాజుదేనని ప్రజలు భావించునట్లు చేయవలయును. అదను గుర్తించి మీరు వార్తనంపినంతనే మేమువచ్చి మీకు బాసటయై నిలువఁగలము. తొందరపడి యెట్టికార్యముఁ జేయఁదగదు. మీరు సాకల్యముగ నాలోచించి మనము తల పెట్టుకొనిన కార్యము సానుకూలమగునట్లు చూడవలసియున్నది.

ఇట్లు

మీ శ్రేయోభిలాషి

మిత్రుఁడు, తిరుమలనాయకుఁడు.

రాజున కీ లేఖ వినినంతనే మన్నారుదాసును హత్యచేయుదమన్నంత కోపము పెల్లుబికినది. రాజు వెంటనే లేఖనందుకొని చూచినాఁడు. మధుర రాజముద్ర యున్నది. రా జుత్తరమును జేతిలో నలిపివేసినాఁడు. కనులు కోపోద్రిక్తమైన పులికన్నులవలె మండుచుండెను. "వీఁ డింతకు సాహసించెనా?

మన ప్రతిస్పర్ధులతో మంతనములు సల్పునా ? వారికిని వీనికిని నుత్తరప్రత్యుత్తరములా ! ప్రజానీకమును దనపక్షమునకుఁ ద్రిప్పుకొనవలయునఁట. ఔరా ! మధురనాయకుని కింకను మా రాజ్యముమీఁది దురాకాంక్ష పోలేదుకాబోలు ! వీని ప్రతాపమేమియో యదియుఁ దేటపడఁగలదు. మందీ మన్నారు విషయమేమి ? వీనికింత యలుసునిచ్చినది రాణి. వీ రిరువురి నేమిచేసినను బాపము లేదు. తిరుమలనాయకునిఁ గూడగట్టుకొని మాపై దండెత్తివచ్చునట్లుచేయునా ? మన్నారిక మా తనయుఁడుకాఁడు. పుత్రరూప శత్రువు. వీని నిక నుపేక్షసేయ రాదు. అలక్ష్యమొనర్చినఁ బ్రక్కలోని పామై కూర్చుండఁ గలఁడు. లాభము లేదు. మన్నారింతకు వచ్చునని నేనెన్న డనుకొనలేదు."

వెంకన్న : ప్రభూ ! ఏమాలోచించుచున్నారు.

విజయ : వెంకన్నా ! నీవేమందువు ?

వెంకన్న : ప్రభూ ! తమయూహ నేనెఱుఁగనిది. కుమారుఁడేయైనను రాజద్రోహముఁ దలపెట్టినవాని ననుగ్రహించిన రాజ్యమునకే ముప్పు వాటిల్లఁ గలదు.

విజయ : నీవు చెప్పినది యథార్థము. మన్నారును జెరపట్టుటకు మా యాజ్ఞ నొసఁగుచున్నాము. ఈపని నీకు సాధ్యమంటివి గదా !

వెంకన్న : చిత్తము. ప్రభుపులయానతి యనతిక్రమణీయమైనవి.

వెంకన్న వెడలిపోయినాఁడు. రాజుహృదయమున నేదో తెలియరాని బాధ కలకపైచినది. "మన్నారు సన్యాయము చేయుచున్నానా?" ఇదియొక విచిత్ర భావన తోచినది. "వాని యాలేఖమేమి ? అవును. మన్నారు శిక్షార్హుఁడే. కాఁడేమో ! అవును. ఏదియేమైన నాజ్ఞయీఁబడినది. తిరిగి యన్యథాకరింప వచ్చునుగదా ! అటులఁ జేయ వీలులేదు. అమలు జరుగవలసినదే." ఆయనలో రకరకములుగ భావములుద్భవించి కాలమేఘ శకలములు సమీకృతములైనట్లున్నవి.

వెంకన్న నిశాసమయమున ప్రభువును రాజమందిరమునఁ గలిసికొన వలసినదిగ రాజాజ్ఞయని కమ్మను వ్రాసి రాజముద్రవైచి మన్నారున కందఁ జేసెను. మన్నారుదాసు తన తండ్రి కమ్మను చూచుకొని 'యటులే కాని'

మ్మనుకొనినాడు. అర్ధరాత్రమువేళ నేల రమ్మనెనో! ఒంటరిగనా? ఎందులకో! ఏమైన నేమి, నాతండ్రి వర్తమాన మంపుటయు నేను వెళ్ళకుండుటయునా? వెళ్లియే తీరెదను." అనుకొనినాడు.

ఆయన యొక పెట్టెబండి యెక్కినాడు. బండి తోలువానికి వెంకన్న యాశపెట్టియుండెను. వాఁడు బండి నా కటిక చీకటిలో సందుగొందులనుండి తీసికొనిపోవుచుండెను. మన్నారుదాసు తనతండ్రితో నేమి మాటాడవలయునో యోజించుకొనుచుండెను. బండి పోయిపోయి యొకచో నాగినది. అది యొక తోట. ఆతోట పురమునకు చాలదూరమున నున్నది. తోటయందొక పురాతన శిలాభవనమున్నది. అది రహస్య ప్రదేశము. ఆ భవనముచుట్టును రక్షక భటు లెల్లవేళలందును గావలి యుందురు. లోనుండి బైటి కెవ్వరును రాఁజాలరు. బండి యా భవనము ముందర నాగినది. బండి యెద్దుమెడయందలి మువ్వలరవళి విని యచటనేయున్న వెంకన్న రాజఖడ్గముఁదీసికొని వచ్చినాడు. మన్నారు బండి దిగినాడు. ఆ భవనమును గుర్తుపట్టి మన్నారు నివ్వెరపోయినాడు. గొంతు పెగల్చుకొని యనినాడు "ఇదియేమి! నన్నిచటికిఁ గొనివచ్చితివేమి?" వెంకన్న రాజఖడ్గమునానవాలుగఁ జూపి 'మిమ్ముల నిచ్చట నుంచుటకు రాజాజ్ఞ' యనినాడు.

మన్నారుదాసున కేమియుఁ బాలుపోవుటలేదు. వెంకన్న నొకసారి తీవ్రముగఁ జూచినాడు. వెంకన్న కన్నులలో విషము చిందుచున్నది. ఆయన తిరస్కారపూర్వకమైన హాస మొనర్చినాడు. మన్నారు తలవంచుకొనినాడు.

మన్నారు: మమ్ము ప్రభువుగా రిట్లు బంధించుమని యేల యాజ్ఞనిడినారు? నాయం దెట్టి దోషమును నిరూపించినారు?

వెంకన్న: ఏమో, యవియన్నియు నాకేమితెలియును? మిమ్ములఁ గైదుచేయు మని మాకు రాజాజ్ఞయైనది. ఈ ఖడ్గము నానవాలుగ రాజుగారు మాకు స్వయముగ నిచ్చినారు. సమయము మించుచున్నది. యువరాజులు లోనికి దయచేయుడు.

మన్నారున కేమిచేయవలయునో తోచలేదు. తనవద్ద ఖడ్గమైనను లేదు. తండ్రిగారి దర్శనమున కేగుచుంటినని కరవాలము విడిచి వచ్చినాడు. బొడ్డులో

జురకత్తిమాత్ర మున్నది. ఒక్కవడి లంఘించి యా క్షుద్రబ్రాహ్మణుని గుండెలోఁ బొడువవలె ననిపించినది. కాని తండ్రిఖడ్గ మున్నది. ఇది రాజాజ్ఞ. తండ్రి దైవము. కానిమ్మని యూరకుండెను.

అచటనున్న కావలివాండ్రు యువరాజునుజూచి శిరములువంచి నమస్కరించిరి. వెంకన్న సంతసముతో వెడలిపోయినాడు. ఆ భవనమున బంధింపఁబడినవారినిఁ బ్రభువులు స్వయముగ వచ్చి విడిపించినగాని విడుదల లేదని మన్నారునకుఁదెలియును. ఒంటరిగ నాచీఁకటి కోణములో బంధింపఁబడుటకుఁ దానొనర్చిన యపరాధ మేమియో మన్నారునకు బోధపడలేదు. తనకుఁ దెలిసినంతవఱకుఁ దాను ప్రభువునెడల నెట్టి యపచారమొనర్చినది లేదు. తన తల్లినట్లు చేసెనన్న కోపముచేఁ గొన్ని మాటలనెను, అంతే. తనకుఁ దన తండ్రిమీఁద గౌరవమేమి తక్కువ. ఆయనకనేకములైన యూహలు పొడమినవి. "తండ్రిగారు నన్నేల బంధించిరో! ఈ వెంకన్న యసాధ్యునివలె నున్నాడు. పెద్దిదాసుగారు తెల్పినపు డింతయగునని నే ననుకొనలేదు. ఎంతచేటు వచ్చినది! ఆయనను నే నెన్నడును తండ్రినేమియు ననరానిమాటలైన ననియుండలేదే! ఆయన మాయమ్మను సరిగఁ జూచుటలేదంటిని. అది నిజముకాదా! అంత మాత్రమునకు ప్రభువిట్లు చేయడు. వెంకన్న యేమేమి యారోపించి చెప్పెనో? ప్రతివానిని మంచి యనుకొనుట నాదే దోసము. ప్రభువునకింత యాగ్రహము కలుగు మాటలేమి చెప్పెనో? నా కీజన్మలో ముక్తియుండదా? అయ్యో! మాయమ్మ నాకొఱకెంత దుఃఖించునో! ఆవిడ యసలే కుందుచున్నది. 'గోరుచుట్టుపై రోకఁటి పో' టన్నట్లీఁక నిదికూడ సంప్రాప్తమైనది. తిరిగిఁ నే నామెను చూడఁజాలనా?"

తల్లిమాట జ్ఞప్తికి వచ్చినపుడతనికి దుఃఖము పొంగివచ్చినది.

"మాయమ్మ యెంత దిగులుఁజెందునో? నాయంత నిర్భాగ్యులులేరు. నేను జననిని సుఖపెట్టలేకపోవుటటులుండ దుఃఖకారణముకూడ నైతినే? నాపై మోపఁబడిన నిందయైనఁ జెప్పినాడుకాదేమి? అది యెట్టిదో యేమో? ఏదైన పెద్దనేరమై యుండవలెను. కానిచో నన్నీభవనమునఁ బ్రవాసితునిగఁ జేయరు."

తాను మహారాజుకుమారుడు. యువరాజు. తనకిట్టి స్థితియా? అతని శరీరమంతయుఁ గంపించిపోయినది. తన భవిష్యత్తంతయుఁ గరళరూపము ధరించి మ్రోల నిల్చినట్లున్నది. ఆ చీకటి గదిలో నెత్తుగనున్న కిటికీలగుండ గాలి దూసికొని వచ్చి పెనుభూతములు వికావిక నగినట్లు, పండ్లు పటపట లాడించునటుల, రకరకములుగ ధ్వని చేయుచున్నది. మన్నారుదాసుని కెటు చూచినను వెంకన్న వికృత వేషమునఁ బండ్లు వెలికిఁ బెట్టి తన్నుఁ బరిహ సించుచున్నటులున్నది. ఆలోచనలతో, దుఃఖముతో, అవమానముతో కుమిలి కుమిలి సొమ్మసిలిపోయి యట్లే యుండెను.

౧౪

నెలదినములు గడచినవి. రాజగోపాలాంబిక కేమో దిగులు దిగులుగ నున్నది. మన్నారుదాసు తనవద్దకువచ్చి చాలకాలమైనది. ఇంతకాల మెప్పుడును తన్ను జూడకుండ నుండలేదు. కొన్నిదినములనుండి యన్నియు దుర్నిమిత్త ములే యగుపించుచున్నవి. మన్నారునకుఁ దా ననిన నమితమగు భక్తి. తన్ను జూడనిదే యతనికి శాంతియుండదు. తన్నుఁగూర్చి తండ్రితో నేమైన ననినా డేమో! ఆమెకడుపునఁ జిచ్చు రగులుకొనుచున్నట్లున్నది. మన్నారుకేమైన నాపద రాలేదుకద! ఆతని కెట్టి యాపద యొదవినను దన బ్రతుకు నిరర్థకము. మన్నారే యామె కాశాజ్యోతి. మనోరథపూర్ణస్వరూపము. ఆమెకుఁ గుడిక న్నదురుచున్నది. ఆమె యాశాజ్యోతి యారిపోవునా? ఆమె మనోరథములు వికలములగునా? ఇట్టి భావనలతో నామె పలువిధముల వేదనపడుచుండెను. "ఈ నా డిట్టి విపరీతభావములు కలుగుచున్నవేమి? నా ముద్దుల మన్నారున కెట్టి యాపదయు రాదు. యువరాజు, వాని నెవరేమి చేయఁజాలుదురు? అయ్యో! నాకు ధైర్యము చాలుటలేదు. మన్నారును తిరిగి యెన్నటికేనిఁ జూడఁ జాలుదునా? నెలదినములైనది. బిడ్డ రాలేదు. ఎచటికి పోయినట్లునుఁ దెలియదు!" ఆమె పలువిధములఁ దలపోసినది. ఏ దెసఁ జూచినను మన్నా రామెకు దీనవదనముతోఁ గన్నుల నీరు చెక్కిళ్ళఁ జారికలుగట్టఁ దనవంకఁ జూచుచున్నటులఁ దోచుచున్నది. ఆ చూపు లామెకు వాడియైన ములుకులవలె నున్నవి. ఆమె దుఃఖోద్వేగము పట్టరానిదిగ నున్నది. ఆమె కన్నులనుండి

యశ్రువు లవిరళముగఁ గురియుచున్నవి. ఆమె కేమియుఁ దోచకున్నది. బయట నెండతీవ్రత కఠోరముగ నున్నది. రాణికి హృదయమంతయు నుడుకెత్తుచున్నది. కపర్దిని వచ్చినది.

కపర్దిని : మహారాణీ !

ఆమెకంఠము వణికిపోవుచున్నది. ఆమెకను లెఱ్ఱవారినవి. రాణి యామెనుజూచి నివ్వెరపోయినది. కపర్దిని దుఃఖించుచున్నది. కపర్దిని ధైర్య సాహసములయందు రాణి కత్యంత విశ్వాసము. ఆమె నట్టిస్థితిలో చూచుటలో రాణికిఁ జెప్పనలవికాని వింతవింత భావము లుద్భవించినవి. ఆమె మనమున నేదో యాశంక యజ్ఞాతముగ వేధించుచున్నది.

రాణి : కపర్దినీ ! ఇదియేమి ? నీ వింత దుఃఖించుచుంటివేల ? కారణముఁ జెప్పవైతివి. నిన్నింత కలవరపెట్టునంతపని యేమి జరిగినది ?

కపర్దినికి దుఃఖ మింకను నతిశయమైనది. రాణికి కపర్దిని నట్లు చూచుట దుర్భరముగ నున్నది.

రాణి : విషయ మేమియో చెప్పక విసిగించుచున్నావు.

కపర్దిని రాణిమోమువంకఁ జూచినది. ఆమెను జూడగనే కుప్పున కూలి పోయినది. రాణికి మనసు మనసులోలేదు. కపర్దినిని బ్రతిమాలినది. ఆమె వెక్కివెక్కి యేడ్చుచు ననినది. "మహారాణీ ! యువరాజులైన మన్నారుదాసు గారిని ప్రభువులు చెఱలోఁ బెట్టినారట !"

ఈ మాట రాణిహృదయమున శూలముపెట్టి పొడిచినట్లయినది. రాణికి నోట మాటరాలేదు. సెజ్జపై వ్రాలిపోయినది. కపర్దిని సేదదీర్చినది. రాణి హృదయము కల్లోలితమైనది.

రాణి : అకారణముగ బంధించిరా ? ఆ దుర్నిమిత్తముల కిది ఫలము కాబోలు ! కపర్దినీ ! నిన్నుఁ జూడగనే యేదో ఘోరము జరిగియుండె నను కొంటిని. నా మన్నారు చెఱయందుంచఁబడెనా ? పసివాడు, వాని కేమియుఁ దెలియదు. తండ్రితో నేమనినాఁడో ! ప్రభువు కోపిష్ఠి. యువరాజున కిట్టి యాపదయా ! నా స్థితి తుద కెట్లు పరిణమించినది ! నా చిట్టితండ్రి కెట్టిపాటు వచ్చినది !

ఆమెకుఁ బిచ్చియెత్తినట్లయినది. ప్రభువనిన నామెకుఁ గోపము కుత్తుక బంటిగ నున్నది. ఆమె ఈ వార్తవలని యాపేదన మామె హృదయమును దహించుచున్నది. మనసుండబట్టక యామె కపర్దిని నడిగినది.

రాణి : కపర్దినీ! ఈ విషయము నీకెట్లు తెలిసినది ?

కపర్దిని : మహారాణీ! నేను రాత్రి ప్రొద్దుపోయి మీ వద్దకు రావలెనని బయలుదేరితిని. లక్ష్మీవిలాస సదనమువఱకు వచ్చుసరి కేదో సంభాషణ వినిపించినది. నే నచటఁ గొంతతడవు నిలిచి యాలకించితిని. వ్యక్తు లిరువురు మాటాడుకొనుచుండిరి. ఒక గొంతు నెలుఁగు నేర్పరించుకొనఁజాలితిని. అది ప్రభువుల కంఠధ్వని. రెండవదెవరిదో పోల్చుకొనఁజాలనైతిని. వారు ప్రసంగమున నీ విషయముఁ గూర్చి చర్చించుకొనుచుండిరి. అందుచే నాకీ రహస్యము తెలిసినది.

రాణి : నీవు సత్వరమునేగి వెల్లి సోమయాజులుగారిని పిలుచుకొని రమ్మ.

కపర్దిని వెడలిపోయినది. రాణి మనస్తాపమున కదలిలేకుండ నున్నది. "ఆ రెండవవ్యక్తి యెవ్వరైయుండును ? మన్నా రెవరికి నపకారిగాఁడు. పాడు దైవము మమ్ముల నిట్లు చెట్టలఁబెట్టుచున్నాడు. ప్రభువు నన్నైనఁ బందీగఁ జేయవచ్చునే! మన్నారునందెట్టి దోషమున్నది ? నే నన్నివిధముల హత భాగ్యను. భర్త యనుగ్రహ మిటులున్నది. పుత్రుని కష్టగతి యటులున్నది కష్టములు ముందుపుట్టిగాని ప్రాణి జన్మింపదుకాఁబోలు! విధి నా ముఖమున విషాదరేఖలనే గీసినాడుకావలయును. లేకున్న నా స్థితియేమి ? నేటి నా గతి యేమి ? ఔను. కష్టసుఖములు కేవలము ధనసంపదల నాశ్రయించియుండవు. పూర్వజన్మకృతములఁబట్టి వచ్చుచుండును. నా పూర్వపుణ్య మిటులున్నది కాబోలు! నా నోముఫల మిటులుండ విధిని నిందించి లాభమేమి ? సోమ యాజులుగా రేమందురో ! ఆయనమాత్ర మేమనును ? తీయనిమాటలు చెప్పును. క్రియ శూన్యము. ఏది యెటులున్నను ప్రభువు నన్నింత బాధించుట తగదు."

ఆమె కీ యోజనలతోఁ దలదిమ్మెక్కినది. నేలపైఁ గూలిపోయినది. శిలాహతపద్మమువలె నున్నది. జాముపఱకట్లే పడియుండెను. సాయంకాల

మైనది. సోమయాజులు వచ్చినాఁడు. కపర్దినియు వచ్చినది. రాణి లేవలేదు. కపర్దిని రాణికిఁ దెలివివచ్చుటకుఁదగు యత్నము లొనర్చినది. పన్నీరు మొగమునఁ జిలికినది. వట్టివేళ్ళ వీపనతో విసరినది. బహువిధ శీతలోపచార ములఁ జేసినది. రాణి కొంచెము తేరుకొనినది. ఆమెమొగము బాష్పకలుషితమై గండరించియున్నది. కేశములు శీర్ణములై, చెల్లాచెదరుగ ముఖమండలమును గప్పినట్లున్నవి. కనులెఱ్ఱబారినవి. రాణిస్థితికి సోమయాజులు భయముఁ జెందినాడు. 'ఆమె కంత దుఃఖము కల్గుటకు హేతువేమో! పాప మామెశోక మెట్లు చల్లారునో?' కపర్దిని రాణి కుపచారమొనర్చి సంపూర్ణముగ సేదఁ దీర్చినది. సోమయాజులరాకఁ దెలియజేసినది కపర్దిని.

రాణి: సోమయాజులుగారు వచ్చినారా! పద. ఎక్కడ నున్నారు? వారికాసనము నుంచితివా?

సోమ: మహారాణుల కాశీస్సులు.

రాణి: నాజీవితము దినదినము విచిత్రముగ మారుచున్నది. నిజముగ నాయంత యభాగ్యజీవి యుండదు.

సోమ: మహారాణీ! నేడు మీరంతబేలవలె మాటాడుచున్నారు!

రాణి: మీకుఁ దెలియదా? మన్నారును ప్రభువులు చెఱసాలలో బంధించిరి. నాజీవితమున కింతకంటెఁ గష్టతరమగు విషయ మేమున్నది? నేనేల బ్రదుకవలయునో తెలియుటలేదు. పాడుప్రాణములు బొందిని వీడిపోకున్నవి.

సోమ: మన మన్నారుదాసునా? యువరాజును ప్రభువు బందీనిచేసెనా? కారణమేమి? యువరా జెట్టిదోషియుఁ గాఁడే!

రాణి: ప్రభువులు తలచుకొనినఁ గారణములు కావలయునా? ఇదివరకే జరిగిన యవమానము చాలక నాకిది యొక క్రొత్త యవమానము.

సోమ: అమ్మా! మీరు ప్రభువుల నొకపర్యాయము కలిసికొని మాటాడిన మంచిదనిపించుచున్నది.

రాణి: అవును. నేను ప్రభువులఁ గలిసికొని మాటాడి తీరుదును. నాహృదయము దహించుకొని పోవుచున్నది. పడినకష్టములు చాలును.

పాపము! మన్నారేమి యపచార మొనర్చినాఁడు? ప్రభువుల కిట్టికృత్యము తగనిది. ఇంతకుమించినయవమానమిఁక నాకేమియుండును? ప్రభువులపై నేను పగఁబట్టినాను. తప కీ పని యర్హమైనది కాదని ప్రభువులతో గట్టిగ వాదింతును.

ఆమె యాహతసింహివలె గర్జించినది. ఆమెలో శాంతి కించుక తావులేదు. ఆమె ముఖమునుండి వెలువడు ప్రతియొక్క మాటయు వజ్రపాతమువలె నున్నది. ఆమె యావేగము పట్టరాని దయ్యెను. ఆమెకు మన్నారు లోకము. ఆమె క్రోధోన్మత్తచండీమూర్తివలెనున్నది. ఈలోకపుఁ దెలివియే యామెలో నశించినది. తా నేమి మాటలాడుచున్నదో తనకే తెలియుటలేదు. తన పగఁ దీర్చుకొను నుపాయము నడిగినది సోమయాజులను. సోమయాజులకు రాణిస్థితి దుఃఖదాయకముగ నున్నది. అనుకొనినాఁడు: "ఈమె తొందరపడుచున్నది. పుత్రప్రేమ యీమె నిట్లొనర్చినది. ఈమెను సమాధాన పరచవలయును. సామాన్యముగ హృదయమును వెలువరించు ప్రకృతికాదు. ఈమె కీ దుఃఖము పీమల నతిక్రమించినది." తానామెకెట్లేని సాహాయ్య మొనర్పవలయును.

సోమ: చింతింపకుము మహారాణీ! గ్రీష్మకాలపు తీక్ష్ణపు టెండగాడ్పులకు నెఱియలుగొట్టి బీటలువారిన యుర్వర వర్షాసేచనమునఁ జలప్రపూర్ణమైనంత సస్యశ్యామలకోమల యగుటలేదా? కష్టములనిశముఁ దలపు పెట్టుకొని కూర్చుండవు. పడినవారెన్నటికినిఁ జెడెడువారుగారు. రత్నమైనను సానఁ బట్టక ప్రకాశింపదు. మన్నారుదేవుఁడు మిమ్ములఁ బరీక్షించుచున్నాడు. మీ రోర్పుతో సహించుకొనుడు. మీరు మహాపతివ్రతలు. ప్రభువులు మీగొప్పఁదనముఁ దెలిసికొను దినములు దగ్గరపడుచున్నవి. మన్నారున కెట్టి భయమును లేదు. మీరు తొందరపడకుడు.

రాణి: ఏమో మీరటులనే చెప్పుదురు.

సోమ: అదికాదు తల్లీ! కష్టములోర్చుకొనుటలోనే యున్నది. పూర్వ మెందఱుపతివ్రతల కెట్టికష్టములు సంప్రాప్తించలేదు. సుమతీదేవి కష్టముల కన్న తమకష్టము లెక్కువవా? అదిగాక మన యత్నములు ఫలించు దినములు సమీపించుచున్నవి.

రాణి: ఎట్లు?

సోమ: చంద్రరేఖ మన కనుకూలముగ నున్నది. ఆమెసాహాయ్యమున మనము రంగాజమ్మను సాధింపవచ్చును.

రాణికి సోమయాజులమాట లద్భుతముగఁ దోఁచినవి. "క్రొత్తగవచ్చినది చంద్రరేఖ. ప్రాతయావిడ రంగాజమ్మ. ప్రభువులకుఁ జంద్రరేఖ యనినఁ గ్రొత్తమోజు. ఆమెవలనఁ గార్యము సాధించుటయేమి? ఇది యేమియూహ?" యనుకొనినది.

రాణి: మహాత్మా! మీమాటలు 'ముల్లుపుచ్చి కొఱ్ఱువచిన చంద' ముగ నున్నవి.

సోమ: కాదు తల్లీ! రంగరాజమ్మయేకొఱ్ఱు. చంద్రరేఖ ముల్లుకూడ కాదు. నేను పరీక్షించిచూచితిని. అట్టిదేమియు నగుపడుటలేదు. ప్రభువుల హృదయమున స్థిరమైన స్థావర మేర్పఱచుకొని పాతుకొని పోయినది రంగాజమ్మ. చంద్రరేఖ తాత్కాలికపు మెఱుపు. రంగాజమ్మ యటులుకాదు. రంగాజమ్మను సాధించిన రాజు నిలువఁజాలఁడు ఆయన కదియేప్రతీకారము. ఇందు మీ యభిప్రాయమేమి?

రాణి: చేయఁజాలినచో మంచిదియే.

సోమ: మహారాణీ! డెబ్బది యేండ్లుగ వేదపురుషు నారాధించిన నాముఖమునఁ జెప్పుచున్నాను. మీకు సత్వరమైన శుభము చేకూరఁగలదు. నేను రంగాజమ్మను రాజునుండి విడఁదీయగలను. నేనే యాపనికై బద్ధ కంకణుఁడ నయ్యెదను. మీరు చింతవీడి యుండుడు.

రాణి: మీరట్లనుచుండ నే నేమనఁగలను? కార్యము సాధించఁగల్గిచో నంతకుమించి కావలయున దేమున్నది?

సోమ: అయిన నేనుపోయి వచ్చెదను. మీరు తొందరపడకుడు. ఇంత వర కోపికఁబట్టినవా రింకఁ గొంతకాలము సహించుకొనుడు. కానిచో నంతఃపుర మునఁ బలురకముల యలజడులు జరుగఁగలవు. ప్రభువులవఱకుఁ బ్రాకినఁ బ్రమాదము సంభవించవచ్చును.

సోమయాజులు సరాసరి చంద్రరేఖ యింటికి వెళ్ళినాడు. చంద్రరేఖ యాయనను మిక్కిలి గౌరవించినది.

సోమ : రంగాజమ్మ పుట్టుపూర్వోత్తరము లేమైనఁ దెలిసిన బాగుండు ననిపించుచున్నది.

చంద్రరేఖ : రాజీమె నెటనుండి తీసికొని వచ్చెనో మనకుఁ దెలియ రాదు. ఈమెలోఁ జూచిన కొలఁదియుఁ బ్రభువుల పోలిక కనిపించుచున్నది. మాటాడు వైఖరియుఁ ఠీవియు, బ్రభువులనే యనుకరించుచున్నట్లుండును. ముఖ కవళికలుఁగూడ నవియే.

సోమ : ఏమనుచున్నావు ? ప్రభువుల పోలికయా ? చాల చిత్రముగ నున్నది ! ప్రభువులేమి ! రంగాజమ్మ యేమి ? ప్రభువుల కవళికలు రంగాజమ్మ యందెట్లు కానుపించును !

చంద్రరేఖ : ఏమో నా కట్లనిపించినది. అదియుఁగాక నామెలో మా మంగమాంబ పోలికకూడ లేకపోలేదు.

సోమ : మీ మంగమాంబ యెవరు ?

చంద్రరేఖ : పెనుగొండలో వీరవెంకటభూపతి రాజ్యముచేయునప్పుడు నే నచట నుండెడిదానను. అప్పటిలో మాకు మూరపుబంధు గొరావిడ యుండెడిది. ఆమె మహాసౌందర్యవతి. ఆమె పేరే మంగమాంబ. ఆమె కొక కొమరిత యుండెను. ఆమెయు నేనును నొకయీడువారము. పదిసంవత్సరము లకే యామె వీణావాద్యమునను, నేను భరతమునందును బ్రవీణులమైతిమి. ఇట్లుండగ మంగమాంబ స్వర్గస్థురాలయ్యెను. ఆ పిల్లపేరును రంగాజమ్మయే. సమీపగ్రామముననున్న తన ముత్తవల గృహమున కేగినది. రాజుగారు దివంగతులైన పిమ్మట శ్రీరంగరాయలవారు తమ రాజధానిని చంద్రగిరికి మార్చినారు. అందుచే నేను చంద్రగిరికి వచ్చివేయుట జరిగినది. తరువాత నా రంగాజమ్మ యేమైనదియు నాకుఁ దెలియదు. ఆ రంగాజమ్మయే మన రంగాజమ్మ కాదుగదా యనిపించును ! ఎంత యోజించినను రంగాజమ్మ రఘునాథనాయకులవారి యపత్యమగునేమో యనియే నా యనుమానము.

సోమ : బాగున్నది. నేను పెనుగొండపోయి యచ్చట నేమైన యాచూకి తెలియునేమో చూచివచ్చెదను.

చంద్రరేఖ నమస్కరించినది. సోమయాజు లామె నాశీర్వదించి తన గృహమునకుఁ బయలుదేరినాఁడు. దారిలో రాయసము వెంకన్న కనిపించి నాఁడు. ఆయన సోమయాజులను జూచినాఁడు. వెంకన్న కాయననుగూర్చి తెలిసికొనవలెననిపించినది. ఆయన యేదియో ముఖ్యమగు విషయమునుగూర్చి యాలోచించుచున్నట్లు పసిపట్టినాఁడు.

వెంకన్న : మీ పేరేమి ? శాస్త్రిగారూ.

సోమ : ఎల్లు సోమయాజు లందురు.

సోమయాజులు ముభావముగ పోఁబోయినాఁడు. వెంకన్న యాయన నాపి యనినాఁడు. "అంత త్వరపడెదరేల ? సాటి బ్రాహ్మణుఁడను, నాతో కొంచెము ముచ్చటించినఁ దప్పుకాదుగదా !"

సోమ : తప్పేమున్నది ; నా మనస్సు మనస్సులోలేదు.

వెంకన్న : అదే మట్లనుచున్నారు ? ఈ ఆందోళనకు హేతువేమి ?

సోమ : ఏమున్నది ? సాటివాఁడవుగనుక చెప్పుచున్నాను నాయనా ! గోడలకుఁ జెవులున్నవందురు. మన ప్రభువులు మహారాణిగారికిని, యువరాజు మన్నారుదాసునకును నన్యాయముఁ జేయుచున్నారు. కొడుకును చెఱసాలయం దుంచినందులకు మహారాణి దుఃఖించుచున్నారు. ప్రభువులు విలాసవతులతోఁ బ్రొద్దులుపుచ్చుచుఁ బట్టపుఁదేవి నిట్లవమానించు టన్యాయముగ నున్నది.

మాటాడినంతసేపును సోమయాజుల కావేశము పట్టరానిదిగ నుండెను. ఆయన మాటలతీరే విచిత్రముగఁ దోచినది వెంకన్నకు. వెంకన్న యోజింప నారంభించెను. "ఈయన యెవరు ? రాణి, మన్నారులను సమర్థించుచుఁ బ్రభువును తూలనాఁడుచున్నాఁడు."

వెంకన్న : మీరు రాణిగారి కేమైన....?

సోమ : అవును. నేను మహారాణి తండ్రిగారి యాస్థాన పురోహిత వంశమునకుఁ జెందినవాఁడను. మహారాణి కాపురమునకు వచ్చునప్పుడు నే నరణపుఁ బండితునిగ నిటకు వచ్చితిని.

వెంకన్న : అటులనా ? మఱి ప్రభువుల ప్రవర్తనఁగూర్చి మహారాణి యభిప్రాయమేమి ?

సోమ : మహారాణి యేమిచేయఁగలరు. ఆమెకు మంత్రాంగము సల్పుటకు రాయసము వెంకన్నలు గలరా ?

వెంకన్న మొగమున నానందరేఖలు తొంగిచూచినవి.

వెంకన్న : మహారాణిగారికి నా సాహాయ్యము కావలయునా ? అంతకన్న నేను కోఁదగిన దేమున్నది ?

సోమ : నే నిప్పుడు రంగాజమ్మ పుట్టుపూర్వోత్తరములను దెలిసికొనుటకై పెనుగొండకుఁ బోవుచున్నాను.

వెంకన్న తలపంకించి క్షణకాల మాలోచించినాఁడు.

సోమ : ఏమి యాలోచించుచున్నారు ?

వెంకన్న నవ్వి యనినాఁడు "ఏమియు లేదు."

ఎవరిదారిని వారు వెళ్ళిరి.

ఆ మరునాఁడే సోమయాజులు పెనుగొండకు బయలుదేరి వెళ్ళినాఁడు. అచ్చట సానివాడకుఁబోయి మంగమాంబనుగూర్చి భోగట్టాచేయగా నామె చనిపోయి చాలకాలమైనదనియు, వారి బంధుగులు చంద్రగిరిలో నున్నారనియుఁ దెలిసినది. సోమయాజు లెంతో శ్రమపడి చంద్రగిరికి వెళ్ళినాఁడు. అచట సానివాడలో విచారింప నెంతో కష్టముమీఁద నా కుటుంబమునుగూర్చి తెలియఁ గలిగినాఁడు. వెదకివెదకి చివరికెట్లో వారి యిల్లు కనుగొనినాఁడు. ఆ యింట నొక నడివయస్సు స్త్రీ యుండెను. ఆమె సోమయాజులను గౌరవించినది.

సోమ : నీకును మంగమాంబకు నేమైన సంబంధము గలదా ?

స్త్రీ : బంధువు కాదుగాని మా యమ్మకు మిత్రురాలామె.

సోమ : మీ యమ్మ యిపుడున్నదా ?

స్త్రీ : లేదు చనిపోయినది.

సోమ : మంగమాంబ కొక కూతురున్నదట, నిజమేనా ?

స్త్రీ : నిజమే. ఆమె యిపు డెచటనున్నదో తెలియదు. చక్కనిచుక్క. ఆమె మొగమున మహారాజీ కళ యుట్టిపడుచుండెడిది. ఆమె యెవరితోడనో చాల సంవత్సరములకుఁ బూర్వమే లేచి వెళ్ళినదని చెప్పుకొందురు.

సోమ : ఆమె తండ్రి యెవరో నీకుఁ దెలియునా ?

స్త్రీ : రఘునాథనాయకులవారి బిడ్డ యామె.

సోమ : ఆశ్చర్యముగనున్నదే! ఆమె రఘునాథనాయకులవారి సంతానమా ?

స్త్రీ : ఆశ్చర్యముఁ జెందవలసిన దేమున్నది? వెంకటపతిరాయలవారు జీవించియున్న కాలమది. వెంకటపతిరాయలవారికిని రఘునాథనాయకులవారికిని బ్రాణస్నేహము. ఒక పర్యాయము రఘునాథనాయకులవారు పెనుగొండకు వచ్చిరట. అప్పటిలో మంగమాంబ యీ పురమున నుండెడిది. ఒకనాటి సాయంసమయమున రఘునాథనాయనివారు వాహ్యాళి వెడలి యొక సుందర మందిరోపరిభాగమున నామెఁ గాంచిరట. అప్పటిలో మాయమ్మ రాజాంతఃపురమున దాదిగ నుండెడిది. ఆమె సాహాయ్యమున రఘునాథ ప్రభువుల వాంఛిత మీడేరినది. అది రంగాజమ్మ జన్మవృత్తాంతము. మంగమాంబ మరణానంతర మామె కొంతకాలము తన ముత్తవల యింటివద్దఁ బెంపఁ బడినది. ఆ తరువాత నిట్లు జరిగినది. రఘునాథనాయకప్రభువులు మాయమ్మకు వ్రాసి పంపిన లేఖలు కొన్ని యిప్పటికినిఁ గలవు.

సోమ : వానిని నా కీయఁగలవా ?

ఆమె లోనికిఁ బోయినది. లోన నెవరిదో పురుషస్వరము వినఁబడినది. ఆమె కొన్ని జాబులఁ దెచ్చినది. అవి భూర్జపత్రములపై వ్రాయఁబడియున్నవి. ఆ జాబులు కల్పించినట్లున్నవి. సోమయాజు లట్లు భావించలేదు. రాజ రంగాజమ్మల సంబంధము విడఁదీయుటకుఁ దనకు సులభమార్గము చిక్కినదను కొనినాఁడు. పెనుగొండ, చంద్రగిరి——యీ రెండుప్రదేశములందును నెవరో యొకవ్యక్తి రహస్యమునఁ దనకు సాయ మొనర్చుచున్నాఁడనిపించినది. చంద్రగిరియందా స్త్రీ యట్లు సత్కరించుటలో, సంభాషించుటలో నెవరిదో యాజ్ఞ యొకఁడు భాసించుచున్నది. ఆ గుప్తసాహాయ్య మొనర్చిన వ్యక్తి

యెవరోకదా యనుకొనినాఁడు సోమయాజులు. సోమయాజులు జాబులుతీసుకొని వెళ్ళెదననిచెప్పి బయలుదేరినాఁడు. ఆ స్త్రీ కొన్నిఫలముల నిచ్చి స్వీకరింపుఁడనినది. సోమయాజులు వలదనినాఁడు. ఆమె బలవంతముచేసినది. సోమయాజులు రెండుపండ్లనుమాత్రము తీసికొని వెళ్ళిపోయినాఁడు.

౧౫

దినములు గడచుచున్నవి. సోమయాజులింకను రాలేదు. రాణికేమియుఁ తోఁచుటలేదు. "కపర్దిని చంద్రరేఖా ప్రభువులమధ్య శృంగారభావమే లేదని చెప్పినది. ఇది కొంత యాశ్చర్యముగనే యున్నది. కపర్దిని లోతులుతీసి విషయములను గ్రహించుటయందుఁ జతుర. అసత్యమైయుండదు. నా పక్షము వహించి రంగాజమ్మను మందలించినదఁట చంద్రరేఖ. ఆమె మొదటినుండియు నింతేనఁట. వింతమానిసివలె నున్నది. లోకములో నిటుల నిర్భావతులుకూడ కొందరుందురా? లేక నా పక్షముఁ బూనుచున్నట్లు నటించుచు రాజును దానే వలలోవేసికొన యత్నించుచున్నదా? మన్నారుదాసునకుఁ గారాగారవిముక్తి యెన్నటికో! ప్రభువు ఎన్నిపర్యాయములు వర్తమానమంపినను దయచేయకున్నారు. నేనైనఁబోయి వారిని దర్శింపవలె ననిపించుచున్నది. సోమయాజులుగారు వెళ్ళినపని యేమైనదో! చాలదినములైనది. ఇంకను రాకుండుటకు హేతువేమో! నా మన్నారును జూచునంతవఱకు నా కనులు చల్లఁబడవు. ఈ రంగాజమ్మపిశాచము వదలినగాని మాకు శుభదినములు రాఁజాలవు."

రాణి యాలోచనల కంతులేకున్నవి. ఆమె పదునేను దినములుగ నిరాహారగ నున్నది. నిరంతర మామెమనమున నాందోళనలే చెలరేగుచున్నవి. కపర్దినివచ్చి సోమయాజులుగారు వచ్చుచున్నారని చెప్పినది. రాణి యాయనను జూచుటకుఁ ద్వరపడినది. సోమయాజులు వచ్చినాఁడు. ఆయన రాణికి రంగాజమ్మ జన్మవృత్తాంతముఁ జెప్పినాఁడు. రాణి తనకు మంచిరోజులు రానున్నవనుకొనినది.

సోమ : ఈ లేఖలఁ జంద్రరేఖకుఁ జూపింతునా?

రాణి : వలదు. మన మిప్పుడు తిరిగి చంద్రరేఖ వలలోపడుట మంచిది కాదు. ఈ విషయము ప్రభువులకే తెలియఁజేయవలెను.

సోమ : మహారాణీ! మీ రొకసారి ప్రభువులను కలిసికొనిన బాగుండి యుండెడిది. మీ రట్లు చేయలేదా ?

రాణి : ప్రభువులకు చాలమారులు సమాచార మంపితిని. వా రిచటికిఁ రారఁట.

సోమ : పోనిండు. మీరే వారిని దర్శించినచో ?

రాణి : నేను నదియే యూహ సేయుచున్నాను.

సోమ : మీరు వారి దర్శనార్థము వచ్చుచున్నట్లు వార్తనంపుడు. నేను కూడ మీ వెంట వచ్చెదను.

రాణి : అటులే యొనర్చెదము.

రాణి తమరాకనుగూర్చి యొకదానిచే రాజునకు వర్తమాన మంపినది. ప్రభువువద్దనుండి సమాధానములేదు. రాణి కేమిచేయవలెనో బోధపడినదికాదు. కపర్దినిని రాజుగారివద్దకుఁ బంపినది. రాజు విశ్రమించు సమయము. కపర్దిని రాజసమక్షమున నమస్కరించి నిలిచినది. రాజు కపర్దినిరాకకుఁ జిరాకు చెంది నాఁడు. కపర్దినియనిన రాజున కొకభావము. ఆమె యెన్నడును రాజునొద్దకుఁ బోవదు. ఆమెవచ్చి యేదేని నడిగినఁ దాను కాదనలేడు. ఆమె రాణి పనుపున వచ్చినది.

ప్రభువు : కపర్దినీ! నీ వచ్చిన పనియేమి ?

కపర్దిని : మహాప్రభూ! మహారాణి భుజించి చాలదినములైనది. ఆమె శుష్కించి శల్యావశిష్టముగ నున్నది. ప్రాయోపవేశమొనర్చినదామె. చనిపోవక పూర్వ మొకపర్యాయము తమ్ము దర్శింపవలెనని యున్నదఁట. తా మంగీక రించినచోఁ దమ దర్శనమునకుఁ రాగలరఁట. ఆమెదుఃఖముఁ జూడ లేకున్నాము. ఇంకను కొలదికాల మిట్లేయున్నచో నామె యేమగునో చెప్పఁ జాలము. ప్రభువుల యనుగ్రహ మే రీతిగ నున్నదో!

ప్రభువు : కపర్దినీ! మేము రాణిగారినిఁ జూడగోరుచున్నాము. ఆమె యిచటికి రావచ్చును.

కపర్దిని : మహాప్రసాదము.

కపర్దిని వెళ్ళినది. రాణిగారి కీ సంగతి నివేదించినది. సోమయాజులు ప్రభుసన్నిధానమునకు దానుగూడ వత్తు ననినాఁడు.

రాణి : మీరు రానేవలయును.

ఇరువురునుఁగలసి ప్రభువులవద్దకుఁ బోవుటకు నిశ్చయించుకొనిరి. సాయంకాలమునకు రాణిగారి శిబికము విజయరాఘవ విలాససదనము ముందాగినది. శిబికవెనువెంటనే సోమయాజులు వచ్చినాఁడు. రాణి శిబికమునుండి దిగి నెమ్మదిగ లోనికిఁబోవ నారంభించినది. సోమయాజు లామె ననుసరించు చుండెను. రాజమందిరప్రాంగణమునఁ గావలియున్నవారు రాణిగారికి వినమ్రులై నమస్కరించి దారి నొసఁగిరి. సోమయాజుల నడ్డగించిరి.

రాణి : ఆయన నడ్డగించెదరేమి ?

కావలి : మిమ్ముల నొక్కరినే లోనికిఁ బ్రవేశింపఁజేయుఁడని ప్రభువుల యాజ్ఞ.

రాణి : ఆయనను రానిండని నా యాజ్ఞ.

కావలి : అమ్మా ! తమయానతిఁ దాటఁజాలము. కాని ప్రభువులు....

రాణి : అయినచో నేనును లోనికేగను. ఆయన వినా నా కిప్పుడు రాజదర్శనమే యనవసరము.

కావలివారిలో నొకడు లోనికిఁబోయి ప్రభువులతో నీ సంగతి నివేదించి నాడు. ప్రభువు విసుగుకొని రానిమ్మనినాడు. రాణి, సోమయాజు లిరువురు లోనికిఁ బోయినారు. రాణి గదిగుమ్మమువద్ద నాగిపోయినది. ప్రభువెదురుగ నున్న యాసనమున నవనతవదనుడై యున్నాడు. రాణి యాయన నేకదృష్టిగ నొకలిప్తకాలము చూచినది. ప్రభువట్లే యున్నాడు. రాణి యొక యడుగు లోనికివైచినది. ఆమె చరణ మంజీరము శింజితమైనది. ప్రభువు తలయెత్త లేదు. రాణివంకఁ జూడలేదు. రాణి కేమిచేయవలెనో బోధపడకున్నది. ప్రభువు నట్లే పరికించుచు నిలుపఁబడినది. పది నిముసములు గడచినవి. ఎవరు నేమియు మాటాడలేదు. ప్రభువు తలయెత్తి చూచినాడు. రాణి తల దించుకొనినది. రాణి హృదయమునఁ గోపావర్తములు చెలరేగుచున్నవి. నిజమే, తనకును ప్రభువునకును చాలదినములు సమాగమములేదు. ఒకవేళ

ప్రభువే తన సదనమునకు వచ్చెను, తానేమిచేయును? అర్ఘ్యపాద్యము లిచ్చును. తన చీరచెఱగుతో ప్రభువు పాదము లొత్తును. సర్వోపచారములుఁ జేయును. ప్రభువుమీఁద తనకుఁ గోపముండుటయేమి. తన యింటికి వచ్చిన ప్రభువును మర్యాదచేయుటయేమి. ఆయనవలనఁ దా నవమానముఁ బొందెనుగాని తనవలన నాయన యవమానమును భరించలేదు. ప్రబల విరోధి యింటికి వచ్చినను గౌరవింతురు. సామాన్యమైన యొక స్త్రీ రాజసదనమునకు వచ్చిన మర్యాద చేయఁడో! అందునుఁ దాను బట్టమహిషి. రాజ్యమున రాజాజ్ఞ యెటువంటిదో మహారాణి యాజ్ఞ యటువంటిదే. పట్టమహిషిరాణై వచ్చినపుడు మహారాజు తలయెత్తఁడో! తనమీద కోపమున్నచో నుండనిమ్ము. మర్యాద సేయఁడా? ఆమె, బిడ్డ నెవరో యెత్తుకొనిపోవుటకు రాగా వానివంక తీక్ష్ణముగఁ జూచు వాడెంతపులివలె చురచురఁ జూచుచు నిలుచుండెను. ఆమెనఖ శిఖా పర్యంతము నవమానజనిత కోపాకృతియై యుండెను. ఒక యడుగు గదిలో నుండెను. రెండవ యడుగు గది వెలుపల నుండెను. మహాగ్రీష్మయామినీవేళ రెండు జాములప్పుడు నర్ధోదిత చంద్ర బింబమువోలె నామె నిలుచుండెను.

ప్రభువు మనమునఁ గ్రోధాగ్నికీల లెగయుచున్నవి. వచ్చిన రాణి పలుకరించదేమి! అన లీమెను రమ్మనిన దెవరు? తనకుగ నెన్నియో వర్తమానము లంపెనది. వచ్చినది. అపుడు, రాణీ మందిరమునకు తాను పోవుట మాని చాల కాలమైనది. ఇప్పుడైనను దాను పోలేదు. ఆమెయే వచ్చినది. ఈ మౌనమున కర్థమేమున్నది? భార్యకు భర్తవద్ద నింత రాజసమా! ఆమెకు మహారాణి నను గర్వమున్నట్లున్నది. ఆ గర్వము మహారాజుతోఁగూడ మాటాడకుండ చేయుచున్నది. ఎంతగర్వము లేనిచో రంగాజమ్మ కిట్లు సందేశ మంపును? రంగాజమ్మ యనినఁ దనకెంతటి ఛాపమో యామెకు సువిదితము. తెలిసియుండియు నట్లామెను తిరస్కరించినదనిన నా తిరస్కారము తనకుఁ గాని రంగాజమ్మకుఁగాదు. చంద్రరేఖ క్రొత్తగవచ్చినది. ఆమెను దోషు చేసికొని, ఆమెవద్ద తన్నెట్లుగా చిత్రించినదో! రాణికి పక్షాన సోమయాజులు. వీ రిరువురుఁ దన్ను ప్రతిఘటించుటకుఁ బూనుకొనినారు. తాను పట్టమహిషి. అయిన, భర్తను పలుకరింపవా! ఆయన క్రోధవివశుఁడై రాణివంక తీక్ష్ణముగఁ జూచినాఁడు. ఆ చూపామెహృదయమున నొక్కసారిగ వెయ్యి బాకులు

గ్రుమ్మిన ట్లైనది. ఆయన యాపాదమస్తకము పరాభవజనితోత్థిత క్రోధాకారము వలె నుండెను. మహాగ్రీష్మ మధ్యాహ్నవేళా గగనమండల విభాసితా హస్కర బింబమువోలె నాయన ముఖము దుర్నిరీక్ష్యముగ నున్నది.

రాణి తలయెత్తి చూచెను. రాజు మొగములో ప్రసన్నత లేకపోగా క్రోధము కనిపించుచుండెను. ఏమయిందు క్రోధమెందులకు ? తానాయనకు చేసిన ద్రోహమేదియు లేదే ! రాణి కన్నులుకూడ నెఱ్ఱబడెను. రాణికిం గోపము వచ్చినట్లు రాజు తెలిసికొనెను. వారిరువురి కోపములు నొకటికొకటి కారణమయ్యెను. ఇద్దరు మహాయోధులు కత్తులు కలుపుకొనువేళ నొకరినొకరు తీక్ష్ణముగఁ జూచుకొనునట్లు చూచుకొనుచుండిరి. అది యొక యగ్నిపర్వతము వలె నుండెను. ఎప్పుడు పగిలిపోవునో తెలియకున్నది. వెంటనే పగులుటయే మంచిది. ఆ సమయ మాలస్యమైనకొలఁది పెంపవు మహాగ్ని జ్వాల మిక్కిలి భయంకరముగా నుండును. ఈ పగులుట యెందేవెనుండి పగులవలయును ? ముందెచ్చోటనుండి పగిలెన నచ్చోట బలహీనమైపోవును. అందుచేత నిరువురును గ్రోధతామ్రమాక్షులై యొకరి నొకరు చూచుకొనుటయేకాని నోటివెంట బయలు వెడలిన పల్కులేకుండ నుండిరి. రాణియే మాటాడునని రా జెదురు చూచుచుండెను. రాణి మాటాడెదిపే. విజయరాఘవనాయకునియందు క్రోధము కాని, అప్రసన్నతకాని లేకున్నదో నామె మాట్లాడెడిది.

మాటాడకున్నరే, తానిచ్చటినుండి వెడలిపోదు. ఆ నిలుచున్నతీవి, ఆ చూచిన చూపులోని యహంకారము రాజును దలక్రిందులు చేసినవి. విజయ రాఘవ నాయకుడు మహారసికుడు. భరతశాస్త్రవేత్త. సర్వనాట్య భంగిమముల లోని రహస్యములు, మాధుర్యములు నెఱిఁగినవాడు. భరతనాట్యాభినయము నందు ప్రౌఢాధీరాధీరాది నాయికలయొక్క యభినయము వేళ నా నాయికల క్రోధాభినయము, రాచఠీవిఁ బ్రదర్శించు నంగవిన్యాసము, కుపితనేత్రచాలనము సర్వము నెఱిఁగినవాడు. రంగాజమ్మగాని, చంద్రరేఖగాని మరి యితరలైన నాట్యకత్తెలుగాని యిట్టి యభినయముఁ జేసినప్పుడు లా నానందించినాడు. చంద్ర రేఖ యొకనాటి యభినయములో నిట్లేనిలుచున్నది. ఇట్లేచూచినది. రాజున కా విషయము జ్ఞప్తికి వచ్చెను. ఆనాటి చంద్రరేఖాభినయమునకు, నేటి రాజ

గోపాలాంబికాదేవిగారి యీ నిలుచున్న తీవికి భేదమేమి? అది యభినయము. ఇది నిజము. నిజముగానైనను నట్టినిలుకడ నిలుచుట, రసస్వరూపము జీవి యొక్క హృదయమున నిలుకడ నేర్పఱచుకొనకున్నచో నెట్లు సాధ్యమగును? చంద్రరేఖాదుల కది యభ్యసించిన విద్య. రాజగోపాలాంబికాదేవిగారి కది రాచపుట్టువుతో సహజముగా వచ్చిన భావప్రాకట్యము. కాని రాణికిఁ దనమీఁదఁ గోపమున్నది. ఏనాయిక యభినయింపఁబడుచున్నదో యా నాయిక యొక్క ప్రధానమూర్తి నిజముగా కోపనయే కదా? సత్యభామ పాత్ర నభినయించు స్త్రీకి నిజముగా కోపములేదు. కాని పారిజాతమును భర్త రుక్మిణి కిచ్చినాడన్న సమయమునందలి యసలు సత్యభామకు నిజముగా కోపమే కదా! రాజగోపాలాంబికాదేవి రాచకూతురు. చంద్రరేఖ రాచకూతురుకాదు. రంగాజమ్మయు రాచకూతురుకాదు. వారిద్ద రభినయమువేళనే రాచఠీవి కలవారు. తక్కినప్పుడు సామాన్య స్త్రీలు. వారియందలి ప్రేమ వారి యభినయ కాలమును స్మరించుకొనగా సంభూతమైనది. వారికి నిత్యమైనది కాదు. పట్టమహిషికి నా భావములు, తత్సహజ ప్రకటనములు, పుట్టువుతోడనే సిద్ధించినవి. తనయందు వినయముగల భార్యయందు కోపాదులు కనిపించుటెట్లు? భార్యకు భర్త భగవంతుడు. సత్యభామ యందు బలె రుక్మిణియందు కృష్ణునకు ననుభావ సంచారి భావములు గోచరించలేదు. పరమేశ్వరునకు భర్తునియందు దాసత్వము ప్రకాశించునుగాని కోపము, నింద, ఈర్ష్య యిట్టివి ప్రకాశించవు. పరమేశ్వరుడు దాసు ననుగ్రహింపడు. విరోధముచేతఁ బుట్టిన కోపము మొదలైన గుణములు ప్రకాశించిన హిరణ్యకశిపుడు మొదలైనవారియందు స్వామికి వెంటనే యనుగ్రహము కలుగును. అట్లే శృంగారపురుషునకు స్త్రీగతమైన యీర్ష్యాక్రోధ జుగుప్సాది భావవికారము స్త్రీయం దెక్కువ యాదరము కలిగించుచున్నది. ఇవిలేని భార్యయం దాదరము కలుగుటలేదు. భార్య కవి చేతకావనియే యాతని యుద్దేశ్యము. భార్యయొక్క మనస్సు ధర్మముచేత దాసీభావమును బొంది భర్తయం దాభావములను బ్రకటించదు. నిజముగ చూచినచో సత్కులప్రసూతమైన భార్యయం దాభావములు ప్రకాశించినట్లు నీచజాతి స్త్రీయందుఁ బ్రకాశించవు.

రాజు రాణియందింత ప్రసన్నుడైనను తత్ప్రిసన్నభావ మాయన మొగ మునందుగాని, కనులయందుగాని కనిపించలేదు. ఇది యతని మనస్సులో విచారముచేసినభాగ మనుభవించిన విషయము. రా జిట్లనెను. "ఏదియో మాట్లాడవలెనని వచ్చితిరికదా మాట్లాడ వచ్చును."

రాణి నిలుచున్న చోటినుండి కదలలేదు. కన్ను త్రిప్పలేదు. మాటాడు ప్రయత్నమే చేయలేదు.

రాజు : తమ రెందుకు వచ్చితిరో మాకుఁ దెలియును. మీ కుమారుడు రాజద్రోహముఁ జేసినాఁడు. తంజాపురరాజ్యమునకు విరోధులైన మధుర వారితోఁ జేతులుచేతులు కలుపుచున్నాడు. మేము దుర్మార్గులమఁట. మాకు వయస్సు మరలినను గామము మరలలేదఁట. మేము వారి తల్లిని సరిగా చూచుటలేదఁట. మే మెందుకు సరిగా చూడలేము? ఆవిడ పట్టమహిషి. ఆయమ భోగములుగాని యామె కిచ్చు మర్యాదలుగాని, దేనిలో లోపము జరిగినది? ఆమెను గౌరవముచేయని నిముసము మే మెఱుఁగము. మేము చేయు దాన ధర్మములన్నియు నితఃపూర్వము మేముచేసిన పాపములను నివారించు కొనుటకుఁ జేయుచున్నామట! విజయరాఘవనాయకుఁ డొక హిరణ్యకశిపుఁడు!

రాణికి నాయకుఁడు మాటాడుచున్న మాటలలో చురుకుతనము కనిపించ లేదు. కాని యాయనముఖములో, కన్నులలో, మాటాడుచున్నవైఖరిలో తనయందు నిరాదరము, కొడుకునందు చెప్పరానంతకోపమును కనిపించినవి. రాణికి మనస్సాడుటలేదు. ఆమె మనస్సు కోపమేయయ్యెను. ఆ కోపమున కాలోచనలేదు. తనభర్త తనబిడ్డను చెఱలోపెట్టి శత్రువువలె మాటాడుచుండగా నామె మనస్సునకున్న తక్కువటుత్వము పోయెను. వాక్కునకున్న ధార యంతరించెను.

నాయకుఁడు రాజగోపాలాంబిక మాటాడునని యెదురుచూచెను. సమాధానమును ప్రత్యాశించెను. మన్నారుదాసు నిర్దోషియని యామె నిరూపించునని భావించెను. ఆయుత్తరము మన్నారుదాసు వ్రాసినదికాదు. మధురరాజ్యపు ముద్రిక కలది. అది కల్పితము కావచ్చును. ఈ మాట రాజగోపాలాంబిక చెప్ప

పలయును. తాను వెంటనే మన్నారుదాసును విడుదలచేయును. ఇది పట్టమహిషి యెందుకు చెప్పవలయును? తానే చేయరాదా యన్నయూహ యాయనకుఁ దోచలేదు. తాను తొందరపడి యట్లు చేసెను. దీనికంతకును రాయసము వెంకన్న కారకుడుగా కనుపించుచున్నాడు. తాను తొందరపడి చేసితినని తనకే తెలియును. తన కెవరైనఁ జెప్పవలయును. దానిని తాను సర్దుకొనవలయును. ఇది మానవుని స్వభావము. ఆ చెప్పినవారియందు గౌరవము చేత చేసినట్లు కనిపించవలయును. ఇవి మానవునియొక్క స్వభావము నందలి యొక మాయాబంధము.

రాణి మాటాడలేదు. కనులయందు నిప్పులు గ్రక్కుచునే యుండెను. రాజునకుఁ గోప మిబ్బడిగావచ్చెను. అనినాడు "మనమును కొడుకుకన్నఁ దక్కువవారము కాము. ఆయన మాపెంపకములో పెరుగలేదు. మాయం దాయనకుఁ బ్రేమయును లేదు. ఆయనయంతట నాయన కాయూహలు పుట్టినవని కూడ మేము నమ్ముటలేదు. తల్లిగారు చెప్పినారు. ఆయనచేసినారు; లేనిచో నాయనచేసినాడు; తల్లిగా రంగీకరించినారు.

రాణి యింతవఱకు నడ్డముగా దిరిగి నిలిచియున్నది. మొగము రాజు పంకకుఁ ద్రిప్పియున్నది. కాని యామె శరీరము ద్వారబంధమున కెదురుగా నున్నది. అంత నామె రాజున కెట్టయెదురుగా తిరిగి యనినది. "ఇదిగో, ఆతల్లి, ఆమె చేతులు బంధించవచ్చును. ఆమెను కూత చెఱలో పెట్టవచ్చును. దానికోసము మరల నర్ధరాత్రమువేళ వార్తనంపుట యెందులకు? ఈమె యెక్కినబండి యీమెకుఁ దెలియకుండ కారాగారము కడకుఁ దోలుకొని పోవుట యెందులకు?"

రాణియనిన యీమాటలతో రాజున కొడలు మండిపోయినది. ఎందుకు మండిపోయెను? తానుచేసిన పనియేకదా! ఆ చేసిన కార్యములోని వైనముఁ జెప్పుటలో నాయనకు మర్మచ్ఛేదముఁజేసినట్లయినది. రాజు కన్నులు మండించుచు మొగమడ్డము త్రిప్పుకొనెను.

రాణి: మరల మనవిఁజేయుచున్నాను. ఆతల్లి సిద్ధముగా నున్నది. వెంటనే చెఱలో పెట్టవచ్చును. నేనింకనిచ్చట నిలుచుటలేదు. నేను పోవు

చున్నాను. నేను వెడలిపోయి రాజ్యములో విప్లవముతీసికొని రావచ్చును. పర రాజులతోకలిసి పన్నాగములు పన్నవచ్చును. తరువాత పశ్చాత్తాప పడవలసి వచ్చును.

రాజగోపాలాంబిక యచట నర్ధనిమేషము నిలిచెను. వెనుకకు గిఱ్ఱున తిరిగెను. చఱచఱ నడచిపోయెను. ఆతిరిగిపోవుట పగఁబూని కాటువేయుటకు వచ్చినత్రాచుబా మవరోధముకలిగి వెనుకకు గిర్రున తిరిగిపోయినట్లుండెను. విజయరాఘవ విలాససదనమంతయు మండు యెండలుకాచి వడగాలి విసరు చున్న పూఁదోటవలె నుండెను.

రాణి తన యంతిపురము ముంగిట నాందోళికనుండి దిగినంతనే యెల్లు సోమయాజులు కనిపించెను. రాణి యాయనవంక తీక్ష్ణముగా చూచెను. తాను లక్ష్యముకాని యాతీక్ష్ణతచేత యెల్లు సోమయాజులు గడగడ వడఁకిపోయెను. మఱల రాణి కన్నులలోఁ బ్రసన్నత కలిగెను.

సోమ: పట్టమహిషీ! ఇన్నాళ్లు నా రాజుకూతుర వనుకొన్నాను. నేడు నీవు నాకు మహారాణి వని తెలిసినది. కాని మహారాణీ! మనము వెళ్ళిన దొరెందులకు! జరిగిన దింకొకటి!

రాణి: రాయసము వెంకన్నను నేను రమ్మంటినని చెప్పుడు.

రాణి పరిచారికల సేవలన్నియుఁ బరిహరించెను. కపర్దినికిఁగూడ దిక్కు లేకపోయెను. ఆమె జగత్సంహారముఁ జేయుటకు బయలుదేరిన కాళికాదేవి వలె నుండెను. పరిచారికలు కదలుటకుఁ గూడ వీలులేదని యాజ్ఞ చేయఁబడిన మేడ పై యంతరువులో తన బంగరుకోళ్ళ పెద్ద పట్టెమంచముపై గభేలున పడిపోయి రాణి వెక్కి-వెక్కి- యేడువఁదొడఁగెను.

ప్రియవిరహిత చక్రవాకి యొకటి యాకాశమునఁ గూయుచుఁ దిరుగు చుండెను.

౧౬

మరునాడు పట్టమహిషి నిద్ర మేల్కొ-నినది. ఆమె మొగముఁ జూచిన వారి కామె కడచినరాత్రియంతయుఁ గన్నీరుమున్నీరుగ నేడ్చినదన్న సంగతి తోచనైన తోచదు. ఆమె సుమారు పాతిక ముప్పది యేండ్లనుండి పట్టమహిషి.

ఇన్నియేండ్లు నామె పట్టమహిషియని యనుకొనుటయేకాని యామెలో పట్టమహిషితనము కనిపించలేదు. నేటిప్రొద్దున నామెమొగముఁ జూచినచో నెఱుఁగనివారికైన నామె పట్టమహిషి యనిపించును. విజయరాఘవ నాయకులవారికిఁ దమయందు ప్రేమలేదని దుఃఖపడినంతకాలము నామెలో ఠీవి కనిపించలేదు. అహంకారము గోచరించలేదు. మనోనిశ్చయము ప్రకాశించలేదు. ఆ శృంగార భావ మామెనుండి విడువడినతోడనే యామెలో నొక రాజసభావము సధికార భావము వెలికివచ్చినది. దానికిఁదోడు కొడుకు చెఱలోఁబెట్టఁబడినా డన్నభావ మామెలో వేఱొకమార్పుఁ దెచ్చినది. కడచినరాత్రి తెల్లవారువఱకు నామెకు రెండు దుఃఖములు. మొదటిది మహారాజు తన్ను మన్నించుటలేదని. రెండవది కొడుకు చెఱపెట్టఁబడినాఁ డనునది. ఇప్పు డా రెండు దుఃఖములునుపోయి యహంకారముగను రాజఠీవిగను మార్పుఁజెందినవి.

కపర్దిని మహారాణివద్దకు వచ్చినది. ఆ దాసి కీ రాణిదగ్గఱ మిక్కిలి చనవు. పూర్వ మా కపర్దిని చెప్పినట్లే రాణి నడచుకొనుచుండెను. అలవాటు కొలఁది కపర్దిని రాణిదగ్గఱకుఁబోయి యేదో చెప్పఁబోయెను. రాణి యామెపై నొక యధికారపుఁజూపు చూచెను. కపర్దిని వెనుకాడెను.

క్రమముగా రాణి వారముదినములలో నెల్లర నాజ్ఞాపించుచుండెను. ఆమె మాట గాదనుటకు వీలులేకుండెను.

పట్టమహిషికి సొంతయాస్తి కలదు. ఆ యాస్తి కొన్నిలక్షలు వెల చేయును. ఆ యాస్తియంతయు, పూర్వము రాజాధికారులే పరిపాలించుచుండిరి. వారముదినములలో రాణి తనయాస్తినంతయుఁ దనయదుపులోనికిఁ దెచ్చుకొనెను. కడచిన పాతికయేండ్లలో నామెయాస్తిమీది ధనము చాలభాగము రాజ్యముక్రింద వ్యయపెట్టఁబడెను. తన ధనమంతయుఁ దనకుఁ జెల్లుబడి కావలయునని యామె రాజునకు వార్తఁబెట్టెను. విజయరాఘవనాయకుఁ డాశ్చర్య పోయెను.

రాణి వెడలిపోయినతరువాత విజయరాఘవనాయకుఁడు వెనుక కామెను పిలిపింత మనుకొనెను. ఆమె రాదని గ్రహించి యూరకుండెను. విజయరాఘవుఁ డొక విలక్షణమైన స్వభావముకలవాడు. ఆయన శృంగారభావము భావాశ్రయము

కాని కామాశ్రయముకాదు. అందుచేతనే చంద్రరేఖ ప్రభువును నిరాకరింపఁ గలిగినది. మహారాణి నాడు ప్రదర్శించిన కోపము, తదనుకూలమైన యంగ విన్యాసము, ఆ నిలుచున్న భంగిమ, తద్భ్రుకుటీక్షేపము రాజునకేమనిపించెను! సరిగా నట్లభినయించుట రంగాజమ్మచేతఁగాదు. చంద్రరేఖచేతనుగాదు. అప్సరస్త్రీలు దిగివచ్చి యట్లు చేయలేరు. పట్టమహిషి చిన్నప్పుడు భరతాభినయము నేర్చుకొన్నది. ఆ సంగతి విజయరాఘవులకుఁ దెలియదు. తమ యంతిపురములో నామెచేత నభినయింపించి రాజు చిన్నప్పుడుఁగూడ చూడలేదు. ఇంత ఈడువచ్చిన రాణిభంగిమ యింత యందముగా నున్నప్పుడు, వయసులో నామె యభినయవిశేష మెటులుండెడిదో!

రంగాజమ్మమీఁద కలిగిన మరులు మహారాణిలోని యీ గొప్పభావమును దెలిసికొననీయలేదు.

విజయరాఘవనాయకుఁడు తన మనసులో విచారించుకొనెను. నిజముగా తనకు మన్నారుదాసుమీదఁ గోపము లేదనిపించినది. పట్టమహిషిమీఁదఁ గోపములేదు. తనహృదయము లోపలిలోపల పట్టమహిషియందుఁ గోపము కనిపించుటలేదు. తా నిప్పుడు తనయంతట పట్టమహిషియింటికిఁ బోవవచ్చునా? తాను లోకువయైపోవునేమో! ఆమె మరల నీసారి వచ్చినప్పుడు తాను ప్రసన్నుడై మాటలాడును. ముందు మన్నారుదాసును విడుదలచేయవలయునా? ఈ యూహలో విజయరాఘవనాయకునకు మొదటిసారి రాయసము వెంకన్న మీఁద కొంచెము కోపమువచ్చినది.

ఇట్టి మనోభావములతోనున్న విజయరాఘవనాయకుఁడు రాణియొక్క ధనమును రాణికి వెంటనే యీయవలయునని యుత్తరువుచేసెను. రాణిచేతి లోనికిఁ గొన్నిలక్షలు వచ్చినవి. ఆమెకు చాలమంచి సేవకులు కలరు. స్త్రీ లున్నారు. పురుషు లున్నారు. ఇప్పు డామె యొక స్వతంత్రాధిపత్యమును వెలయించుచున్నది. ఎల్లు సోమయాజు లామెకు మంత్రి. కపర్దిని యామెకు రహస్యమాతి.

ఆ రాజధానిలో నాల్గు చెఱశాల లున్నవి. ఒకదానియందు రాజవంశీయులైనవారిని నియమించి యుంచుదురు. తనకొడుకందులో నుండవలయును.

అప్పటికిఁ దన రహస్యమాతలను పంపినది. అందులో తన మన్నారుదాసు లేడు. లేడని తెలిసినప్పుడు రాణి కోసగానున్న చెట్టుయొక్క యెండుకొమ్మ డొక్కలో గుచ్చుకొని గాయమైన పెద్దపులికి మరల వేటగాని బాణము తగిలిన నెట్లుండునో యట్లున్నది. గాయమున్న పెడకు మలగి పరమభయంకరముగ వేటకానిమీదికి దుమికి వాని ప్రాణములు తీయుటకు సిద్ధముగానున్నది. యువ రాజును సామాన్యులనుంచు చెఱిలో నుంచెనారాజు! ఇట్లుండగా సంఘాత కారాగారమున మన్నారుదాసు నుంచినారని తెలిసినది. ఎవరికి యావజ్జీవము శిక్షవిధింతురో వారి నా కారాగారమున నుంతురు. రాజు ప్రత్యక్షముగా పోయినఁ గాని యచట బంధితుఁడైనవారికి విడుదలలేదు. మరల తాను రాజువద్దకు పోవలయును. తా నింక రాజువద్దకు పోదు.

రాణికి నొక వాహగజ మున్నది. ఆ గజముమీఁద హౌదా కట్టించినది. హౌదాలో కూర్చుండెను. తన సేవకులందరు నేబదిమంది కలరు. వా రందరను ఖడ్గపాణులను, శూలపాణులనుగాఁ జేసెను. తాను సంఘాతకారాగారమున కేగెను. అచటి రక్షకభటులు భయముఁజెందిరి. ఆమె యాజ్ఞయిచ్చినచో నామె భటులు కారాగార రక్షకభటులను వధించి మన్నారుదాసును వదలింతురు. తరువాత నేమికావలయును? ఆమె యా పనిని జేయఁదలచుకొనలేదు. ఆమె యొకవిషయమును తెలిసికొనుట కచటికిఁబోయెను. ఆమె కా సంగతి సులభముగా తెలిసినది. అర్ధరాత్రమువేళ మన్నారుదాసును తీసుకొనివెళ్ళినవాడు రాయసము వెంకన్న. ఈ రహస్యమైన యొక్క విషయము వదలిపెట్టి తక్కిన యెల్లవిషయములు రాజధానిలో చెప్పుకున్నారు. రాణి సాహసముఁ జేయఁబోయి భయపడినదని రాజనుకొనినాడు.

తరువాత పదిదినములు రాణి కదలలేదు, మెదలలేదు. ఒకనాటి యుదయమున రాయసము వెంకన్నకొఱకు రాణి వార్తపెట్టెను. వెంకన్న పట్టపురాణిదర్శనమున కేగెను. రాణి యచట పరిచారిక లెవ్వరు లేకుండ పంపించివేసెను. తానును వెంకన్నయు నిద్దరే.

రాణి: వెంకన్నగారూ! మీరు నాకొక సాయముఁ జేసిపెట్టవలయును.

వెంకన్న: తల్లీ! మహాప్రసాదము. తమరి యాజ్ఞను నేనుచేయుట యనగా నాజన్మ కృతార్థమైనట్లే.

రాణి : మహారాజు ఘోరపాపముఁజేయుచున్నాఁడు. తనకుఁ జెల్లెలైన స్త్రీతో శృంగారరస మనుభవించుచున్నాడు. మీరాసంగతి నాయనకుఁ దెలియఁ జేయవలయును.

వెంకన్న : దానికిఁ దగిన యాధారములున్నచో చేయవచ్చును.

రాణి : ఆధారములను మీరే కల్పించవలయును.

వెంకన్న : నా కాపని చేరఁగాదు.

రాణి : మీకుఁ జేతకానిపని యేమున్నది ? మీరు తప్పక నాకీ సాయముఁ జేసిపెట్టవలయును.

వెంకన్న : మహారాణీ ! నే నీసందర్భములో మీకు సాయముచేయలేను.

రాణి : అయినచో మీరీ సౌధమునుండి బయటికి పోరు.

వెంకన్నమొగము వెలవెలపోయెను. కాని ధైర్యముఁ దెచ్చుకొని, "మహారాజుగారు నాకొఱ కెదురుచూచుచున్నారు. నేను పోవలయు" ననెను. రాణి దొడ్డులోనున్న కైజారుదీసి వాడిని చేతితో తడవుచు, "మహారాజు నిన్ను బ్రతికియుండఁగా చూడడు. న్యాయముగ మాపని చేసిపెట్టుము" అనెను.

వెంకన్న రాణిమొగముఁ జూచినంతన గజగజలాడిపోయెను.

వెంకన్న : తల్లీ ! అట్లేచేసెదను.

రాణి : నేను విజయరాఘవనాయకుఁడను గాను. దివారాత్రములు నీ ప్రాణములమీఁద నా రహస్యచారులు కాచుందురు. నీ వీ రాజధాని వదలి పోలేవు. నేను చెప్పినట్లు చేయుము. తరువాత నీవు తలఁచుకొన్నట్లు చేయుదువుగాని.

వెంకన్న : నే నేమియుఁ దలఁచుకొనలేదు. నేను సామాన్యోద్యోగిని. మహారాణులవారికి నామీఁదఁ గోప మెందుకువచ్చినదో నాకుఁదెలియదు.

రాణి : నీవేమి చేయఁదలఁచుకొన్నావో నేను నదియే చేయఁదలఁచుకొన్నాను. ఇది రాజునకు నేను చేయుచున్న ప్రతీకారము. రాజు నాకుజేసిన యపకారమునకు నేనిది చేయుచున్నాను. ఈ ప్రతీకారము నీద్వారానే జరుగవలయును. ఈపనిని నీవే యెందులకుచేయవలయునో నీకేతెలియును.

వెంకన్న : తల్లీ ! మన్నారుదాసుగారిని మహారాజుగారు చెఱవదలింతురు.

రాణి : ఆపని జరుగరాదు. నీవు నేనుచెప్పినదానికి వ్రేలెంత మెద మగ సంచరించితివా నీప్రాణములు నీవికావు. నీ కూతురు మధురలోనున్నది. నీ భార్యయు కొడుకును పెనుగొండలో నున్నారు. ఏనిమిషమునందు నీవిక్కడ సంహరింపఁబడుదువో యా సమయమునందు వారక్కడ సంహరింపఁ బడుదురు. నే నెంతచెప్పితినో యంత చేయవలయును. మిగిలి చేయరాదు.

వెంకన్నకు తనకుమించిన నీతి గోచరించినది. ఈమెమే రాజైనచో తా నేమయ్యెడివాడో ! ఇప్పు డింకొకగతి లేదు. ఆమె చెప్పినట్లే నడువ వలయును. నడచినచో బ్రతుకవచ్చునేమో : కానిచో నాయనుమానరూపమైన యాశకూడ లేదు.

వెంకన్న వృద్ధసూర్యునివలె నుండెను. దీర్ఘదీప్తమగుచున్న యా నీడ తన్ను వదలిపోదు కాబోలు ! తా నడుగువేసినచో రాణి యా యడుగచ్చట పెట్టుమన్నట్లున్నది.

దినములు గడచినకొలఁది రాజధానిలో రాణిగారి ప్రాబల్య మెక్కువైనది. ఆయమ సేనానాయకులను పిలిపించి మాటాడును ; మంత్రులకు వార్త పెట్టి ప్రసంగించును ; మరియు నవసరమైనచో దానేపోయి మాటాడును. రాజధానియంతయు నిట్లనుకొనఁ బ్రారంభించెను :

"పూర్వము రాజునకును రాణికిని పడెడిదికాదు. ఇప్పుడు రాణియే రాజు, రాజే రాణి. అనేక వ్యవహారములు రాణియే నిర్వహించుచున్నది. అవి యట్లు జరిగినవని రాజుగారికి తరువాత దెలియుచున్నవి. ఆయన యేమియు మాటాడడు. ఇంతమార్పుజరిగినది. రాజున కనిష్టములైనకార్యములు రాజ గోపాలాంబిక యనేకములు చేసినది. ఇన్నియుఁ జేసెనుకాని మన్నారుదాసు విడుదలప్రయత్నమునుమాత్రము చేయలేదు. దానికి రాజునుపోయి చూడ వలయును. ఆపని నామె చేయదు. ఇప్పుడు నిజముగా తాను రాజునుపోయి చూడ నక్కరలేదు. తానుపోయి మన్నారుదాసును వదలుడనినచో నక్కడ నిప్పు డక్ష్యం తరపెట్టెడువారులేరు. రాజు ప్రత్యక్షముగా చేయవలసిన పను లామె యెన్నటికినిఁ జేయలేదు. రాణికధికారము ముదిరినకొలఁది చెఱసాలలో మన్నారుదాసుస్థితి

మెఱుఁగుపడినది. రాయసము వెంకన్న చెఱసాలకుఁబోయి యువరాజునకుఁ జెఱసాలలో రాజమర్యాదలన్నియు సాగునట్లు రాజాజ్ఞఁ దీసికొనిపోయి యేర్పఱచెను.

ఇట్లుండగా నొక విచిత్రసంఘటనము జరిగినది. పది పదునాఱేండ్లక్రింద నెపుడో మహారాజు రంగాజమ్మకు రెండు గ్రామములిచ్చెను. ఆ గ్రామములలో నొకటి రాజగోపాలాంబికాదేవిగారిది. ఇన్నాళ్లును దాని ప్రస్తావనమే లేదు. నేఁడు మహారాణి తనవ్యవహారముఁ దాను చూచుకొనుట యారంభించినదిమొదలు లెక్కలలో నీ వ్యత్యాసము కనిపించెను. తనగ్రామముతోపాటు రెండవగ్రామముఁ గూడ రాణిగారు తమపాలనలోనికిఁ దీసికొనిరి. రంగాజమ్మగారి వ్యవహర్త గ్రామముమీఁద నాదాయముగ్రహించుటకు వెళ్లెను. రాణిగారి వ్యవహర్తలు వానిని దరిమివేసిరి. "కడచిన యిరువదేండ్లుగ మాగ్రామ మామెయ యనుభవించినది. ఆమెయొక్కగ్రామమును మే మిరువదేం డ్లనుభవించినతరువాత వదలిపెట్టెద"మని రాణిగారి యాజ్ఞయని వారు తెలియఁజేసిరి. ఈమాటలు రంగాజమ్మకుఁ గోపముఁ గలుగఁజేసెను. "ఇన్నాళ్లులేని రాణి యీనా డెక్కడి నుండివచ్చినది? అసలు తాను రాణియేమి? నేనే రాణిని. నేనెంతటిరాణినో, 'ఏవనితల్ మముం దలప నేమిపనో' అను పద్యముతోడనే లోకమునకుఁ దెలిసినది. చూడు మేమిచేయించెదనో! రాజుగారు నేనుచెప్పినట్లేలచేయఁడో! ఇన్నాళ్ళామెను తూష్ణీంభావముతో మన్నించినందులకా యిట్లుచేయుట!" ఇట్లామె తన కోపమును వెడలగ్రక్కుచుండగాఁ బ్రక్కనున్న దాసి, "అమ్మగారూ! రాణిగారు చేసినదానిలో దోస మేమికలదు? ఇరువదియేం డ్లామె గ్రామమును మీ రనుభవించితిరికదా! ఆ యిరువదియేండ్లు మీ గ్రామము నామె యనుభవించుటలో దోషమేమున్నది?" అనినది. రంగాజమ్మ దాసిమీద విసరుకొనెను. దాసి నవ్వుచు నూరకుండెను.

ఆనాటిరాత్రి రంగాజమ్మ రాజునకు వార్తపెట్టెను. రాజు రంగాజమ్మ దగ్గరకు వెళ్ళి నెలనాళ్ళైనది. రంగాజమ్మయందుఁ ద్రెంచరాని మమకారము. చంద్రరేఖవద్దకుఁ బోయినచో తత్సమాగమమును చంద్రరేఖ సంగీత కాలక్షేపముగ మార్చుచున్నది. క్రొత్తగా రాణిగారిమీఁద వాంఛ. ఆమె మఱల తనవద్దకు వచ్చునన్నయాశ. ధీరాంబికవద్దకుఁ బోవుటకు మనసంగీకరించుట

లేదు. ఆమెవద్దకుఁబోయినచో వ్యంగ్యముగ వెంగళదాసుని యువరాజును చేయవలయునన్న మాటలధోరణి. రాజుయొక్క శృంగారభావమునకు నిలుకడ లేకపోయినది. అందుచేత, రంగాజమ్మపంపిన వర్తమానము రాజునకుఁ బ్రియతమముగా నుండెను.

ఆరాత్రి విజయరాఘవనాయకుఁడును రంగాజమ్మయుఁ గలసికొనిరి. రాజునకు శృంగారవాంఛ. రంగాజమ్మకు తన గ్రామవ్యవహారవాంఛ. ఆమె దానినిగూర్చి చెప్పనారంభించెను. రాజామె చేయిఁబట్టుకొని లాగెను. చేలాంచలాకర్షణముఁ జేసెను. ఒక పద్యముఁ జదివి యర్థముఁ జెప్పుమనెను. కపోలమును స్పృశించెను. ముంగురులు దిద్దెను. అంకమునకు రాఁదీసెను.

ఆమె యిట్లనుచుండెను:

"ప్రభువులు నాకిచ్చిన గ్రామములు రెంటను రాజగోపాలాంబిక తీసికొన్నది. నా వ్యవహర్త వెళ్ళినప్పుడు వారితో నీ గ్రామములు నావి కాని యామెవి కావన్నదట. ప్రభువులిచ్చిన గ్రామములమీఁద నామె కేమి యధికారము. ఆమె యెవరు? ఇన్నాళ్ళులేని రాణీ యీ నా డెచ్చటినుండి వచ్చినది? ఇదియంతయు మీరు ముభావముగా నుండుటచేత గాదా?"

"వీనికేమి? నా గ్రామము నాకు రామగాని."

"పద్యము చదివినట్లే యున్నది. నా తలఁ దీసివేసినట్లున్నది. నేనింతటి యమర్యాదను నా జీవితములో ననుభవించలేదు."

"అవును. మెత్తగా నున్నదనుకొందును. పగలెల్ల కన్నీళ్ళచేతనానినది."

"నేను తలయే దువ్వుకొనిలేను. ముంగురులు రేగియున్నవి. నా యధికారము పోయినతరువాత నే నెట్లున్ననేమి?"

"నే నందుకు తగను. పట్టమహిషిని మీ యంకముమీఁదికి రాఁదీసికొనుడు. ఆమె యుండగా మే మెందుకు?"

రంగాజమ్మ యేమాట యనరాదో యామాట యనినది. పూర్వము రంగాజమ్మ యిట్లనగ రాజు రాణినిఁజాలనాడి రంగాజమ్మను గారాబముద్దులు పెట్టుకొనెడివాఁడు. ఇప్పు డట్లు జరుగలేదు. రాజు తీవ్రమైన యాలోచనామగ్నుఁడై యూరకుండెను. రంగాజమ్మకుఁ బట్టరానిదుఃఖము వచ్చెను. ఆమె

దూరముగా నిలుచుండి బిగ్గఱగా వెక్కి వెక్కి యేడువనారంభించెను. రాజామె వంకఁ జూచుచు మాటాడించలేదు. ఆయన యూహింప నారంభించెను: "ఈమె రంగాజమ్మయా! తంజాపురమంతయు మన్నించు మహాకవయిత్రియా! ముప్పది కావ్యములు వ్రాసిన పండితురాలా? యక్షగాన కవితాసరస్వతియా? కవియొక్క దేశములోని కీర్తియు, అతడు వ్రాసిన కావ్యములలోని ప్రతిభయు నివి వేరు. అతనియొక్క కామక్రోధములు, అతని యహంకారము, యతని యల్పిష్ఠమైన మతియు నివివేరు. మనసులో కవి నీచుడు కావచ్చును. ఇతర మనుష్యులతో నతని వ్యవహారము పరమనీచముగా నుండవచ్చును. కావ్యము రచించునప్పు డొక్క ప్రతిభచేత నుదాత్తవిషయములు వ్రాయును. అది వట్టి మాయాలోకము. ఆ యుదాత్తతకూడ వాని శక్తిమంతమైన శబ్దజాలముచేత నుద్దీప్తమగుచున్నది. ఎవడు కవిరచనలోనున్న యుదాత్తభావములనుచూచి యా కవి యుదాత్తమైన ప్రకృతికలవా డనుకొనునో వాఁడొక పెద్ద మూర్ఖుడు."

రాజు మరల నిట్లనుకొనెను: "ఇన్నాళ్ళు నేను రంగాజమ్మ నిట్లు విమర్శించలేదు. ఆమె కంట కన్నీరుదయించినచో నాయింట మున్నీరు ప్రవహించిన దనుకొంటిని. ఈమెయందు నాకుఁగల ప్రేమ తగ్గిపోవు చున్నదా?" తగ్గిపోవుట రాజున కిష్టములేదు. వెంటనే విజయరాఘవనాయకుడు లేచి రంగాజమ్మకడకుఁ బోయి యామె కన్నీళ్ళు తన చేలాంచలముతోఁ దుడిచి యామెను గౌగిటికి హత్తుకొనెను. ఆమె రాజు రొమ్ముమీఁదఁ దల నానించి కౌఁగిట నొదిగెను. అంత రాజు సముదాయించెను. "ఆమెతో మనకు పట్టుదల యెందులకు? ఆవిడ ఈ మధ్యఁ జాలపనులు స్వతంత్రించి చేయు చున్నది. నే నేమియు ననలేదు. ఆమెయందు మంత్రులకుఁ, బురోహితులకు, సేనానాయకులకు గౌరవమేర్పడినది. నేను మన్నారుదాసును చెఱలో పెట్టి నందులకే యామె చాల దుఃఖపడుచున్నది. ఆమెను నేను ప్రేమించక పోవచ్చును. కాని యామెను బట్టమహిషి కాదనుట యెట్లు? అది రాజ్య సంబంధమైన వ్యవహారము. ఆ యొక్క గ్రామము పోయినంతమాత్రమున నేమి? నీకు మఱల పది గ్రామము లిచ్చెదను.

రంగాజమ్మ: నాకేమియు నక్కఱలేదు.

రాజు: రంగాజీ! పట్టుఁబట్టకుము. నే నుండగా నీకు గ్రామము లెందుకు? ఆమెతో నీకుఁ బంతమేమిటి? ఆమె యపండితురాలు. నీవు పండితురాలవు. ఆమె వట్టి సామాన్యస్త్రీ. నీవు మహాకవయిత్రివి. ఆమె యూరుపేరులేని మానిసి. నీ వాంధ్రభాషయున్నంతకాలము పేరు శాశ్వతముగా నుండు మహామూర్తివి.

రంగాజమ్మ: ప్రభువులుమాత్ర మట్టివారుకారా? శ్రీకృష్ణదేవరాయల వారివలె శ్రీ విజయరాఘవనాయకులవారుకూడ నాంధ్ర సారస్వతములో మహా రాజమహాకవిగ నిలిచిపోదురు. సర్వజ్ఞ సింగమనీడు, వేమారెడ్డి, శ్రీకృష్ణదేవ రాయలు, శ్రీ విజయరాఘవనాయకులవారు, ఈ మహాప్రభువులు తెలుఁగు దేశమున కెంతచేసిరో తెనుఁగుభాషకు నంతఁజేసిరి. మీ రాచంద్రార్కము వర్ధిల్లుదురు. తెలుఁగుజాతికి మీరు పెట్టినది భిక్ష.

రాజు: కాని రంగాజమ్మా! ఈ ప్రభువు లెంతవారైనను విశ్వేశ్వర సరస్వతి, శ్రీనాథుఁడు, పెద్దన్న, రంగాజమ్మగార్లముందు నిలువలేరుగదా!

రంగాజమ్మ ప్రసన్నురాలైనది. విజయరాఘవనాయకుఁ డంతకంటెఁ బ్రసన్నుడైనాఁడు. తరువాత జరిగిన శృంగారములలో, మధురప్రసంగములో, రాజు రంగాజమ్మను పూర్వముచెప్పిన కవులతోఁ బోల్చుచు, వారందరిలో శ్రీనాథుఁడు గొప్పవాడనుచుఁ బ్రసంగించుచుండెను.

అప్పుడు రాజున కొక యూహ తోచెను. "మహారాణి తన్ను మన్నారు దాసును వరియించుమని యేల యడుగలేదు? రంగాజమ్మమీఁదఁ దనకుఁగల మాత్సర్యముచేత నడుగలేదు. తాను మరల నా దగ్గరకు రాలేదు. ఆమె కీ మాత్సర్యము నింకను వృద్ధిపఱచెదను. అప్పుడుగాని నా కోపము తీరదు."

విజయరాఘవనాయకుడు రంగాజమ్మతో నిట్లనెను:

"రంగా! నీకంటె శ్రీనాథుని గొప్పయేమి? ఆయనకుఁ గనకాభి షేకము జరిగెను. నీకు నేను జరిపింతును. చూడు మెట్లుందునో!"

రంగాజమ్మకన్నులు ప్రాతర్వికసితపయోజాత రామణీయకముఁ బుడ డించెను. ఆమెముంగురులు మనోజ్ఞామరశిఖాంతరేఖాసదృశము లయ్యెను. ఆమె చిబుకము రాజముద్రికవలె నుండెను.

౨౭

నాడు రంగాజమ్మగారి కనకాభిషేకము. విజయరాఘవనాయకులు సభ తీర్చియుండిరి. శ్రీనివాసతాతాచార్యులవారు, కోనేటి దీక్షితచంద్రకవి, పురుషోత్తమ దీక్షితులు, కామరుసు సోమయాజులు, కాళకవి మొదలుగ కవిపండిత బృందము వచ్చెను. తంజావూరునందలి యాబాలగోపాల మచటనే యున్నదని చెప్పవచ్చును. సభయంతయుఁ జిత్రవిచిత్రములుగ నలంకరింపఁబడియున్నది. మామిడితోరణములు పూలతోరణములు కట్టిరి. చికిలిముత్యపుమాలిక లచ్చటచ్చట వ్రేలాడఁదీయఁబడినవి. వానికిఁ జివరల రత్నములున్నవి. వాని కాంతులచే సభయంతయు దీప్తిమంతముగ నున్నది. ప్రభువు వచ్చినాఁడు. ఆయనవెనువెంటఁ జెంగమలదాసు వచ్చినాఁడు. మన్నారుదాసు రాలేదు. మన్నారుదాసును జెఱబెట్టినపిమ్మట నింత పెద్దసభ జరుగలేదు. నేఁడది జరుగబోవుచున్నది. మన్నారు బంధముక్తుఁడు కాలేదు. రాజు సింహాసన మలంకరించినాఁడు. మన్నారుదాసుని యాసనము వెలవెలఁబోవుచున్నది. చెంగమలుని కందుఁ గూర్చుండఁబెట్టవలయు ననిపించినది. కాని యటులఁ జేయలేదు. ప్రభు వేమనుకొనునో! సభ్యులేమందురో! రంగాజమ్మ తన యాసనమున ఠీవిగ నుపవిష్టయైనది. ఆమె పసుపుపచ్చని పట్టుచీరెగట్టి నల్లని ముఖమలు చమ్కీనక్షత్రములకంచుకము తొడిగి లేతముబ్బురంగు బంగరుపూలసేలువ కప్పికొనినది. ఆమెకనులు సాయంవికసితనీలకైరవమ్ములవలె నున్నవి. ఆమె పురివిప్పిన నెమలివలె విలాసముగ నాసీనయైయున్నది. ఆమెకు తనకు జరుగబోవు కనకాభిషేకమే కనులకుఁ గట్టుచున్నది. ఆమెకు సభలోనివారందరు కనుపించుటయేలేదు. ఆమెకన్నులు ఊర్ధ్వములై, సోగలై, అర్ధనిమీలితములై రమణీయముగ నున్నవి. ఆమెకనులకు రాజుమూర్తిమాత్రము కదలక స్థిరముగఁ గన్పడుచున్నది.

రంగాజమ్మ తన మన్నారుదాసవిలాసమునందుండి కొన్నిభాగములను చదివి వినిపించినది. రాజుకానాఁడు రంగాజమ్మ చదివెడితీరు చద్భుత మనిపించినది. ఆమె యిదివఱకెన్నఁడు నిట్లు చదువలే దనిపించినది. రంగాజమ్మవంక సన్నగఁ జూచినాఁడు. రంగాజమ్మ నయనము లుజ్జ్వలములైనవి. ఆమె పెదవులఁ గదలియుఁగదలని మందహాసమొకఁడు సన్ననిరేఖగ భాసించినది. ప్రభువునకు

రంగాజమ్మ సరస్వతి యనిపించినది. రాజు ద్వారముననున్న కపర్దినిని జూచినాఁడు. ఈమె యెందులకు వచ్చినదో! రాణి పంపియుండవచ్చును. కపర్దినికి సభలో కనిపించిన దొక్కవెలితి. అది మన్నారుదాసు రాకపోవుట. ఆ మహా సభాభవనమున నా యొక్క వెలితియాసనము వెక్కిరించినట్లుగ నున్నది. అమంగళముగఁగూడ నున్నది. రాణియే యీ నాఁడీ భవనమును దర్శించుచో నెటులుండెడిదో! ఆమె కోపాగ్నికీలల కీ భవనము దగ్ధమయ్యెడిది. ఆమె హృదయమున మన్నారును జెఱపెట్టుట యనునది యారనియగ్నిగ, తీరనిబాధగ నున్నది. ఏమైనను మహారాజున కిది తగదు. తనకొమరుకు, యువరాజు, బుద్ధిమంతుడు, పితృభక్తికలవాఁడునగు మన్నారును జెయిలోఁ బెట్టుటయేమి! అయిన నీనాడు విడువవలదా? కపర్దినిహృదయమున రంగాజమ్మయనిన కోపముగనున్నది. రాజునకు కపర్దినిరాక యనిష్టముగ నున్నది.

నాటి కార్యక్రమము ననుసరించి విజయనగరమునుండివచ్చిన యొక గొప్ప సంగీతవిద్వాంసుని పాటకచ్చేరీ జరిగినది. ఆ విద్వాంసుఁడు వీణ వాయించుటయం దసమానుఁడు. ఆయన వీణమీఁద మృదుమధురముగ గానముఁ జేసినాఁడు. వీణానిక్వాణములు సభయెల్ల మెల్లమెల్లగ ప్రాతర్మందానిలమువలె తారాడి యొక ప్రశాంతవాతావరణము సృష్టించినవి. సభ్యులందరిమనసము లానందమున మునుకలెత్తినవి. వీణవాయించుటయం దతఁడంత నేర్పరి. రంగాజమ్మ కా వీణాతంత్రులనుండి వెలువడు మధురధ్వని పులకలెత్తించినది. ఆమె తన్మయత్వమునందినది. ఆమెయు వీణవాయించుటయందు నేర్పరి. తాను తంజావూరు వచ్చినపిమ్మట వీణ మ్రోయించుట తగ్గినది. తనదృష్టి సంగీతమునుండి సాహిత్యమునకు మరలినది. సంగీతము మూలపడినది. ఇన్ని వత్సరములుగఁ గప్పివేయఁబడిన యామె సంగీతభావమున కీనా డీయన సంగీతము దోహదమొనర్చినది. ఆమె నేడు పరిపూర్ణానందస్వరూపిణి.

తరువాత చంద్రరేఖనృత్యము. ఆమెకు నీ సందర్భమున నృత్యము చేయుట కిష్టములేదు. కాని తానేమనును? ప్రభువడుగుచున్నాఁడు. చేయక తప్పదు. ఆమె తన కతిప్రీతికరమగు నందికేశ్వరనృత్యము నభినయించినది. ఆ నాడు చంద్రరేఖ తన యభినయచాతుర్యమంతయుఁ జూపించవలయునని యనుకొన్నది. ఆమె తొలుత సామాన్యముగనే యారంభించెను. కొంతసేపటి

కలసిపోయినట్లు నటించి మనోహరముగ శ్రమస్వేదబిందువులు ముఖమునందు ప్రకాశించుచుండగఁ బొడవైనశ్వాస వదలుచు నృత్తముచేయుచు నడుమనడుమ నాలుగైదుసంగతులువేసి సభాసమ్మోహనకరముగ నోట ననుచుండెను. "తగ్గు, జగ్గు, సొల్లు, ప్రాకృరిత్యక్తిర్యగాదిసమయములందు శిరస్సు, కనులు, కనుబొమలు, ముక్కు, క్రీపెదవి, కంఠము, వక్షస్సు, నడుము—వీనియొక్క చాలనభేదములచేతఁ జూచువారికి చిత్రప్రతిమవలెఁ గనుపించినది. ఆమె పాదములకు వంద గజ్జలదండలు కట్టుకొన్నది. కాని యొక్కొక్కసారి పాదములు నేలమీఁదనాన్చినచోఁ బదిగజ్జెలే మ్రోగును. మరియొక్కసారి నాల్గు గజ్జెలే మ్రోగును. ఇంకొకసారి యొక్కగజ్జెయే మ్రోగును. ఆమె పదవిన్యాసము రసజ్ఞులైన పండితుల హృదయములయం దచ్చెరువు గలిగించినది. చరణమన్నంతసేపు చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండాది జాతులు కలసిన యొకజాతిలో నటించి, ముక్తాయింపు మరియొకజాతిలోచేసి చరణముచివర రెండుమూడు ముక్తాయింపు లిచ్చుచుండెను. వానిలోఁ జివరి ముక్తాయింపు మిక్కిలి దురముగా నిచ్చుచుండెను. మఱియు నభినయములో విరహేర్ష్యానుతాపాదిభావములు భాసించునట్లు నయనిష్ఠురాపి సంగతులువేసి పాడుచుండెను. ఆమె ఈ నాటి యభినయము దేవతానాట్యమువలె నున్నది. ఆమె యారువిధములైన నాట్యములను ప్రదర్శించెను. ఆరు శిరోభేదములను, పదమూడు నేత్రభేదములను, అయిదు భ్రూభేదములను, రెండు నాసాచలనభేదములను, మూడు అధరోష్ఠచాలనభేదములను, అయిదు హసితభేదములను, నాల్గు కంఠభేదములను, పదునారు హస్తకరణములను, పంతొమ్మిది పాదకర్మభేదములను చూపించెను. ఎప్పుడే భేదమును జూపుచున్నదో భరతశాస్త్రజ్ఞానమును, తదనుభవమును సంపూర్ణముగ కలిగియున్న విజయరాఘవనాయకునకుఁ గూడ తెలిసికొనుట దుర్ఘటముగ నుండెను. ఎప్పుడే చాలనము భావోద్బోధకముగ సమకూర్చుచున్నదో తెలిసికొనుట కష్టముగనున్నది. ఆమెయురశ్చాలనభేదములు, కట్యూరు చాలనభేదములు చూచుచున్న రాజుమనస్సు రంగాజమ్మమీఁద విరక్తి కలిగించుచున్నది. ఆమెకు వంతపాఠకులు వైణికుఁడొకఁడు; గాయకుఁడొకఁడు; మార్దంగికుఁడొకఁడు. వారు ముప్వురు చంద్రరేఖానాట్యమును వందగుణములుదీపింపఁజేసిరి. వైణికు డెడమచేతనే తంత్రినిమీటి యెడమ

చేతనే స్వరము లణచుచుండెను. పాటయొక్క యక్షరాక్షరమునకే మీటు వేసి సంగతిగమకమునకు మీటువేయకుండ సంగతిని వాయించుచుండెను. ప్రక్కతంత్రుల మీఁద శ్రుతిమీటు వేయకుండ, ఓమ్మనుశబ్దము పుట్టకుండ మెత్తగ వేలిపొట్టతో లోమీటు మీటి గమకములుపట్టి వీణాధ్వని చంద్రరేఖ నోటిపాటతో జోడించుచుండెను. గాయకుఁడు చంద్రరేఖ యలసియున్నపుడు, నోటపాటననిసయప్పుడు తా నామెకంఠధ్వనివంటి ధ్వనితో నామెయభినయించు చిన్నభావము వేయివిధముల నుద్దీపిత మగునట్లు సంగతులువేయుచు పాడు చుండెను. మార్దంగికుఁడు చంద్రరేఖ పాడుచున్నకీర్తన కనుగుణముగ వాయించుచు తన పాండిత్యమును చూపించుచునే యుండెను. చంద్రరేఖ పాడుచున్న కీర్తన మిశ్రజాతిత్రిపుటతాళముమీఁద నడచుచున్నది. అతఁడు మద్దెలమీఁద ఖండజాతిత్రిపుటతాళములో వాయించుచుండెను. సభయంతయు తప్పువాయించుచున్నాడని కనుబొమలు ముడిచిరి. గీతము చివరముట్టువరకు నామద్దెలకాఁడు నక్షరములపంపకము సరిపెట్టి చూపించగ నందఱును నివ్వెర పోయిరి.

ఆమెనాట్యము సరిగ నొకజాముచేసెను. నాట్యావసానమున జనమెల్లరు మహానందమగ్నులైరి. మహాశ్చర్యమును బొందిరి. సభలో వేయిగుసగుసలు బయలుదేరినవి. చంద్రరేఖకుగూడఁ గనకాభిషేకముఁ జేయవలెనన్నమాటలు రాజుచెవిదాక వచ్చినవి.

రంగాజమ్మకనకాభిషేక మారంభింపబడినది. ఒక బంగరు తట్టనిండుగ బంగరుపూలు తేఁబడినవి. ఒక్కొక్కపుష్ప మొక్కొక్క దీనారముతోఁ జేయఁబడినవి. అట్టివి వేయిదీనారములతోఁ జేసిన పూలున్నవి. వానితోపాటు మామూలుపూలను కలిపిరి. ప్రథమమున ప్రభు వాసనమునుండి లేచి పది బంగరుపూలు తీసి రంగాజమ్మ శిరసున నుంచెను. రంగాజమ్మకనులు రాజు కన్నులఁ గలసినవి. ఆమె కన్నులలో మహానందము వెల్లివిరియుచున్నది. రాజామె చూపునకుఁ బులకితుఁడైనాఁడు. తరువాత రాజపురోహితుఁడు మంత్ర ములఁ బఠించుచుఁ నొకదోసెడుపూల నామె నభిషేకించెను. ఆపిమ్మట వరు సగఁ గవులంద రామెను పూలతో నభిషిక్తను చేసిరి. ఇంకను నొకకొన్ని పూ లున్నవి. వాని నిరువురు యువతులు రంగాజమ్మకిరువైపుల నిలిచి వృష్టిగ

నామెమీఁదఁ గురిపించిరి. ఆ బంగారుపువ్వు లామె రత్నకంకణములలో ప్రతిఫలించి యరుణోదయరేఖలవలె భాసించినవి. ఆమెనీలమణులహారమున కలసి నీలమేఘమునందు విద్యుల్లేఖలవలె నున్నవి. ఆమె మంగామురములమీఁద, రతనాలచెంపు, వజ్రాలసరులు, కిరీటి, బవిరి, బన్నసరులు, పచ్చతాపలకల పాదపల్లవములు, గిలుకు మట్టియలు, అందియలు, కర్ణతాటంకములు, ముత్యాల కంటె, సందిదండలు, ముత్యాలముక్కెర, గంటలమొలనూలు, వడ్డాణము, రత్నపుటుంగరముమీఁద నాట్యమాడి చిత్రచిత్రములుగఁ గాంతులీనినవి. రంగాజమ్మ యూర్ధ్వలోకమున విహరించుచున్న ట్లున్నది. ఆమె కా సభ మహేంద్రసభ, విజయరాఘవనాయకుడు సురేంద్రుడు, తా నూర్వశివలె ననిపించినది. ఆమె మనస్సంతయు మధురభావముల ప్రోవై పోయినది. ఆమెకన్నులు విజయానందసూచకముగ తళతళ మెఱయుచున్నవి. శ్రీనివాసతాతాచార్యులవారు లేచి యిట్లనిరి: "ఈ రంగాజమ్మ మహాకవయిత్రి. ఈమె శృంగారరసమును మహాద్భుతముగఁ బోషించినది. శృంగారరసవిషయమున శ్రీనాథునితో నీమెను బోల్చవలెను. కనకాభిషేక మానాఁడు శ్రీనాథునికే చెల్లినది. ఈనా డీ రంగాజమ్మకే చెల్లినది. ప్రభువులు రసజ్ఞశేఖరులు. కావుననే రంగాజమ్మగారికిఁ గనకాభిషేకము సల్పిరి."

పురుషో : రంగాజమ్మగారు శ్రీనాథునిగూడ కొన్నివిషయములం దధిగమించినటుల గన్పడును. శృంగారము నీమె రచించినంత సుందరముగ, మధురమధురముగ నింతవఱ కెవ్వరును రచించలేదు. ఈవిషయము ప్రభువులకు సువిదితము. అందువలననే రంగాజమ్మగారికి గనకాభిషేకము సల్పిరి.

కోనేటి : రంగాజమ్మగా రొక్క-శృంగారరసమునే కాదు, నవరసముల యందునను నాయారసముల కనుగుణముగ సుందరముగ వ్రాయును. ఈమె తనరచనలో ప్రాధాన్యము శృంగారమున కిచ్చినది. ఈమెపద్యరచనావైశిష్ట్య మొరులకబ్బనిది. ఈమెశైలి మృదువుగ, నద్భుతముగ, మనోహరముగ నుండును. ఈమె మెత్తనిపదములను సుందరముగఁ దనశైలియం దిమిడ్చి వ్రాసికొనును. ఈమె పదలాలిత్య మమోఘము. ప్రభువులు కవిసత్తములు, కావుననే రంగాజమ్మగారికిఁ గనకాభిషేకముసల్పిరి.

కాళకవి : రంగాజమ్మగారు కేవలము సరస్వతి యపరావతార మనిపించు చున్నది. ఈమె యుషాపరిణయప్రబంధ ముత్తమమైనది. ఈమె ద్రాక్షాపాక మున సుమధురముగఁ బద్యరచనసల్పినది. అది మనయాస్థానప్రబంధము లన్నిటియందును దలమానికమువోలె ప్రకాశించును. ప్రబంధకవిత్వ రచనా పటిష్ఠులగు ప్రభువులకు రంగాజమ్మగారి యుషాపరిణయ ప్రబంధవైశిష్ట్యము బాగుగతెలియును. కావుననే రంగాజమ్మగారికిఁ గనకాభిషేకముసల్పిరి.

కామరుసు : రంగాజమ్మగారు యక్షగానముల రచించుటయం దసమా నురాలు. ఈమె మన్నారుదాసవిలాసయక్షగాన మీమెయక్షగానములలోనెల్లఁ బరమోత్కృష్టమైనది. ఈమె యక్షగాన రచనాప్రౌఢియంతయు దానిలోఁ జొప్పించి వ్రాసినది. అట్లువ్రాయుట యామెకే చెల్లును. యక్షగానరచనా ప్రవీణులైన ప్రభువులను రంగాజమ్మగారి యక్షగానరచనయొక్క యౌత్కృ ష్ట్యము ముగ్ధమొనర్చి యుండును. కావుననే రంగాజమ్మగారికిఁ గనకాభిషేకము సల్పిరి.

సభలో రకరకములుగ ప్రశంసలు బయలుదేరినవి. రంగాజమ్మకుఁ దాను సభలో నున్నదనుజ్ఞానము లేకుండనున్నది. ఆమె యొడ లామెకు తెలియుటలేదు. కవులు చెప్పుమాటలు వినిపించుటలేదు. సభలోని ప్రశంసలు వినుపించుటలేదు. ఆమె మహానందస్థితియందున్నది. విజయరాఘవనాయకుఁడు లేచి యిట్లనినాడు : "రంగాజమ్మకు మేము పది గ్రామములను బహూకరించు చున్నాము. ఈమె యొకగ్రామ మీమధ్య కారణాంతరములచేత నీమెనుండి చ్యుతమైనది. దానికి బదులుగ మేము పది గ్రామముల నీయ నిశ్చయించితిమి." ప్రభు వొక దీర్ఘరమణీయాష్టాపదదామమును విలువైనరత్నములు చెక్కఁబడి ముద్దులు గుల్కుచున్నదాని నామె కంఠమున వైచినాడు. రంగాజమ్మ కా హారస్పర్శ కితకితలు వెట్టినట్లైనది. ఆమెకు రోమాంచ మొదవినది. ఆమె నిలువెల్ల మధురలజ్జాసమన్విత మహానందమూర్తి యైనది. ఆమె నేత్రముల నుండి హిమశీతలములై చిట్టి ముత్యములవోలిన రెండు కన్నీటి బొట్లు తొంగి చూచినవి. అవి యొరులకుఁ గానరానివి. అవి రత్నహారమున ప్రతిఫలించి మెఱసినవి. ప్రభువు పరికించినాడు. ఆయన తృప్తినందినాడు. ఆయన

యానందమున కవధిలేకుండ నున్నది. ఆయనలోఁ జంద్రరేఖ నృత్యము, రంగాజమ్మ తృప్తి విచిత్రమగు నానందమునకుఁ దావిచ్చినవి. రాజు రంగాజమ్మ మెడలో నా మహాసభయందు హారమువైచుట చంద్రరేఖకుఁ గపర్దినికిఁ గష్ట ముగ విచిత్రముగ నున్నది. కపర్దిని కన్నులు చిత్రముగ వెలుఁగొందినవి. రాజు చూచినాఁడు. కపర్దినితో సంభాషించవలె ననుకొనినాఁడు.

రాజంతట సింహాసనమునకు దక్షిణ భాగమునసున్న యొక చిన్న మంటపములోనికి విశ్రమించుటకేగెను. ఆయన యచటనున్న యొక యాసన మున నుపవిష్టుడైనాఁడు. రంగాజమ్మ తన్నభిషేకించిన పూలను దోసిళ్ళుగ కవులకుఁ బంచిపెట్టినది. మిగిలినవి సభికులకుఁ బంచ నియమించినది. రాజు నకు సభయంతయుఁ గన్పడును. రాజు సభ్యులకుఁ గనిపించఁడు. సభ్యు లందరు రంగాజమ్మను వేనోళ్లఁ బొగడిరి. సభ ముగిసినది. జనులందరు వెడలిపోయిరి. రంగాజమ్మ లేచి రాజువద్దకు వచ్చినది. రా జామెను జూచి నాఁడు. ఆమె కన్నులు మణిదీపములవలె వెలుగుచున్నవి. ఆమె రాజునకు నమస్కరించినది. ఆ నమస్కరించుటలో రాజునకు సర్వనృత్య భంగిమములు దర్శించినట్లైనది. ఆ నమస్కరించునప్పటి యామె నిలబడు భంగిమ రాజును ముగ్ధు నొనర్చినది. కాని రాజు మాటాడలేదు. ఆయన మనమున చంద్రరేఖయు రంగాజమ్మయు నొకరి తరువాత నొకరుగఁ దిరిగి తిరిగి రా మొదలుపెట్టిరి. రంగాజమ్మ వెడలిపోయినది. రాజు రంగాజమ్మ పోవుదెసకుఁ జూచినాఁడు రంగాజమ్మ పోవుచుండగాఁ దానేమియు మాటాడలేదు. ఆయన కాశ్చర్యముగ నున్నది. రంగాజమ్మ దూరమునఁబోవుచు మెరుపువలెఁ గనిపించినది. రంగాజమ్మ వద్ద కీనాడు తప్పకపోవలె ననుకొనినాఁడు ప్రభువు. వెంకన్న కనుపించి నాఁడు. రాజువద్దకు వచ్చినాఁడు.

రాజు : వెంకన్నా ! నేటిసభ యెట్లున్నది ? చంద్రరేఖ నాట్యాభినయ మెట్లున్నది ?

వెంకన్న మొగమున నానందము మెఱయుచున్నది.

వెంకన్న : ప్రభువులకు నే నేమి చెప్పుదును ? మీకుఁ దెలియని దున్నదా ? ఈనాటి సభ మహాద్భుతముగ నున్నది.

రాజు : వెంకన్నా ! నీవు మా యాస్థానమునకుఁ జంద్రరేఖవంటి నాట్యకత్తియను దెచ్చిపెట్టితివి. నీ మేలు మరువఁజాలము.

వెంకన్న : మహాప్రభూ ! చంద్రరేఖ యదృష్టవతి. మీవంటి ప్రభువుల యాస్థానమున నామెకు స్థానము కల్గుట సామాన్యమా ?

ప్రభువు మాటాడలేదు. చంద్రరేఖ నృత్యమునందాబద్ధుడైన ప్రభువున కానాడు వెంకన్నమీఁద నిదివఱకున్న నిసుమంత కోపమును లేకుండ చేసినది. వెంకన్న వెడలిపోయినాడు. కపర్దినిని రాజు పిలువనంపినాఁడు. కపర్దిని వచ్చినది. ఆమె మొగము నీరసముగ నున్నది.

కపర్దిని : మహాప్రభూ ! నన్నుఁ బిలువనంపినారు ?

రాజు : కపర్దినీ ! వచ్చితివా ? ఈనాటి సభ యెట్లున్నది ?

కపర్దిని : ప్రభూ నాకేమి తెలియును.

రాజు : మీ మహారాణి సభకు రాకూడదా ?

కపర్దిని ; ఆమెను రమ్మనినదెవరు ?

రాజు ; సభకు పిలువవలయునా ? మమ్మెవరు పిలిచిరి ?

కపర్దిని మాటాడలేదు.

రాజు : మేము రంగాజమ్మకుఁ బదిగ్రామము లిచ్చితిమి. మహారాణుల కిష్టమే యనుకొందుము.

కపర్దిని మాటాడలేదు. రాజు లేచినాఁడు. అస్తమిత సూర్యుని యరుణ కాంతులు రంగాజమ్మ సిగ్గిలిన కపోలకాంతులవలె నున్నవి రాజునకు. కపర్దిని వెడలిపోయినది. నాటి రాత్రి రంగాజమ్మ రచియించిన మన్నారుదాసు విలాసమను యక్షగానమును గూచిపూడివారు ప్రదర్శించిరి. ఆ నాటకము మూలముగ రంగాజమ్మ యింటికిఁ బోవలెననుకొనిన ప్రభువున కంతరాయము కల్గినది.

౧౮

రాయసము వెంకన్న తన గృహమున నొక యాసనమునఁ గూరుచుండి యోజించుచుండెను. తాను మధుర పోవలెనని ప్రయత్నించుచున్నాడు. రెండు

మూఁడుమారులు పోవుటకుఁ బ్రయత్నించినాఁడు. కాని విఫలము లగుచున్నవి. పగలు ప్రయాణము సాగుట దుర్లభ మనుకొనినాఁడు. ఒకనాఁ డర్ధరాత్రమున బయలుదేరినాఁడు. నగరము పొలిమేర దాఁటువరకు నిరువురువ్యక్తులు ఖడ్గ పాణులు, భయంకరాకారులు, నల్లని దుస్తులు ధరించినవారు కనిపించి తన్ను గద్దించి నిలిపిరి; "నీ వెచటికిఁ బోవుచున్నావో మాకుఁ దెలియును. నీయాట లిక్కడ చెల్లివచ్చుటకువీలులేదు. రాత్రియైనచోఁ బోవచ్చుననుకొంటివి కాఁబోలును; ప్రాణములపై నాసగలదేని తిరిగి వచ్చినదారిని సూటిగఁ బొమ్ము. లేదేని చెడిపోఁగలఁవు. యోజించుకొనుము?" తా నేమియుఁ జేయఁజాలకపోయెను. తిరిగివచ్చెను. పెనుగొండ కొకనిఁబంపినాఁడు. ఆ పంపు టతిరహస్యముగ జరిగినది. మధురకుఁగూడ నట్లే పంపవలయు ననుకొనినాఁడు. ప్రయత్నించినాఁడు. ఫలితము శూన్యమైనది. ఎప్పటికప్పు డేదో యాటంకము కలుగుచునే యున్నది. దీని కంతకుఁ గారణమువెంకన్నకుఁ దెలియకుండ నున్నది. ఫలోన్ముఖములగుచున్న వనుకొన్న తన మనోరథము లిట్లు వికలములగుటకుఁ జాలచింతించు చున్నాఁడు. ఎటులైన మధుర పోవలెను. మధురనాయకునితో సంప్రతించవలసిన విషయములు లెక్కకు మించి యున్నవి. మధురవెళ్ళి చాలకాలమైనది. తానిప్పటికే వెళ్ళియుండవలసినది. ఆలస్యమైనది. తన ప్రయత్నము లిట్లగుచున్నవి. యేమి చేయవలెనో తోచుట లేదు. అతనికిఁ దల తిరిగిపోవుచున్నది. చంద్రరేఖ వచ్చుటాదిగ నేటి వఱకుఁ దనమాట కెదురాడువారు లేకుండ నడచినది. కాని కాలము మారి నట్లుగ నున్నది. తనమాట సాగుటలేదు. తనశక్తినిఁ బ్రతిఘటించు శక్తి మరియొకటి రాజ్యమున వెలసినది. తన యాటలు సాగివచ్చుటలేదు. ఆశక్తి నెదుర్కొనుట తనకుఁ జేతకానిదిగ నున్నది. అతని కన్ను లాలోచనా రక్తములైనవి. గవాక్షముగుండ నాకసము వంకఁ జూచినాడు. శూన్యముగ దూరముగ రెండు నల్లని మబ్బు లొకదాని కొకటి యెదురుగ ద్వంద్వ యుద్ధము చేయుచున్నటులున్నవి. కొంత తడవున కొక మబ్బు విచ్చిపోయినది. వెంకన్న మొగమున నిరాశ పొడమినది. తలక్రిందికి దించికొని ఫాలమును జేతితో నదుముకొనినాఁడు. బయట నెండ చెరచెర వచ్చినది. గవాక్షముగుండ వెంకన్న మొగమునఁ బడినది. వెంకన్న నల్లనిమొగ మాయెండలో

వికృతముగ మెఱసినది. వెంకన్న తలయెత్తినాఁడు. ఎదురుగ నొకభటుఁడు నిలిచియున్నాఁడు. వెంకన్న హృదయము కలగుండుపడినది. అతఁడు రాణి పంపున వచ్చినవాఁడు. వెంకన్నకు రాణిని దలచుకొనిన నొడలు జలదరించినది. అతని కన్నులయెదుట కైజారు పదును చూచుచుఁ దనవంకఁ గ్రూరముగఁ జూచుచు నిలుచున్న రాణి దర్శనమొసగినటులైనది. నిలువెల్ల వణఁకినాఁడు.

భటుడు : వెంకన్నగారూ ! మహారాణిగారు మిమ్ములనొక పర్యాయ మామెమందిరమునకు రావలయునని చెప్పుమన్నారు.

వెంకన్న 'వచ్చుచుంటి' ననిచెప్పు మని భటునిబంపినాఁడు. అటులని యాతనితోఁ జెప్పెనేకాని వెంకన్నకు రాణివద్దకుఁబోవుటయన్న నేదో యాందోళనగ, భయముగ నున్నది. కాని రాణియాజ్ఞ. రాజాజ్ఞకన్న బలమైనయాజ్ఞ. పోనేవలయును.

మధ్యాహ్నమునకు వెంకన్న రాజగోపాలాంబికామందిరమునకుఁ బోయినాఁడు. రాణి తనపరిజనమునంతయు నొక్కరులేకుండఁ బంపివేసినది. మిగిలిన దొక్క వెంకన్నయుఁ దాను మాత్రమే. వెంకన్నకీనాడు రాణినిజూడగనే భయమే మొదట కలిగినది. ఆయన కీనాడు ప్రత్యేకముగ రాణికన్నులలో బలీయమగు క్రూరత్వాధికారముద్ర యొకటు భాసించినది. అది యిదమిత్థమని వెంకన్నకుఁ దెలియరాకుండ నున్నది.

రాణి : వెంకన్నగారూ ! మీరు నిన్నటిసభకు వెళ్ళినారా ?

వెంకన్న : వెళ్ళితిని, మహారాణీ !

రాణి : రంగాజమ్మకుఁ గనకాభిషేకము బాగుగజరిగినదనుకొందును.

వెంకన్న : అవును, చాలనద్భుతముగ జరిగినది.

రాణి : అయినచో వెంకన్నగారూ ! మన యాస్థానమున రంగాజమ్మగారినిమించిన కవయిత్రులు లేరా ?

వెంకన్న : లేకేమి, మహారాణీ ! కృష్ణాజమ్మ యున్నదికద :

రాణి : రంగాజమ్మకే కనకాభిషేకముచేయుట యెందులకు ?

వెంకన్న : నాకేమి తెలియును ? మహారాణీ !

రాణి : చంద్రరేఖ నృత్య మద్భుతముగ నున్నదని వింటిమి?

వెంకన్న : అవు నటులనే యున్నది.

రాణి తలపంకించినది. తన క్రిందిపెదవి కుడివైపునకుఁ ద్రోసి పంటితో నదిమిపట్టినది.

రాణి : ప్రభువు మిమ్ము ప్రశంసించలేదా ?

వెంకన్న : ప్రశంసించినారు.

రాణి : నిన్నఁ ప్రభువు రంగాజమ్మకుఁ బదిగ్రామములు దయచేసిరట ?

వెంకన్న : అవును. పదిగ్రామముల నిచ్చిరి.

రాణి : తాము స్వయముగ రత్నహార మామెమెడలో వైచిరా ?

వెంకన్న : వైచినారు.

రాణి కన్నులు నిప్పు లుమియుచున్నవి. ఆమెమొగ మెఱ్ఱవారినది.

రాణి : రాజుగారు నిన్న రంగాజమ్మయింటికిఁ బోయినారా ?

వెంకన్న : లేదు. వెళ్ళలేదు.

రాణి : ఎందువలన ?

వెంకన్న : నిన్న రాత్రి కూచిపూడి భాగవతులు రంగాజమ్మగారి మన్నారుదాసవిలాస యక్షగానమును బ్రదర్శించిరి. ప్రభువును, రంగాజమ్మ గారును గొంతసేపు నాటకముఁజూచి తమ సదనమునకుఁబోద మనుకొని లేచిరి. అప్పుడు నాటకసంఘమువారిపెద్ద వచ్చి ప్రభువులను "తమరు భరత శాస్త్రపారంగతులు. తమకు మావిద్యఁ జూపుద మని వచ్చినాము. తాము మాకుఁ బ్రోత్సాహమును కలిగింతు రను నాసచే వచ్చినాము. ప్రభువులు వెడలిపోవుచో మా కుత్సాహము నశించిపోవును. దయయుంచు" డనిరి. అందువలన వారిరువురుఁ దెల్లవారువఱకు నాటకశాలలోనే యుండిపోయిరి.

రాణి : ఓహో ! అటులనా ? అయిన మీరు నేడే మా పనిని జేసిపెట్ట వలెను.

వెంకన్న గుండెలో రాయిపడినది.

వెంకన్న : ఆ పని యింత సులభముగా నింత త్వరితముగా సాధ్యమగునా ? మహారాణీ !

రాణి : అది మాకుఁ దెలియదు. మీరు నేడే చేయవలయును.

వెంకన్న : మహారాణీ ! క్షమింపవలయును. ఆ కార్య మింతస్వల్ప కాలమున సాధ్యమగుట..........

రాణి : అవును. వెంకన్నగారూ ! ఒక రాజ్యముపైకి మరియొక రాజ్యమును దండెత్తించుటయన్న కష్టతరమైనదికదా ? అందువలన దుస్సాధ్యము కాబోలు !

వెంకన్న నిర్విణ్ణుడైనాఁడు. ఆతనిమొగమునఁ గత్తివాటునకు నెత్తురు చుక్క మిగులకుండనైనది. రాణి యాతని ముఖలక్షణముల నతిజాగ్రత్తగ పరిశీలించుచున్నది. వెంకన్న మనమున రాణి ప్రచండురాలు. ఈమె ప్రతిభ ముందు తన ప్రతిభ గుడ్డిగవ్వకుఁ గొరగాకుండ నున్న దనుకొనినాఁడు.

రాణి : ఏమాలోచించుచున్నారు ? మీ కీపని యీనాడు సాధ్యము కానిదా ? హృదయమును దరచిచూచుకొనుఁడు. అవసరమైనచో సోమయాజులు గారు తెచ్చిన యుత్తరములు తీసికొనుఁడు.

వెంకన్న కేమియుఁ బాలుపోవుటలేదు. తలదించుకొని నేలఁజూచుచున్నాఁడు.

రాణి : మీరీనా డీపని చేయుదురేని రేపురాత్రికి మీరు మీయిచ్చవచ్చిన యూ రేగవచ్చును.

వెంకన్న రాణిప్రజ్ఞ కాశ్చర్య మందినాఁడు. తన ప్రయాణపుసంగతి యీమె కెట్లు తెలిసినది ! తన్నడ్డగించిన వారీమె సేవకులై యుందురు. లోకములో నీమె కెదిరిశక్తిలేదు.

వెంకన్న : ఊరికి వెళ్ళుటయేమి ?

రాణి : మమ్ముఁగికురింపఁజూడకుఁడు. మీ యూహలు మాకుఁ దెలియును. మీ ప్రయాణములను దెలియును.

వెంకన్న దిగ్భ్రాంతుఁడైనాఁడు. "ఈమె చండీస్వరూపిణి. ఈమెకు

నేను పెనుగొండకుఁ గబుదపంపుటకూడ తెలియును. తెలిసియే యూరకున్నది. మధురమాత్రము పోనివ్వలేదు. ఈమె తలచుకొనినచో సాధింపఁజాలని కార్యమే లేదు. నా యదృష్టముకొలఁది రాజు విజయరాఘవనాయకుఁ డైనాడు. రాణి యీమె యైనది. మన్నారుదాసు చెఱసాలలో నుండుటకూడ యదృష్టమే" యను కొనినాఁడు.

రాణి : ఏమందురు ?

రాణి మాటాడునప్పటి ముఖవైఖరిఁజూచి వెంకన్న, చిత్తమటులే యొనర్తు ననివాడు. రాణియొద్ద సెలవు తీసికొని వెంకన్న వెడలిపోయినాఁడు.

ప్రొద్దు వాటారినది. సూర్యుఁడు సంపూర్ణముగ నస్తమించినాఁడు. పశ్చిమదిక్కున మాత్రము కాలారుణముగ నున్నది. ప్రభువు రంగాజమ్మ సదనమునకుఁ బోవుద మనుకొనినాఁడు. గత దినమున నాటకము మూలముగఁ బడినదికాదు. ఆయన మనస్సంతయు రంగాజమ్మ భావనలతో నుక్కిరిబిక్కిరిగ నానందమయముగ నున్నది. కనకాభిషేక మైనతరువాతఁ దాను రంగాజమ్మను సరిగఁ జూడనైన లేదు. ఆమె యేమనుకొనినదో! ఎట్లున్నదో! తనతో నెట్లు మాటలాడునో! అంతయు విచిత్రముగ నుండును. తాను రంగాజమ్మవద్దకుఁ బోవును. రంగాజమ్మ తన్నెంత గౌరవించును! ఆమె తాను నిన్నవైచినహార ముంచుకొనును. ఆ హార మామె కుంచనపు చాయగల శరీరమున నెంత సుందరముగ నున్నది! రంగాజమ్మ తనకొఱకుఁ బ్రతీక్ష సేయుచుండును. స్నానమునకు వేళ యగుచున్నది. రాజు రంగాజమ్మ భావనయే చేయుచున్నాఁడు. రాయసము వెంకన్న వచ్చినాఁడు. వచ్చినపని యేమని ప్రభువు వెంకన్న నడిగినాఁడు.

వెంకన్న : ప్రభూ! నాకేమి పనులున్నవి ? తమ దర్శనముకొఱ కెవరో వచ్చిరి.

ప్రభువు : ఎవరువారు ?

వెంకన్న : వారు తల్లికొడుకులు ప్రభూ!

ప్రభువు : తల్లియుఁ గొడుకునా ? తీసికొని రమ్మనుము.

విజయరాఘవనాయకుఁడు పీఠెప రనుకొనినాఁడు. తల్లికొడుకులిరువురు

లోని కడుగిడిరి. ప్రభువునకు నమస్కరించిరి. అక్కడఁ బరువబడియున్న రత్నకంబళముపై నాసీనులైరి. తల్లి పలితకేశిని సుమారు డెబ్బదియేండ్లుండ వచ్చును. ఆమె దేహమంతయు ముడుతలు వడియున్నది. ఆమె యొడలు వణకుచున్నది. ధరించినవి తెల్లని యుడుపులు. ఆభరణము లేమియు లేవు. తిలకహీనగ నున్నది. ఆ కొడుకునకు నలువదియేండ్లు. బలిష్ఠుఁడుగ, నల్లగ, వికారిగ నున్నాఁడు. అతఁడు సోమరియని యాతని కన్నులబరువే సూచించు చున్నవి. అతని దుస్తులుఁగూడ మాసియున్నవి. జుత్తంతయుఁ జెల్లచెదురుగ నున్నది.

ప్రభువు : మీకు మాపద్దఁ బనియేమున్నది ? మా దర్శనమువలన మీకుఁ గావలయునదేమి ?

వృద్ధ : మహాప్రభూ ! మాది పెనుగొండ. చాల సంవత్సరములక్రిందట ప్రభువుల తండ్రిగారైన శ్రీరఘునాథనాయకులవారు మామీఁద దయగలిగి తంజాపూరు సంస్థానమున మాకొకగ్రామ మిత్తుమనినారు. మేము "మహా ప్రభూ! మా నివాసస్థల మదికాదు. విజయనగరరాజుల రాజ్యములోనిదైన పెనుగొండ. అచట దగ్గఱలోనున్న యేదేని గ్రామ మిప్పించు" డని కోరితిమి. అందులకుఁ ప్రభువులంగీకరించి శ్రీ వేంకటపతిరాయలవారితో సంప్రతించి మాకుఁ గ్రామము నొసఁగిరి. ప్రతియేడును తంజాపూరు సంస్థానమునుండి పెనుగొండ కా గ్రామముమీఁదఁ గొంతధనముఁ గట్టునటుల నేర్పాటు గావించు కొనిరి. కొన్ని యేండ్లటులనే జరిగినవి. కాని పదునేనేండ్లుగఁ దంజాపుర సంస్థానమునుండి వారి కా గ్రామముమీఁద శిస్తు చెల్లుటలేదట.• శ్రీరంగరాయల వారు మా గ్రామమును దీసికొనెద మనుచున్నారు. తంజాపూరునుండి పదునే నేండ్లకైన శిస్తులు తమకుఁ జెల్లించుచో నేమియు మాటాడరట ప్రభూ ! మీ దయ. మమ్మేమి చేయుదురో ప్రభువులు. ఇదిగో గ్రామమును దానము చేసి నప్పటి పత్రములు.

విజయరాఘవనాయకుడు వానినిఁ బరిశీలించినాఁడు. వానిమీఁద తంజాపుర రాజముద్ర స్పష్టముగ నున్నది. విజయరాఘవ నాయకునికంతయు నగమ్యాగోచరముగ నున్నది. తన తండ్రిగారు వీరికి గ్రామము నిచ్చుటయేమి

పెనుగొండయేమి! తమ సంస్థానము శిస్తురిచ్చుట, పదునేనేండ్లనుండి యీయుం డుట యిదియెంతయు నాశ్చర్యముగ నున్నది. తనకీ వృత్తాంతమే తెలియదు.

ప్రభువు: మా నాయనగారు మీకు గ్రామము నొసగిరా? కారణమేమైన నున్నదా?

వృద్ధ: లేకేమి ప్రభూ! శ్రీరఘునాథనాయకులవారికి నేనొక గొప్ప సాహాయ్యముఁ జేసితిని. అందువలనఁ ప్రభువులకు నామీఁద దయ గలిగినది.

రఘునాథనాయకుల కీమెసాహాయ్య మేమవసరమైనదో యనుకొనినాఁడు ప్రభువు.

విజయ: నీ సాహాయ్య మెట్టిదో తెలుపుదువా?

వృద్ధ: మహాప్రభువులు రఘునాథనాయకులవా రొకమారు పెనుగొండ వచ్చిరి. పెనుగొండలో ప్రభువు లొకనాడు వాహ్యాళి వెడలుచు దారిలో మేడ మీఁద నిలుచున్న యొక యువతిని జూచి యామె సౌందర్యవిలాసములచే నాకృష్టులైనారు. ఆమెపేరు మంగమాంబ. ప్రభువామెను గాఢముగ వాంఛించి నారు. కాని వాంఛాసాఫల్య మగుటెట్లు? అప్పటిలో నేను వేంకటపతిరాయల వారి యంతిపురమున దాదిగ నుండెడుదానను. రఘునాథనాయకులవారి పరి చర్యకు వేంకటపతిరాయలవారు నన్ను నియమించిరి. ఒకరోజున రఘునాథ నాయకులవారు నన్ను మంగమాంబను గురించి యడిగిరి. ఆమెను దాము వాంఛించుచున్నా మనిరి. ఆమె తమకు లభ్యమగునాయని యడిగిరి. నే 'నామె యగుటకు వారాంగనయే గాని భర్త యున్నాడు. ఆమె యొప్పుకొనునా? అలఁ దూరకొనునా?' యంటిని. అంతట ప్రభువులు తా మామెమీఁద మరులుగొన్నా మనియు, ఆమె నెటులేని తమకు పశపర్తినిగఁ జేయుచో నాకొక గ్రామము నిత్తుమనియు ననినారు. ఆమె నొప్పింపఁజేయుటకు నా పడినపాటు లేమి చెప్పుదును? ఆమెభర్తను బంధువుల నతికష్టముమీఁద నొప్పించితిని. రఘునాథ నాయకులవారు మరల కృష్ణదేవరాయ లంతటివారు. విష్ణ్వంశ సంభూతులు. మహాప్రభువులు. మన్మథసుందరులు. ఆయన తన్ను వాంఛించి నంతకన్న గావలసిన యదృష్టమేమున్నది? మంగమాంబ జన్మతః వార వనితయేగద! వారిలో బహుభర్తృత్వ మొకతప్పులోనిదికాదు. 'రఘునాథ

నాయకులవారి కోరికఁ గా దనినచో నాయనకుఁ గోపము రావచ్చును. అప్పుడు మీస్థితిగతు లెట్లుండునో యోజించుకొనుడు. ఆయన మనోరథము సఫల మగుచో నెట్లుండునో చూచికొనుఁడు' అని రకరకములుగ వారికి నచ్చునట్లుగఁ జెప్పితిని. వారంద రంగీకరించిరి. ప్రభువులు మిక్కిలి సంతసించినారు. మంగమాంబ ప్రభువును జూచినది. ఆమె ప్రభువులరూపవిభవమున కచ్చెరు వందినది. ప్రభువు లామెమనస్సును మంత్రముగ్ధ మొనర్చిరి. ప్రభువు తన్ను గోరుట తనయదృష్ట మనుకొనినది. ప్రభువులు తమకు నే నీ సాయముఁ జేసినందులకు నా కీ గ్రామము విచ్చినారు.

విజయరాఘవనాయకున కీమె కథనమంతయు సద్భుతముగ నున్నది.

విజయ : అయినచో మంగమాంబ ప్రభువునొద్దనుండి యేమి వాంఛించినది ?

వృద్ధ : ఆమె కుమారునివాంఛించినది. కుమారుడుకలుగుచో ప్రభు వాతని కున్నతరాజోద్యోగము నిత్తుమనినారు.

విజయ : అయినఁ దనయుఁడు పుట్టినాఁడా ?

వృద్ధ : లేదు. కొమరిత జన్మించినది.

విజయ : ఈసంగతి రఘునాథప్రభువునకుఁ దెలియునా ?

వృద్ధ : తెలియదు. ప్రభువులు మొదటిసారి వచ్చుటతప్ప మరల పెనుగొండయే రాలేదు.

విజయ : మంగమాంబ యిప్పు డెచటనున్నది ?

వృద్ధ : మహాప్రభూ ! ఇప్పుడామె చనిపోయినది. ఆమె భర్తకూడ గతించినాఁడు.

విజయ : ఆపిల్ల యేమైనది ?

వృద్ధ : ఆమె పదియేండ్లువచ్చువరకు నావద్దనే పెనుగొండలోనే పెరిగినది. ఆపిమ్మట నామె మేనమామ వచ్చి యామెను దీసికొనిపోయినాడు. తరువాత నే నామెనుఁ జూడలేదు.

విజయ : ఆమెపేరేమి ?

వృద్ధ : రంగాజమ్మ.

ప్రభువు మొగమున వైవర్ణ్యము తోచినది. వృద్ధురాలు చెప్పినదంతయు నాయనలో నేదో యజ్ఞాతముగ బాధఁ గలిగించుచున్నది.

విజయ : రంగాజమ్మయా ? ఆమె తండ్రి యెవరు ?

వృద్ధ : వెంకటేంద్రుడు.

ప్రభువు కదలిపోయినాఁడు. వెంకటేంద్రుఁడా ! ఆయనరంతయు మహా ద్భుతముగ నున్నది. ఆయనలో క్షణక్షణమునకుఁ గల్గు విచిత్రములైన మార్పులను వెంకన్న గనిపెట్టుచునే యుండెను.

వృద్ధ : ప్రభూ ! మా గ్రామము............

విజయ : వెంకన్నా ! వీరి గ్రామముసంగతి మనచిట్టాలలో చూడుము.

వెంకన్న : ప్రభూ ! నే నిదివరకే చూచితిని. మనము పదునేను వత్సరములకు విజయనగరరాజులకు శిస్తుచెల్లింపవలసినమాట యథార్థము.

ప్రభువుమనమున రంగాజమ్మగాథ కలవరపెట్టుచుండెను. ఆ గాథ యాయనలో నేవోభావములను ద్రవ్వివోయుచున్నది. ఆయన మన సుండబట్టు కొనలేక యడిగినాఁడు : "రంగాజమ్మ మేనమామపేరు ?"

వృద్ధ : కృష్ణరాజు.

ప్రభువు నిశ్చేష్టుడైనాడు. కొంతతడవు మాటాడలేదు.

వృద్ధ : ప్రభూ !

ప్రభువు వెంకన్నకు వారిగ్రామమునకుఁ జెల్లింపవలసినసొమ్మును చెల్లింపవలసినదిగ నాజ్ఞ యిచ్చినాఁడు. వారుముగ్వురు గది విడిచి పోయిరి. రాజున కేమిచేయుటకును దోచుటలేదు. ఆయన మనసంతయు వికలమైనది. గదియం దటునిటు పందవలె తిరిగినాఁడు. నెమ్మదిగ గదివిడిచి, తన శయన మందిరమునకుఁ బోయినాఁడు. ఎట్టయెదురుగ రంగాజమ్మయొక్క పెద్దరూప చిత్రము నవ్వుచు గన్పించినది. రాజు తనలో 'నా రంగాజమ్మ మా రంగా జమ్మ గాదుకదా !' యనుకొనినాఁడు. రంగాజమ్మ చిత్రమున కావలిప్రక్కఁ దనతండ్రి రఘునాథనాయకుని చిత్రము. ఈవలిప్రక్కఁ దనచిత్ర మున్నది.

మూఁడు చిత్రములలోఁ గాపలసినన్ని పోలికలు కలిసినవి. రాజు హృదయమున నేదో తెలియరానిబాధ గగ్గోలు సేయుచున్నది. స్నానమునకు వేళయైనది. పరిచారికలు ప్రభువుకొఱకు నిరీక్షించుచుండిరి. ఆలస్య మగుచున్నది. ఒక రిద్దరు పరిచారికలు ప్రభువునకు హెచ్చరికఁజేయ వచ్చిరి. కాని ప్రభువునాకృతిఁ జూడగనే వారికి ధైర్యము చాలలేదు. వారు తిరిగిపోయిరి. ప్రభువు కదలక యక్కడనే కూలఁబడిపోయినాఁడు. రాత్రి రెండుజాములు గడచినది. రాజు హృదయమున శోకావర్తములు తిరుగుచున్నవి. రాజునకు కునుకు పట్టలేదు. ఎదురుగ రంగాజమ్మ చిత్రము నవ్వుచుఁ జూచుచున్నది. రాజున కామెచూపు బాధాహేతు వగుచున్నది. రాజుకనులనుండి వేఁడికన్నీరు కురియుచున్నది. గదిలో దీపములేదు. బయట పండువెన్నెల గవాక్షముగుండ రాజుశిరసునఁ బడుచున్నది. ఆ చీఁకటి గదిలో నావెన్నెలతీగెలు వెండిపలె తళతళ మెఱసినవి. అవి రాజున కొకమారు రంగాజమ్మ ప్రసన్నదృక్కులవలె, నొకమారు తన హృదయమున మార్చబడుచున్న వెండిబాకులవలె నవిపించినది. ప్రొద్దుపోవు చున్నది. రాజు నిద్దురపోలేదు. బయటఁ బ్రకృతి ప్రశాంతముగ నున్నది. రాజుహృదయ మాందోళితమైనది. చంద్రుఁడు పశ్చిమమున కొరగనున్నాఁడు. చల్లనిగాలి వీచుచున్నది. ఆగియాగి వెన్నెలఁ జూచి తెల్లవారినదని భ్రమపడి నాఁడు రాజు. మేల్కొను పక్షుల కిలకిలలు వినిపించుచున్నవి. విజయరాఘవ నాయకునికి మాత్రము నిద్దుర దూరమైనది. ఆయన యటులనే శూన్యమును జూచుచు గవాక్షమువద్ద కూరుచుండిపోయినాఁడు. ప్రకృతియంతయు నీరస ముగ నున్నది.

౧౯

గతరాత్రమంతయు రంగాజమ్మ ప్రభువుకొఱకుఁ బ్రతీక్షించినది. ప్రభువు రాలేదు. ఎందువలన రాలేదో రంగాజమ్మ కర్థమగుటలేదు. తానేమిదోష మొనర్చినది? ఆమెరాత్రియెల్ల నిదురపోలేదు. ఆమె నేత్రములెఱ్ఱవారినవి. ప్రభువు రాకపోవుట యామెకు దుస్సహముగ నున్నది. కనకాభిషేకమైన తరువాతఁ దాను ప్రభువుతో మాటాడలేదు. ఆమెకుఁ బ్రభువుమీఁదఁ గోపము వచ్చినది. ఆమె తన యాభరణములన్నియు నొక్కటొక్కటిగ విసర్జించినది.

ప్రభువునకు వర్తమానమంపినది. దాసి యూరక తిరిగి వచ్చినది. ప్రభువు దర్శనమురాలేదట. ఆ మాట వినుటయే రంగాజమ్మకుఁ గష్టముగనున్నది. కనకాభిషేకమైనది. ప్రభువు తన్నుఁ జూడలేదు. పరామర్శించలేదు. చిత్రముగ నున్నది. రేయివచ్చునని యెంతగనో యాశించినది. వర్తమానమంపినను దర్శనముగూడఁ గాలేదు. రంగాజమ్మ వారముదినములు చూచినది. ప్రభువు రాలేదు. ప్రభువునకుఁ దనమీఁది మరులు మఱలినవా? ఈ భావ మామెకు సహింపరానిది. ఆమె నిలువెల్ల వణఁకిపోయినది. తన కిట్టి యెడబాటు సంభవింపకుండుగాత మనుకొనినది. ఆమె దక్షిణనేత్రము స్పందించినది. ఆమె గజగజలాడినది. "అయ్యో! నా ప్రాణములన్నియుఁ బ్రభువు. నా యాశలు, నా వైభవము, నా ముద్దుమురిపెములు ప్రభువువద్దనే. ఆ ప్రభువు తన్ను వీడినచోఁ దన కింక మరణమే శరణము. ప్రభువెప్పుడు నిన్ని దినములు తనవద్దకు రాకుండలేదు. మొన్నటి యా తనప్రాభవ మీనాడు పరాభవముగాదుకద! రాజధానిలో నా మీఁద పగగలిగినవారెవరు? ఒకవేళ విరోధులెవరైన నేమైనఁ జెప్పినంతనే యాలోచనలేకుండఁ బ్రభువిట్లు చేయునా? తనప్రభువు తనపట్ల నట్టివాఁడుకాఁడు. ప్రభువు తనకొఱకేమైనఁ జేయఁగలఁడు. మరి యిదేమి? ఈ రాకుండుటకు కారణము?

ఆమె భోజనముఁజేసి పదిదినములైనది. బొమికలప్రోవువలెనైనది. మంచముపట్టినది. ప్రతిదిన మీనాడైన ప్రభువు వచ్చునను నాసతోఁ గడపుచున్నది. తలదువ్వదు. మాసినచీరె విడువదు. దాది యెంత బ్రతిమాలినను నెంగిలిగూడఁ బడుటలేదు. తా నేమైనఁ దప్పుచేసినదా? అటులైన దనకుఁ దెలియఁజెప్పి దండించవచ్చును. లేకున్న శిక్షింపవచ్చును. అంతియకాని యిదియేమి? రాజు తనకుఁ బదిగ్రామము లిచ్చినాడు. అందుకుఁ బట్టపురాణి యేమనినదో? ఆమె మండిపడియుండును. ప్రభు విచటికి రాకపోవుట కామెయే కారణమా? ఛీ! అట్లు జరుగదు. రాణి పట్టపుదేవియే కావచ్చును. రాజునకు నా కన్నమాత్ర మెక్కుడుగాదు. ఆమె దినదినమునకుఁ గృష్ణపక్షక్షపాకరునివలెఁ గృశించుపోవుచున్నది. ఆమె ప్రభువు నిరీక్షణలో దినమొకయుగముగ వెళ్ళఁ బుచ్చుచున్నది. ప్రభువువద్దకుఁ బ్రతిదినమును రంగాజమ్మనుండి వార్త

వెళ్లుచునేయున్నది. ఫలితము శూన్యముగ నున్నది. రంగాజమ్మ దిగులుపాటు భరింపరానిదిగ నున్నది.

ప్రభువు పదిదినములనుండియు నేదియో నిరాశగ, నిస్తబ్ధముగ కాలము గడుపుచున్నాఁడు. ప్రతిదినము దినకృత్యములు మాత్రము ముగింపుగసల్పి తన శయ్యామందిరమునకుఁ బోవును. అచటినుండి కదలఁడు. నిరంతర మేదియో యాలోచించును. కనుల నీరునించును. రంగాజమ్మ చిత్రఫలకమును పదిసారులుగ జూచును. వెట్టివానివలె నటునిటు దిరుగును. సభ జరుగుటలేదు. విలాసములులేవు. తా నిరువదియేండ్లనుండి పోషించుచువచ్చిన ప్రేమవృక్ష మీనా డిట్లు త్రెళ్లినది. దైవము తనకీవయసున నిట్టిబాధ చేకూర్చినాడేమి? రంగాజమ్మ తన సర్వస్వము. రంగాజమ్మకొఱకు తనరాజ్యమునైనఁ ద్యజించ గలడు. కాని నే డేమి చేయగలఁడు? ఏమిచేయును? ప్రతిదినమును రంగాజమ్మ పరిచారికలు వచ్చుచున్నారట. వారిని దా నెట్లు చూచును? ఏమని చెప్పును? రంగాజమ్మ యెంత కుందుచున్నదో! తాను, రంగాజమ్మవద్దకుఁ బోనినా డామెకు దుర్దినమువలె నుండును. తా నచటికిఁ బోకపోవుటనుగూర్చి యేమను కొనుచున్నదో! తన్నెంత మారుకొనుచున్నదో! తా నామెవద్ద కెట్లుపోవును? ఆమెతో నేమి మాటలాడును? అస లామె నేమని సంబోధించును? ఆయన కన్నియు సమస్యలుగ నున్నవి.

ఆయన యౌదాసీన్యమునకు మంత్రు లచ్చెరువందిరి. రాజకార్యము లేమియు జరుగుటలేదు. ప్రభువట్లున్నాఁడు. వారి కేమిచేయుటకుఁ దోచకున్నది. ఒకనాటి సాయంకాలము వారు ప్రభువునొద్దకువచ్చి "మీ రిటుల విచారముగ నేలయున్నారో మా కవగతమగుటలేదు. మీ రిట్లు మౌనముగ నొంటరిగ రాజ కార్యములు పట్టించుకొనకుండ నున్నచో రాజ్యమున నల్లరులు చెలరేగు ననిపించుచున్నది. ప్రభూ! మీరు రాజకార్యములమీఁద శ్రద్ధఁ బూనికొనకుండిన నేమగునో చెప్పఁజాలము. మనరాజధాని మునుపటివలెఁగాదు. ఇప్పుడంతయుఁ గ్రొత్తగనున్నది. రాజద్రోహు లెవరో యున్నటులఁగూడ కన్పించుచున్నది."

ప్రభువు మరల సభలు జరుపసాగెను. కాని యవి కేవలము రాజ్య సంబంధములు. నృత్యగీతాదులుగాని, కవిత్వచర్యలుగాని లేవు. ప్రభువులో

మునుపటి యుత్సాహము లేదు. మునుపటిప్రభువు సమయముకలిగిన వినుగబటి నవ్వును. నేటిప్రభువు నవ్వనేనవ్వఁడు. ప్రభువుకను లెల్లపుడును గ్రిందిచూపులు చూచుచున్నవి. మునుపటిదర్పము లేదు. ప్రభువుల యీ తత్వమున కేదో బరీయమైన కారణ ముండియుండవలెను. అదియెట్టిదో యేరికిని దెలియకుండ నున్నది. రాజుమాత్రము దినదినమునకుఁ గృశించిపోవుచున్నాఁడు. అది యందరికిఁ దెలిసిన విషయము. ఎవరేమనఁగలరు ?

ఒకనాటి మధ్యాహ్నమున నష్టమహిషులలో నొకతెయగు జ్ఞానాంబిక ప్రభువును దర్శింప నేతెంచినది. ఆమెకుఁ బెండ్లియీడునకు వచ్చిన యొక కొమార్తె కలదు. ఆమె తనకొమార్తె పెండ్లినిగురించి మాటలాడుదమని వచ్చినది. ప్రభువు విసుగుగనున్నాఁడు. జ్ఞానాంబికవచ్చుట యాయన కనిష్టముగ నున్నది. తన రాణులలో జ్ఞానాంబిక యనునామె యొకతె యున్నదనియే యాయనకు జ్ఞప్తిలేదు. ఈమెను జూడగనే యామె కొక కొమార్తె కలదని గుర్తువచ్చినది. ఈమె, ఆమెవివాహవిషయము ప్రస్తావింప వచ్చియుండును. వేరువను లేమున్నవి? జ్ఞానాంబిక లోనికివచ్చినది. ప్రభువునకు నమస్కరించినది. రాజామె కాసనముఁ జూపినాఁడు. ఆమె యాసీనయైనది.

ప్రభువు: జ్ఞానా ! ఏ నాడు నిట్లు రాలేదు. ఈ నా డిటు వచ్చితివేమి ?

జ్ఞానాంబిక: ప్రభూ ! ఏమి చెప్పుదును ? మీరు బొత్తిగ మా మందిరమునకు వచ్చుట మానివేసితిరి. అచ్యుత మీ కొఱకు, మీ దర్శనభాగ్యమునకుఁ గలవరించుచున్నది. అది తనతండ్రినిఁజూచి మాటాడుట కుబలాటపడుచున్నది. కాని యట్టిభాగ్యము మాకు లభించుటలేదు.

ప్రభువు: నీ విచ్చటికి వచ్చుటలోఁగల కారణమేమియో చెప్పితివి కావేమి ?

జ్ఞానాంబిక: ప్రభూ ! అచ్యుతాంబికకు యుక్తవయసు వచ్చినది. ప్రభువు లామెకుఁ దగిన వరునిఁగూర్చి యుద్వాహ మొనర్పవలెను. వివాహ యోగ్యమగు కన్య నెన్నినా ళ్ళుంచఁగలము. ఆమె పెండ్లివిషయముఁ దమకు మనవిచేయుదమని.

ప్రభువు: ఆ విషయము మాకుఁ దెలియును.

ప్రభువు కంఠధ్వని కటువుగ నున్నది. జ్ఞానాంబిక కంపించినది.

"ప్రభువులు నేడు కోపముగనున్నారు. లేకున్న నెప్పుడు నింత తీక్ష్ణముగ మాటలాడరు" అనుకొనినది. "ప్రభు వింత శుష్కించె నేలనో! ఈయన కను లింత విచారదీనములై యున్నవి! ఈ దైన్యము సంభవించినదేమి? పట్టపురాణి కొన్నినెలలుగ రాజునకు వ్యతిరిక్తముగఁ దన యిచ్చవచ్చినట్లు సంచరించుచున్నది. అది కారణమా? ఎంతటి పట్టపుదేవేరియైన నిట్టిచర్యలా? మహాప్రభువులుగనుక సాగివచ్చుచున్న వామె యాటలు" అనుకొన్నది. ప్రభు పవ్వలిమొగమై యున్నాడు. జ్ఞానాంబిక వెడలిపోయినది. దారిలో రాయసము వెంకన్న కనుపించినాఁడు. రాణి పల్లకి యాపించినది. వెంకన్న యాగినాఁడు. వెంకన్న రాణిగారికి స్వస్తివాచకము లనినాఁడు.

జ్ఞానాంబిక : వెంకన్నగారూ!

వెంకన్న : ఏమి, మహారాణీ!

జ్ఞానాంబిక : మీరు ప్రభువులయొద్దకే పోవుచున్నట్లున్నారు?

వెంకన్న : అవును. తా మచటినుండియే వచ్చుచున్నారువలె నున్నది.

జ్ఞానాంబిక : వెంకన్నగారూ! మీరు మాకొకసాహాయ్యము చేయవలెను.

వెంకన్న : నాకుఁ జేతనగుచో నవశ్యము చేయుదును. చిరంజీవిని గుశలముగ నున్నదా?

జ్ఞానాంబిక : ఆమె విషయమే చెప్పఁబోవుచున్నాను. ఆమెకుఁ బెండ్లి యీడు వచ్చినది. తగిన వరు నన్వేషింపవలెను.

వెంకన్న : మహారాజుగా రేమనుచున్నారు?

జ్ఞానాంబిక : అందుకే యీనాడు మేము ప్రభువులవద్దకు వచ్చినది. ప్రభువు లేలనో పరాకుగనున్నారు. ఆయన విచారముగనున్నారు. ఈ విషయ మాయనకుఁ జెప్పితినిగాని యంత శ్రద్ధగ వినిపించుకొనినట్లు కనిపించుటలేదు. ఆయన నిరాశామూర్తివలె దైన్యముగనున్నారు. అట్లుండుటకుఁ గారణమేమో తెలియకున్నది. మీ కేమైనఁ దెలియునా?

వెంకన్న : నాకేమి తెలియును తల్లీ! ఆఁ ...మీరు నాచేయవలసిన సాహాయ్యమేమో చెప్పితిరికారు.

జ్ఞానాంబిక : మా కొమార్తెకుఁ దగిన సంబంధము వెదుకవలెను. అదియే మాకుఁ గావలసిన సాహాయ్యము.

వెంకన్న మాటాడలేదు.

జ్ఞానాంబిక : ఏమి వెంకన్నగారూ ! మాటాడుటలేదు. మీకిది చేతఁగాని పనియా ?

వెంకన్న : ఎంతమాట ! చిరంజీవినికిఁ దగినవరునిఁగూర్చు పనికన్న నాకుఁ గావలసినదేమున్నది ? అవశ్య మిప్లే ప్రయత్నించెదను.

జ్ఞానాంబిక : ప్రభువులు బొత్తిగ నా విషయముఁ బట్టించుకొనుటలేదు. మీరీ సాయముఁ జేసిపెట్టుదుమని మా కీ వాగ్దానమిచ్చుచో మేము నిశ్చింతముగ నుండఁగలము.

వెంకన్న : అమ్మా ! నేను తప్పక యచ్యుతాంబికకుఁ దగిన వరుని నన్వేషించెదను. మీరు నిశ్చింతముగ నుండుడు.

జ్ఞానాంబిక కనులు తృప్తిని వెలికిఁ జిమ్మినవి.

వెంకన్న : సెలవు తల్లీ !

జ్ఞానాంబిక తన మందిరమునకుఁ బోయినది. ప్రభువువద్దకుఁ బోవుద మనుకొన్న వెంకన్న తిరిగి తనయింటికే పోయినాఁడు. చీఁకటి పడినది. దీపములు వెలిగించిరి. జ్ఞానాంబికాదేవి సాయంతనపుఁ బ్రస్తావము వెంకన్నకుఁ గ్రొత్తయాలోచనలకుఁ దావిచ్చినది. అచ్యుతాంబికకుఁ దాను సంబంధము వెదుకవలెనా ? తా నీ పురమువిడిచి యెచటికిని బోఁజాలఁడు. అట్లు రాజగోపాలాంబిక యాజ్ఞ. తాను మధుర పోవలెను. మధురవెళ్ళి చాల కాలమైనది. తిరుమలనాయకులు దివంగతులైరట. పాప మాయన యాశ లన్నియు నడియాశలై చివరకు మరణము ప్రాప్తించినది. ఆయన తరువాత చొక్కనాథనాయకుడు రాజయ్యెను. ఆయన రాజగునప్పుడు రాజ్యమున విద్రోహములు పకరకములుగఁ జెలరేగినవఁట. కాని యవియన్నియుఁ జొక్క నాథనాయకుని ప్రజ్ఞావిశేషముచేత నణగిపోయినవి. తిరుమలనాయకుడు తనతో నెన్నివిధములఁ బల్కినాఁడు. మానపుఁడు లక్షచేయవలె ననుకొనును ; గాని

యేమియుఁ జేయఁజాలఁడు. తిరుమలనాయకుని యూహలకు నాతని యీ యకాలమరణమునకు సంబంధమేమి? ఇంతయెందులకు: తాను మధురకుఁ బోవలెనని యిన్నాళ్లుగఁ బ్రయత్నించుచున్నాఁడు. ఇంతవఱకుఁ బడలేదు. తానేమి కానున్నాఁడో! పాపము చొక్కనాథుఁడు చిన్నవాఁడు. అతఁడు సుందరుఁడు. బుద్ధిశాలి. ఆతఁడు తన సాహాయ్యము నర్థించుచుఁ దన్ను మధురకు రమ్మని పలుమారులు సమాచారము లంపినాఁడు. తాను పోవుటెట్లు? తానేదో గౌరవమును, పదవీభాగ్యమును బొందవలెనని తంజావూరు వచ్చి నాఁడు. ఏదోతలచిన నేమో యైనట్లయినది. అయినను మొన్నటివఱకు తన యధికార మిష్టమువచ్చినట్లుగ చలాయించినాఁడు. తన్నుఁ గాదనువా రెవరును లేకపోయిరి. ఇపుడు తనకు వ్యతిరిక్తమైన యెదిరిబలమొకటి లేచినది. తన కిఁకఁ దంజావూరున మునుపటియంత స్థానము లేదు. ఇకమునుముందఁ బోదు. తాను త్వరగఁ ద్రోవఁజూచుకొనుట మంచిది. ప్రస్తుతము మధుర తన్నాహ్వానించుచున్నది. చొక్కనాథనాయకుఁ డవివాహితుఁడు. తన బుద్ధి నైశిత్యముచేఁ బ్రయత్నించి యచ్యుతాంబిక నాతని కిప్పించును. ఇది పొసగునా? విజయరాఘవనాయకుఁ డంగీకరించునా: అంగీకరించఁడు. లేనిచోఁ గయ్యము తప్పదు. ఈ యుపాయము బాగున్నది. కయ్యమే తప్పనిసరియగుచోఁ దన మేథావిభవమును మరల నొకసారి రాజు తిలకించుఁ గాక" యనుకొనినాఁడు. "ఏదియే నొకతీరుగ నచ్యుతాంబికను వివాహ మాడుటకుఁ దాను చొక్కనాథనాయకు నొప్పించును. తానిప్పు డెచ్చటికైనఁ బోఁగలఁడు. రాణి కోర్కె తీఱినదిగదా!" యనుకొనినాఁడు. ఆతని హృదయము తేలికయైనది. పాపము విజయరాఘవనాయకులు కుమిలిపోవు చున్నారు. రంగాజమ్మ యనవసరముగఁ దన కేమియుఁ దెలియకుండగనే క్రుగ్గిపోవుచున్నది. వారి కెన్నటికైన శాంతియనున దున్నదా: నిండుప్రాణము లెట్లలమటించి పోవుచున్నవో! దానికిఁ గారణమాత్రుడుగ తా నున్నాడు. ఏమగునో? రంగాజమ్మ మంచమెక్కినది. ఆమె యింక జీవించునా? ఆమెకున్న యాభిజాత్య మితరులెవరికిని లేదు. ఆమె కసలు సంగతి తెలియదు. రాజు తనవద్దకు రాకపోవుట కెన్ని కారణములు చెప్పుకొనినదో! ఆయన రాత్రి చాల ప్రొద్దువఱకు యోజించుచునే యున్నాఁడు. అచ్యుతాంబికను జొక్క

నాథుని కిచ్చుభారము తప్పక వహింపవలె ననుకొనినాఁడు. మరునాడే మధురకుఁ జొక్కనాథ నాయకులవారి సన్నిధికి రాయసము వెంకన్నచే సమాచారములు పంపఁబడినవి.

మూఁడు దినములు గడచినవి. ప్రభువుస్థితిలో మార్పేమియుఁ గలుగ లేదు. రంగాజమ్మస్థితి రోజురోజు విపరీతముగఁ బరిణమించుచున్నదని మాత్రము తెలియుచున్నది. రాజు దుఃఖసముద్రమున సంపూర్తిగ మునిగిపోయి నాఁడు. ఆమె చివరి కేమగును? ఆమె యేమైనను పాపము తన్నుఁ జుట్టు కొనును. ప్రభువు హృదయము బడబాగ్నిశిఖలఁ గ్రక్కుచున్న మహోదధివలెఁ గల్లోలితమైనది. రంగాజమ్మ కేమియుఁ దెలియదు. తన్ను గాఢముగ వాంఛించినది. ప్రేమించినది. తాను గనుపింపకపోయిన దుఃఖించును. కోపగించును. కుమిలిపోవును. రంగాజమ్మ కొక ప్రభువేల రాలే దన్న దుఃఖమే. ప్రభువున కట్లుగాదు. తాను పై కేమియు ననఁడు. పరిజనుల కేమియుఁ దెలియకుండ నున్నది. ఆయన హృదయమున సుడిగాలులు రేగు చున్నవి. ప్రభువు తన బాధను తానే యనుభవించుచున్నాఁడు.

తంజాపూరునందు ప్రతి సంవత్సరమును రాజగోపాల దేవునికిఁ దిరు నాళ్ళు జరుపుదురు. అవి వరుసగఁ బదిదినములు జరుగును. ఆ తిరునాళ్ళ దినములలో తంజాపూరున జనము క్రిక్కిరిసి యుందురు. చుట్టుప్రక్కల పల్లెల యందలి జనులందరు వచ్చిచేరుదురు. ఆకసమెత్తుననుండు ప్రభలుంతును. క్రొత్తక్రొత్త దుకాణములు, రంగుల రాటములు, బొమ్మలకొట్టులుఁ బెట్టుదురు. ఆ పదిదినము లాపురమంతయు సుందరముగ నలంకరించఁబడియుండును. వీథినాటకము లాడఁబడును. అంతయు విచిత్రముగ నానందముగ నుండును. రంగాజమ్మ కీ తిరునాళ్ళనినఁ జెప్పనలవికానంత యుత్సాహము. ప్రతియేడును దన మేడ పైభాగమున నిలబడి యుత్సవముల నానందముగఁ జరిపించెడిది. ఈ సంవత్సర మామె మంచమునుండి లేవలేని స్థితిలో నున్నది. వాఁకిటఁ బిల్లలు గుంపుకట్టియున్నారు. రంగాజమ్మ ప్రతి సంవత్సరము తిరునాళ్ళలోఁ బిల్లలకు బొమ్మలు, తినుబండములు విరివిగఁ బంచియిచ్చెడిది. ఈ యే డెవరిత్తురు? దాసి వచ్చి పిల్లలను గసరిపంపినది. వీథియందు మేళము వినిపించుచున్నది. రంగాజమ్మకు సన్నగా వినిపించుచున్నది. ఆమె లేవఁబోయినది.

తూలి మంచముమీఁద వ్రాలిపడినవి. ఈయుత్సవములలో రాజెంతయో భగవత్సేవ చేసెడివాఁడు. ఈయేడు రాజు రానేలేదు.

నాటితో నుత్సవము లాయేటికిసరి. అనగ నాడు పదియవరోజు. ఆనాడొక సంఘటనము జరిగినది. సాయంకాలమైనది. నలుదిక్కులనుండి చీఁకట్లు క్రమ్ముకొని వచ్చినవి. రాజగోపాలస్వామి యాలయమున జనము తండోపతండములుగ నున్నారు. కొందరు పోవుచున్నారు. కటికచీఁకటి. దీపములు చాలనున్నవి. వాని మిలమిలలు జనసమూహములో మాయమగుచున్నవి. ఏమియుఁ గన్పించుటలేదు. ఆ చీఁకటిలో నొక యువతి యొక యువకుడు కలసికొనినారు. వారిరువురకు రాగోదయమైనది. ఇరువురి మనములఁ గామము తలసూపినది. ఫలించినది. ప్రొద్దుపోయినది. జనము పల్చఁబడినది. వారిరువురు కోవెలలోనికిఁ బోయిరి. మంటపమున నుపవిష్టులైరి. మంటపముననున్న దీపముల వెలుఁగున వారిరువు రొకరినొకరు సోదరీ సోదరులుగఁ దెలిసికొనిరి. ఏమిచేయుదురు? బిట్టుగ విలపించిరి. ప్రయోజనములేదు. మరునాడు సాయంకాలము రాజసభ. వారిరువురు సభకు వచ్చినారు. తమ పొరపాటున నైన యకృత్యము ప్రభువునకు నివేదించి తమ కేశిక్ష విధింపనగునో విధియింపుడని వేడికొనిరి. వారి వృత్తాంతము వినగనే క్షణకాలము ప్రభువు మ్రాన్పడినాడు. తేరుకొని పండితులనందఱు రావించి యీ నేరమున కేశిక్ష విధింపవలయునో చెప్పు డనినాఁడు. వారు దీర్ఘముగ యోచించి యట్టి దుష్కృత్యమునకు నెవరి జీవితమును వారు నశింపఁజేసికొనవలసినదిగఁ జెప్పిరి. వారు వెడలి పోయినారు. సభ ముగిసినది. విజయరాఘవనాయకునికి మనమున దిగులు పట్టుకొనినది. అట్టి నేరమున కాత్మహత్యకన్న వేరొక శిక్షలేదు. రంగాజమ్మ యెట్లును మంచముఁ బట్టియే యున్నది. ఆమె యెటులైనఁ జనిపోవును. తన పాపముయొక్క నిష్కృతియగు టెట్లు? ప్రభువు తన శయనమందిరమునకుఁ బోయి సెజ్జమీదవ్రాలి రోదించ నారంభించినాఁడు. ఆయనకుఁ దన జీవితమంతయుఁ బాపపంకిలముగఁ గన్పడుచున్నది. ఆయనలోఁ జిత్రచిత్రములగు భావము లుబికి విలీనము లగుచున్నవి. కన్నుమూసినఁజాలును తన భవిష్యత్తంతయుఁ గరాళరూపముదాల్చి యెదుట నిలుచున్నటుల దర్శన మొసగును. ఆ కరాళాకృతి ఖడ్గధారిణి. వికారదంష్ట్ర. అది యొక మహాభూతము. తన

మీఁదికి వచ్చుచున్నట్లుండును. ఆయన కారాత్రి నిద్ర దూరమైనది. తెల్లవారువఱకట్లే విలపించుచునే యుండెను. అరుణోదయరేఖ లాయన ముఖము మీఁదఁ బడుచున్నవి. కాని యానా డాయన నిదుర లేవలేదు.

౨౦

మరునాఁడు ప్రభువు లేచువఱకు జాము ప్రొద్దెక్కినది. లేచుటతోడనే యెదుటనున్న నిలువుటద్దమునఁ దన ప్రతిచ్ఛాయ కనిపించినది. కన్నులెఱ్ఱవారి యుబ్బియున్నవి. చెక్కిళ్లు కన్నీటి చారికలు కట్టి మలినములైనవి. జుత్తు చెల్లచెదరైనవి. తూలిపోవుచున్నాఁడు. తానెప్పుడైన నింత ప్రొద్దెక్కి లేచెనా? ఈ దుఃఖ మాయనను ప్రాణములు తీసికొనిగాని వదలిపెట్టదా? ప్రభువు కాల్యములు తీర్చికొని తిరిగి యాలోచింపసాగినాఁడు. రాజగోపాలాంబిక తన మన్నారుదాసును జెఱవిడిపించుటకుఁ దన్నడుగదేమి? తనవద్దకు మరల రాలేదేమి? ఆమె తనతో నెట్టి సంప్రతింపులు చేయుండగనే తన యిష్టము వచ్చినటుల నడచుకొనుచున్నది. ఆ పద్ధతి చాల విచిత్రముగ నున్నది. ఆయనకుఁ బలురకములగు నాలోచనలు జనించుచున్నవి. దైవము తన్నెంత చేసినాఁడు. మొదటనే యీ సంగతి తెలిసినచో రంగాజమ్మను దానింత ప్రేమించెడివాఁడే కాఁడు. ఇన్నినాళ్లుగఁ దెలియని సంగతి యీనాడు దెలిసిన దేలనో! ఈ విషయ మెట్లెవరికి తెలిసినదో! శ్రీరంగరాయలు తమకుఁ బ్రాణమిత్రులు. ఒకవేళ నా గ్రామమునకు మఱచిపోయి శిస్తు చెల్లింపకపోయిన నిట్లు లాడునా? అసలీ తల్లికొడుకు లిచటి కేల వచ్చిరి? ఎక్కడి పెనుగొండ? ఎక్కడి తంజావూరు? ఈవిషయములన్నియు సమాచారముల ద్వారమున జరుపవచ్చును. వచ్చిన దామె యూరకొనకుండ నెంత గాథ త్రవ్విపోసినది. తన కెంత మర్మఘాతముగ నున్నది. ఇదియంతయుఁ గల్పితమా? కాదు. అయినచో నా పత్రములమీఁదఁ దంజాపుర రాజముద్ర యున్నదే! నిజమే కావచ్చును. విశేషించి యీ సమయముననే వారు వచ్చుట చూడ నెవరో దీని వెనుక వత్తాసుగ నిలబడి చేయించుచున్న పనివలె నున్నది. రంగాజమ్మమీఁదఁ గక్షగనున్నవా రెవరో యీ పనికిఁ బూనికొని యుండవలయును. వా రెవరైయుందురు? ఇంత దుర్ఘట కార్యములను నిర్వర్తింపఁగలవా రీ రాజ్యమున రాయసము వెంకన్న

తప్పు వేరెవరును లేరు. కాని వెంకన్నకుఁ దనమీఁద గౌరవము కలదు. అతఁ డట్లు చేయఁజాలడు. మరల రాజుదృష్టి రంగాజమ్మ వైపునకు మళ్లినది. ఆమె తాను రానందుల కెంత యటమటించి పోవుచున్నదో! తా నామెవద్దకుఁ బోయి మూఁడునెలలైనది. ఆమె మృత్యు ముఖమున నున్నదట. చనిపోవుటకు ముందొక పర్యాయము తన్నుఁ జూడవలయు ననుచున్నదట. ఆమె చని పోవును. ఆమె పాపములు నమసిపోవును. ఆమె తనకొఱకు విలపించి యసువుల విడనాడును. తన్నాపాపముకూడ చుట్టుకొనును. పోనీ రంగాజమ్మకడ కొక్కసారి వెళ్లవచ్చునా? అమ్మో! ఆ పని చేయలేఁడు. ఈ జన్మకామె నీక్షించ లేఁడు. ఇన్నిరకములుగ బాధలు ననుభవింపవలెనని విధి తన మొగమున వ్రాసిపెట్టెనుగాబోలు! పట్టపురాణి తన్ను లక్ష్యపెట్టదు. ఇరువదేండ్లుగ పెన్నిధానముగ, భద్రముగఁ జూచుకొనుచున్న రంగాజమ్మ యీగతి యైనది. మన్నారు పెద్దకొడుకు-యువరాజు-రాజద్రోహమునకుఁ బూనికొనినాఁడు. తన చుట్టును శత్రువులు. రాజునకు మహాగ్నిమధ్యమున నున్నటులున్నది. కష్టములు వచ్చునపు డన్నియు నొకమారుగఁ జుట్టుముట్టి వచ్చునేమి? అయ్యో! తనకిట్టి యిన్ని యిక్కట్టు లేకకాలమునఁ బ్రాప్తించినవి. జ్ఞానాంబిక కొమరిత పెండ్లి ప్రస్తావన చేసినది. ధీరాంబిక తనయునకు పట్టాభిషేకము చేయుమనునట్లు మాట్లాడును. పట్టపురాణి యాతీరు! తా నీతీరు! ఏవంకఁ జూచినను జీవితము మీఁద విరక్తి కలుగుచున్నది. కష్టము లెంతవారికిని వచ్చును. అనుభవింపక తప్పదు. కష్టములనునవి మానవులకు రకరకములుగఁ దమతమ పూర్వజన్మ కర్మల ఫలితముగ వచ్చుచుండును. వానిని దప్పించుకొనుట హరిశ్చంద్రాదులకే చేతఁగాకపోయినది. ఈ సంగతి ప్రతిమానవునికినిదెలియును. కాని దుఃఖించుచునే యుండును. అది మానవ ప్రకృతి. జరుగుచున్నదానిని జూచుచు జరుగ నిమ్మని యూరకొనలేఁడు. తన చేతనైనంతవఱకు మంచికో చెడుగునకో ప్రాకులాడుచునే యుండును. విజయరాఘవనాయకునిస్థితి యట్లే యున్నది.

రెండుమూఁడు దినములు గడచినవి. రాజు రాయసము వెంకన్నను బిలువనంపినాఁడు. వెంకన్న వచ్చినాఁడు. ప్రభువు సగమై యున్నాఁడు. వెంకన్న కనులలో జాలి చిందినది. ప్రభువు గవాక్షమున కెదురుగ నొక యాసనమున నుపవిష్టుఁడై యాకసమువంక నిరాశగఁ జూచుచున్నాఁడు. వెంకన్న

వచ్చి పది నిముసములైనది. ప్రభు పటు తిరుగలేదు. ప్రభుపు ధ్యానము నూర్చి వేసిన వరిమొక్కవలె నున్నాఁడు. వెంకన్న ననుకొనినాఁడు: "రంగాజమ్మ రాజుహృదయమున నెంత స్థాపన మేర్పఱచుకొనినది! రాణి ప్రభువు జీవిత ముతోఁ జెలగాట సాగించుచున్నది. ఇది దేనికి దారితీయునో! ప్రభుస్థితి దిన దినమునకు క్షీణించుచున్నది." ప్రభుపు వెంకన్న వైపునకుఁ దిరిగినాఁడు.

వెంకన్న : ప్రభూ !

విజయ : ఎవరు, వెంకన్నా! నీవు వచ్చితివా ?

వెంకన్న : ప్రభువులు నన్ను రమ్మని వర్తమాన మంపితిరిగదా ?

ప్రభువుమనసు మనసున లేదు. తాను వెంకన్నను పిలిపించితి ననుమాట జ్ఞప్తి లేదు.

విజయ : మేము నిన్నుఁ బిలువనంపితిమా ?

వెంకన్న : అవును ప్రభూ!

విజయ : సరియే. నీవు పెనుగొండనుండి వచ్చినవారి విషయమేమి చేసితివి? గ్రామమునకుఁ గట్టవలసినదంతయుఁ గట్టితివా?

వెంకన్న : ప్రభూ! ఇంతవఱ కేమియుఁ జేయలేదు.

విజయ : ఎందువలన?

వెంకన్న: ప్రభూ! ఆ ధనమునుగట్టవలయునా? వలదా? యని యోజించు చున్నాను.

విజయ : నీకు నాసందేహమే యొదవినదా? వారి మాట లయథార్థము లందువా?

వెంకన్న : అట్లనుటకు వీలులేకుండా నున్నది.

విజయ : కారణము?

వెంకన్న : వారు చూపించిన పత్రములమీఁద రాజముద్ర యున్నది. దాని నెట్లుకాదందుము?

విజయ : ఏమో, మాకంతయు నింద్రజాలమువలె నున్నది. రాజ్యములో రంగాజమ్మ యనిన విరోధము గలిగినవా రెవరైన నున్నారా?

వెంకన్న : నాకేమి తెలియును ప్రభూ? మీకుఁ దెలియకుండ నుండునా?

విజయ : అదికాదు. ఆలోచించిచూడుము.

వెంకన్న : మహారాణులకే యామెయన్నఁ గ్రోధముగ నున్నది.

విజయ : ఆమెకు సాహాయ్య మొనర్చువా రింకెవరైన నున్నారా?

వెంకన్న : లేకేమి ప్రభూ! ఎల్లసోమయాజు లున్నాఁడు.

విజయ : ఆయనయొక్కఁడేనా?

వెంకన్న : కాదు ప్రభూ! ఆమెకు లేనిసహాయ మేమున్నది? ఆమె కీపురమున నేమూల నేమిజరుగుచున్నదో విశదముగఁదెలియును. ఆమె పరిచారికలు, సేవకులు ఆమెకొఱకు ప్రాణములు త్యజించుటకైన వెనుదీయరు. ఆమెగూఢచారులు పురమున నలుమూలల నుందురు. ఈ పురమున నామె సంపూర్ణముగ రాచరికమును వెలయించుచున్నది. ఆమె కన్మఱుగినరహస్యము లనునవిలేవు. సోమయాజులీమధ్య కొన్ని నెలలక్రిందట పెనుగొండ, చంద్రగిరి వెళ్లివచ్చినాఁడు.

ప్రభువు భ్రూభంగము చేసినాడు. రాణియే యీరహస్యమును బయటకి లాగియుండును. తనమీఁద పగఁబట్టినది. తన్ను దుఃఖ పెట్టుటయే ప్రధానముగ నెంచుకొనుచున్నది. ఆమెకెటులైనఁ బ్రతీకార మొనర్చితీరవలెను. రాణికోపమే రంగాజమ్మ నిట్లుచేసినది. ఆయనకు రాణిమీఁదఁ గ్రోధమువికివచ్చినది. ప్రభువు యెల్లసోమయాజులను తానురమ్మంటినని చెప్పుమని వెంకన్నను బంపివేసెను. తిరిగి యాలోచింప మొదలుపెట్టినాడు. "సోమయాజులు వచ్చును. తానెందుకు పిలుపనంపినట్లు? ఆయన వచ్చుటవలనఁ దనకుఁదెలియు విశేషము లేమున్నవి? ఈయనకూడ నసాధ్యుడే యగును. వచ్చునుగదా! రాణి కామెవ్యవహారములు నరిచూచుటయం దీయన ముఖ్యుఁడు. రంగాజమ్మగాథ నీయనసాహాయ్యముననే రాణి తెలిసికొని యుండవలయును. కానిమ్మావిషయముఁ దెలిసికొందును" అనుకొనినాఁడు.

సోమయాజులు వచ్చినాఁడు. ప్రభువు తన్నుఁ బిలిపించుట యాయన కాశ్చర్యముగ, భయముగఁగూడ నున్నది. కాని రాజాజ్ఞ. రాకతప్పినదికాదు.

సోమయాజులు భయపడుచునే నమస్కారముచేసి యనినాఁడు : "ప్రభువులు నన్నుఁ బిలిపించినారు. నావలనఁ గావలసిన కార్యము లేమున్నవి ?"

ప్రభువు సోమయాజులను దదేకదృష్టిగఁ జూచి యనినాఁడు: "కారణము ప్రత్యేకముగ నేమియు లేదు. మేము మీకు సన్మానము చేయఁదలఁచు చున్నాము."

సోమయాజులు హృదయమున కలఁగుచుపడినాఁడు. ప్రభువు కేలనో తనమీఁద నాగ్రహము కలిగినది.

సోమ : ప్రభువులకు నామీఁద నేలనో యాగ్రహము కలిగినది. నాకుఁ దెలిసినంతకు నే నెట్టియపచారమును జేయలేదు. ప్రభువులు క్షమింప వలయును.

విజయ : మీరు పండితులు. రాణిగారితో వచ్చినారు. మీకు మాసభలో నెప్పుడును సన్మానము చేయలేదు. రాణిగారికి మామీఁదఁ గోపముగనున్నది. మేము లింగాజమ్మకుఁ బదిగ్రామముల నిచ్చితిమి. ఆమెకు లింగాజమ్మ యన్నను మేమన్నను నిష్టములేకుండ నున్నది. మే మామెనుండి ప్రేమను వాంఛించుచున్నాము. ఆమె యనుగ్రహమును బొందవలె ననుకొనుచున్నాము. అది యామె కిష్టమగువారికి సన్మానము చేయుటవలన, వారి కోపమును బోగొట్టుటవలన, వారిని గౌరవించుటవలనను సంపాదింపఁదలచుచున్నాము.

సోమ : నాదేమున్నది ప్రభూ ! ఏదో వేదము చదువుకొనినాను.

విజయ : వేదముచదువుకొనిన, పండితుఁ డేల కాకూడదు ? మేము మీకు సన్మానము తప్పకచేయుదుము. మీరు రాణిగారివెంట వచ్చిన బ్రాహ్మణులు. ఆమె కెట్టి సాహాయ్యమైనను, ఎన్ని యిబ్బందులు పడియైనను జేయఁ గలవారు.

సోమయాజులకు ప్రభువుమాటాడుటలో వ్యంగ్యము భాసించినది. ఆయన కలఁతఁజెంది యనినాఁడు : "ప్రభూ ! రాణిగారితోడ వచ్చినాను. ఆమె కేమి కావలసినను జేసిపెట్టుదును. నిజమే. తమరుచెప్పినను జేయుదును. మీరేమి యాజ్ఞాపించిన నది చేయవలసినవాఁడను."

విజయ : మీమహారాణికి మామీఁదఁ గోపముగనున్నది కదా ! మేము చెప్పునది చేయుచో నామె యేమనును ?

సోమ : ప్రభూ ! మహారాణికిఁ దమమీఁదఁ గోపములేదు.

విజయ : పోనిండు. నేనిప్పుడు పెనుగొండ పొమ్మనినచో మీరు పోయివత్తురా ?

సోమయాజులు మనమున బెదరిపోయినాఁడు. మారాడలేదు.

విజయ : మాటాడరేమి ? మీరు రాణిపంపగఁ బెనుగొండపోలేదా ?

సోమయాజులు మారాడలేదు.

విజయ : మాటాడరేమి ? మీరు వెళ్ళలేదా యంటిమి.

సోమయాజుల కేమి చెప్పవలెనో బోధపడుటలేదు. మాటాడకుండఁ దలవంచుకొని నిలబడినాఁడు. ప్రభువునకుఁ గోపము వచ్చినది.

విజయ : మేమడుగు ప్రశ్నకు జవాబుచెప్పు మనుచున్నాము.

ఆయనమాటాడుట సింహగర్జనవలె నున్నది. ప్రభు వప్పుడు తలఁచుకొనిన తన్నేమైనఁ జేయఁగలడు. గడగడ వణకిపోయినాఁడు. రాజు గద్దించినాఁడు.

సోమ : పెనుగొండ వెళ్ళివచ్చితిని.

విజయ : ఎందుకు వెళ్ళినారు ?

సోమ : రంగాజమ్మ పుట్టుపూర్వోత్తరములు తెలిసికొని రావలసినదిగ నన్ను మహారాణులు పంపినారు.

విజయ : రంగాజమ్మ జన్మస్థానము పెనుగొండ యని యెట్లుతెలిసినది?

సోమ : చంద్రరేఖ చెప్పినది.

విజయ : రంగాజమ్మను గురించి యేమి తెలిసినది ?

సోమ : ప్రభూ ! క్షమింపవలెను. మీరే చెప్పు మనుచున్నారు గావునఁ జెప్పుచున్నాను. ఆమె రఘునాథనాయకులవారి బిడ్డయఁట !

ప్రభువు మారాడలేదు. సోమయాజులు కడుభీతుఁడై యనినాడు: "ప్రభూ!

నేను రాణిగారిమీఁది ప్రేమచేతను, గౌరవముచేతను నామె చెప్పినపనులు చేయుచును. సాయమొనర్తును. రాణిగారిమాటమీఁద నేను రంగాజమ్మ వృత్తాంతముఁ దెలిసివచ్చిన మాట నిజము. నే నీపనిచేయుటకు నా కామె యందుఁగల దయా వాత్సల్యములు కారణములు. కాని మీ రాయసము వెంకన్న యటులగాదు.

విజయ : రాయసము వెంకన్న యేమిటి ?

సోమ : రాయసము వెంకన్నను మహారాణిపిలిపించి రంగాజమ్మ వృత్తాంతము మీకుఁ దెలియఁజేయవలె నన్నది. అట్లు చేయకున్నచో నీవు బ్రదుకవన్నది. నీ కుటుంబము నిలువదన్నది. ఆ భయముచే రాయసము వెంకన్న యామెకు సాయమొనర్చినాఁడు. ఈ విషయము మీకుఁ దెల్పుటకుఁ జాల శ్రమపడినాఁడు.

ప్రభువుకన్నుల నిప్పులుకురిసినవి. "రాయసము వెంకన్న రాణికి సాహాయ్యకారియా !" యనుకొనినాఁడు.

విజయ : ఈపురమున రాణిగారికి గౌరవింపఁదగిన వ్యక్తులింకెవరైన నున్నారా ?

సోమ : ప్రభూ ! పెద్దిదాసుగారని యొకమహాభక్తులు గలరు. ఆయన యందు మన్నారుదాసునకు గౌరవముమెండు. మహారాణిగారి కాయనయెడల నపరిమితమగు గౌరవభావ మున్నది.

విజయ : పెద్దిదాసుగారికిని, మీకును గలిసియే సన్మానము చేయుదుము. ఇఁక మీరు పోవచ్చును.

సోమయాజు లాందోళితహృదయుఁడై వెడలిపోవఁదొడగెను. ప్రభువు మరలఁ బిలిచినాఁడు. సోమయాజులు భయపడుచువచ్చి "ఏమి ప్రభూ !" యనినాఁడు.

విజయ : మీరు రాయసము గనుపించిన నేము రమ్మంటిమని చెప్పుఁడు.

సోమ : చిత్తము ప్రభూ !

విజయ : మీరు పోవచ్చును.

సోమయాజులు వెడలినాఁడు. ప్రభువు తనలో నిట్లనుకొనినాఁడు: "పెద్దిదాసనిన రాణికి మిగుల గౌరవము. పెద్దిదాసు కవమానము చేసినచో రాణికిఁ జేసినట్లే'.

చీఁకటిపడినది. దాసివచ్చి మణిదీపముంచి వెడలినది. ప్రభువున కా మణిదీపము తనహృదయమునుండి వెలికిఁదీసిన పలలఖండమువలెఁ గనిపించినది. కనులు మూసికొనినాఁడు. రంగాజమ్మ సాక్షాత్కరించినది. కనులు తెరచినాఁడు. ఎదుట రంగాజమ్మచిత్రము. ప్రభువు రంగాజమ్మను మనసా వదలలేకుండనున్నాఁడు.

తరువాతఁ జాలనెలలు గడచినవి. విజయరాఘవనాయకుని పరిస్థితి విచిత్రముగనుండెను. ఆయన కొన్నాళ్ళెవరితోడను మాటాడఁడు. మరి కొన్నాళ్ళు పూర్వమువలెనే వ్యవహరించును. మనసులోఁ దనపాపమునుగూర్చి యాలోచించును. తాను తెలిసిచేసిన పాపముకాదు—అంతమాత్రముచేతఁ బాపముకాకపోవునా? తెలియక ముట్టుకొన్నచో నగ్ని కాలకుండునా? ఇది బహుకాలాగతవాంఛ చేత వచ్చినదోషము. అందుకనియే సత్కులప్రసూతఁ బెండ్లియాడవలయును. తెలిసి సంబంధము చేసికొనవలయును. జారత్వము దానియంతట నదియే దోషము. అందులో నపరిజ్ఞాతజన్మలైన స్త్రీలతోడి సంబంధము, తానే మహాపాపముగఁ బరిణమించునో! గురుదారసంగమ దోషమైనను జంద్రునకువలె రాజయక్ష్మాదివ్యాధులచేత ననుభవింపఁదగి యుండును. సోదరీసంగమజనిత మహాపాపముయొక్క స్వరూపమెట్టిదో, దాని పరిణామమెట్టిదో తెలియదు. దానికి ధర్మశాస్త్రములు, రాజు విధించెడి శిక్షయే లేదఁట. అట్టిపాపముఁ జేసినవా రెవరికివారు స్వయంవినాశనమార్గమును వెదకి కొనవలయును. నా స్వయంవినాశమును నే నెట్లు చేసికోగల్గుదును?

రాజునకప్పుడు పట్టమహిషిమీఁదఁ బట్టరానంత కోపమువచ్చెను. ఆమె నేమిచేయవలెను? మన్నారుదాసును జెఱయందుంచినదే చాలును. పట్టపురాణి రంగాజమ్మమీఁది కోపముచేతఁ దనకు మేలేచేసినది. కాకపోయిన నీ మహాపాపము తానింకెన్నాళ్ళు చేయుచుండెడివాఁడో!

ఒకసారి పెద్దిదాసుమీఁదఁ గోపమువచ్చును. తనసభలోఁ దన్నుఁబట్టు

కొని విష్ణ్వంశ తనయం దల్పిష్ఠమని చెప్పునా ? ఆయనను గాడిదమీఁదనెక్కించి యూరేగించవలెను. ఆయన మహాభక్తుఁడు, సాధుపుంగవుఁడు. ఆయనకుఁ జేసిన యవమానము తనకుఁ దిరిగికొట్టును.

మరొకసారి యెల్లి సోమయాజులుమీఁదఁ గోపమువచ్చును. ముల్లువలె వచ్చి దబ్బనమై తేరినాడని. అరణమువచ్చిన పండితునకు నలుబదియేండ్లయిన తరువాత నింత తెలివితేటలా ! ఎల్లి సోమయాజులకేమైన నవమానముఁజేసినచో రాణికింకను గోపమువచ్చును. కొడుకు చెఱలోనున్నాడని కుమిలిపోవుచున్న రాణి కింకను బాధఁగలిగించుట యెందుకు ? ఆ రాణి తన కింతబాధఁ గలిగించ లేదా ? ఎటుచూచినను లనప్రతిక్రియ బ్రాహ్మణులమీఁదికిఁ బోవుచున్నదే ! తానుచేసిన పాపమున కీ యూహగూడ ననుకూలముగనే యున్న దనుకొనెను.

ఒకసారి వెంకన్నమీఁదఁ గోపమువచ్చును. అతనిని బిలుచుకొనిరమ్మని సేవకుని బంపించినాఁడు. అతఁడువచ్చి వెంకన్నగారియిల్లు తాళమువేసి యున్న దని చెప్పెను. ఆయన గ్రామాంతరమునకేగి పదిదినములైనది. ఈ వెంకన్న తనయొద్ద నియోగియై తనయనుజ్ఞ లేకుండఁగనే యెచటికో వెడలిపోయి తన యిష్టమువచ్చినప్పుడు వచ్చుచుండును. ఇతఁడు తనశత్రువులయొక్క రహస్య చారుఁడేమో ! ఇతఁడు రహస్యచారుఁడేయైనచో నితనికిఁ గోటలోని గుట్టు మట్లన్నియుఁ దెలియును. తనపాపము తెలియును. ఇతఁ డెంతచేసినను జేయఁ గలడు. తంజాపురివినాశ మితనిచేతిలోనున్నది. మధురకుఁ గ్రొత్తగ రాజైన చొక్కనాథుఁడు తీవ్రకోపియఁట. ఉద్వేగప్రకృతియఁట. తంజాపురి రాజ్యము మీఁద నధికమైన కోపముగలవాడఁట. తంజావూరుతో వివాదము పెంచుకొను టెట్లా యని యాలోచించుచున్నాడఁట. రాయసము వెంకన్న వానిచాటు బంటైనచోఁ దంజావూరునకు వినాశకాలము సమీపించినదన్నమాట. గ్రహము లనుకూలముగ లేవు. దానికిఁ దగినట్లు పాపముపండియున్నది. యువరాజు చెఱలోనున్నాడు. తా నిట్టిస్థితిలో నున్నాడు. వెంకన్న యమునివద్దనుండు చిత్రగుప్తునివలె సర్వమును వ్రాసియుంచినాఁడు.

విజయరాఘవనాయకునకు బుద్ధియందుఁ బాపభీతి యెంతయున్నదో, మనస్సునందు విచారణ యెంతసాగుచున్నదో, అంతకోపము వచ్చుచున్నది.

ఎవరిమీఁద ? ఎందుకు ? ఎప్పుడు ? అది యెవరిమీఁదనో యెప్పుడో రాజునకే తెలియదు. వెంకన్నమీఁదమాత్రము కాదు. అతఁడు తప్పించుకొనిపోయినాఁడు గనుక. నలుగురునుగలసి ధనుస్సు విడనగఁ గత్తియుఁ బలకయుఁ బూని మింటికెగిరిన యభిమన్యునివలె నున్నది రాజుకోపము. ఎవరిమీఁదికి దూఁకునో !

౨౧

రంగాజమ్మకుఁ గనకాభిషేకమై యేఁడాదిపైని గడచినది. ఇంతవరకు సరస్వతీమందిరమున మరలఁ గవులగోష్ఠి జరుగలేదు. మరల విజయరాఘవ నాయకుఁడు కవులగోష్ఠికిఁ బండితులను, కవులను బిలిపించగ నందఱును సంతోషించిరి. లోకమునందు రాజుదుఃఖమునకు హేతువెవ్వరికిని దెలియదు. రాజునకు రంగాజమ్మమీఁద వైముఖ్యముకలిగిన దనుకొన్నారు కొందఱు. మరి కొందఱు రంగాజమ్మశీలమును శంకించిరి. యథార్థమైన కథ యెవ్వరికిని దెలియదు.

పెద్దిదాసునకు వార్తవెళ్ళినది. అది వట్టివార్తకాదు. రాజాధికారముతోఁ గూడినవార్త. పెద్దిదాసు తనలో నవ్వుకొనినాఁడు.

ఆనాడు సభ జరుగుచున్నది. కడచినసాయంతనమున రాజు కోనేటి దీక్షితచంద్రుని బిలిపించి యేదో మాటాడినాఁడు. సభ ప్రారంభించుటతోడనే, కోనేటి దీక్షితచంద్రుఁడు పెద్దిదాసుతో నిట్లనెను : "అయ్యా ! పెద్దిదాసుగారూ ! మహారాజుగారికిఁ దమయందు మిక్కిలి దయగల్గినది. తమకు సన్మానము చేయుటకే యీ సభ యేర్పడినది. తమ పాండిత్యము, తమ సాహిత్యసిద్ధాంతము మహారాజుగారు విచారించి మిమ్ము గౌరవించఁదలచుకొన్నారు."

పెద్దిదాసు : నేను పండితుఁడనుగాను. నా కొక సిద్ధాంతములేదు. భగవంతుఁడైన నారాయణునిమీద నాకుఁదోచినపుడు కొన్ని సంకీర్తనలు చేసికొందును. మహారాజులు నాకు సన్మానముఁ జేయఁదగినంత గుణము నాయందు లేదు.

కోనేటి : "అయ్యా ! పూర్వలాక్షణికులు తొమ్మిది రసములని యేర్పరచిరి. వాని యన్నింటిలో శృంగార రసము శిరోభూషణమని యాలంకారికు లంద

అంగీకరించినదే. ఆ పరమోత్తమమైన శృంగార రసము నాశ్రయించియే శ్రీ విజయరాఘవనాయకులవారి యాస్థానమునఁ గావ్యములు వ్రాయఁబడు చున్నవి. భరత శాస్త్రము ప్రయోగింపఁ బడుచున్నది. తమ రా శృంగార రసమునకు వ్యతిరేకులు. భరతుఁడు, మమ్మటుడు, ఆనందవర్ధనుఁడు, పండిత రాయలు మొదలైన యలంకార శాస్త్ర నిర్మాతలందఱు నంగీకరించిన యీ శృంగార రసమును మీరు కాదనుటకుఁ గారణమును జూపవలయును గదా! దానికి వేరే మీకేదైన సిద్ధాంతముండవలెను. ఆ సిద్ధాంతమును సభలో నిరూపించ వలయునని మహారాజుగారి యాజ్ఞ.

పెద్దిదాసు: మీరందఱు మహాకవులు. మీ పేరులు శాశ్వతముగ నుండును. నాకు శృంగార రసమన్న నిష్టములేదు. ఏ రసమన్నను నిష్టము లేదు. నాకు విష్ణు భక్తియే ప్రధానము. ఏ రసవాదములు నేను కాదనలేదు. నా కిష్టములే దంటిని. అది శాస్త్రార్థమైన విషయమైనచో సిద్ధముగ నున్నాను.

కోనేటి: ఇది మహారాజుగారితో వ్యవహారము అంత తేలికగఁ బోదు. కావ్యగతమైన రసము బ్రహ్మానందసబ్రహ్మచారి. విష్ణు సంకీర్తనముచేత నెట్టి యానందము శ్రోతకౌనగూడునో రసముగూడ నటువంటిదే. మీరు దాని నెందుకు కాదనుచున్నారో మాకుఁ దెలియుట లేదు.

పెద్దిదాసు: నేను కాదనుటలేదు.

అప్పుడు విజయరాఘవనాయకుఁ డందుకొని యిట్లనెను: "పెద్ది దాసుగారూ! ఇది నా యిష్టమనుట కెవ్వరికి నధికారములేదు. లోకమును ధర్మము శాసించును. ఆ ధర్మము రాజుద్వారా శాసింపఁబడును. పలువురకుఁ బలువిషయములయం దిష్టము. ఆ యిష్ట మధర్మము గావచ్చును. అప్పుడు రాజు శాసించును. అట్లే సారస్వత విషయమున నాలంకారికులు ప్రమాణము. అచట నిష్టము లేదు. లోకమునందు స్మృతి ననుసరించినట్లే సారస్వతమున నాలంకారికమార్గ మనుసరించవలెను. అందఱు రాజులు స్మృతులను మాత్రమే పాలింతురు. మేమలంకార శాస్త్రమునుగూడ పాలింతుము. మీరు రససిద్ధాంత మును ఖండించి మీ వాదమును నిలబెట్టుకొన్నచో మేము మిమ్ము సన్మా నింతుము. లేనిచో శిక్షింపవలసి వచ్చును."

పెద్దిదాసు : మహారాజా! మీ రససిద్ధాంతమే నాకుఁ దెలియదు. నేను దాని నెట్లు ఖండింతును?

కోనేటి : తెలియనిచో మేము చెప్పెదము. మీరు ఖండింపుడు.

పెద్దిదాసు : నాకు తర్క-వ్యాకరణములు రావు. నేను వాదన చేయలేను. నాకుఁ జేతనైనది భగవత్సంకీర్తనము. ఆ సంకీర్తనముఁగూడ శ్రీరాజగోపాల స్వామివారి సన్నిధినే చేయగల్గుదును. దినదినము నా కీర్తనము వినుచున్న శ్రీరాజగోపాలస్వామి నా కెప్పుడును సన్మానము చేయలేదు. నా సంకీర్తనము వినని శ్రీవిజయరాఘవనాయకులవారు నాకు సన్మానము చేసినచో నా మన్నారు దేవుఁడే చేసినట్లు సంతసింతును. ఎట్టి సన్మానమైనను స్వామి యనుగ్రహ ముండిననేగద జరుగును.

విజయరాఘవనాయకుఁడు తలవంచుకొనెను.

కోనేటి : పెద్దిదాసుగారూ! మీ రబద్ధము లాడుచున్నారు. కాళకవిగారు మీరు మహాపండితు లని చెప్పుచుందురు. నేడు బందీకృతులైయున్న యువ రాజులు గొప్ప పండితులు. గొప్ప కవులు. వారు మీ శిష్యులు. మీరు మహా రాజుగారి సభలో మీ పాండిత్యమును బ్రదర్శించుట కిష్టములేనట్లు మాట్లాడు చున్నారు. మహారాజుగారి యాజ్ఞ నిట్లు తిరస్కరించుట మీవంటి పెద్దలకుఁ దగదు.

పెద్దిదాసాలోచించెను. ఇది తన్ను రెచ్చగొట్టుటకే చేయఁబడుచున్నది. కోనేటి దీక్షితులు పైస్థాయిలో నందుకొనినాఁడు. ఆ వృద్ధభక్తునకుఁ గోపము వచ్చినది.

పెద్దిదాసు : అయ్యా! మీ రససిద్ధాంత మేదియో చెప్పుడు. నాకది తెలిసిన తరువాత నాకుఁ దోచిన మాటలు నేను చెప్పఁగల్గుదును.

రాజు తలయెత్తినాఁడు. దీక్షితులు దొమ్ము విడిచినాఁడు.

కోనేటి : చిత్తము. సముచిత లలిత సన్నివేశ చారుపైన కావ్యముచేత సమర్పితములైనవియు, సహృదయప్రవిష్టములు, ఆ సహృదయతతోఁ గూడు కొన్న భావనా విశేష మహిమవలన దుష్యంత శకుంతలాది భావములు జారి

పోవగా శకుంతలాది యాలంబన కారణములు, వెన్నెల మొదలైన యుద్దీపన కారణములు, కన్నీరు మొదలైన కార్యములు, వాని వెంటనేయుండు విచారాదులు నివి యన్నియుఁ గలసి యొక యలౌకిక వ్యాపారము జరుగును. ఈ యలౌకిక వ్యాపారము జరిగినప్పుడు శ్రోత యొక్క సహజమైన యజ్ఞానము తొలగిపోవును. అజ్ఞానము తొలగినంతనే వాని యాత్మ ధర్మము పూర్వము వలెఁ బరిమితముగాక స్వప్రకాశమును బొందును. ఆ యానందముతోఁ గలసి శ్రోతయందు పూర్వము వాసనారూపముగనున్న రతిభావము రసమగును. ఇది రససూత్రము. దీనిని మీరెట్లు కాదందురు ?

పెద్దిదాసు : అయ్యా ! ఒక్క సంగతిఁ జూడుడు. ఏ యలౌకిక వ్యాపారము జరిగి ప్రమాత ప్రమృష్టుడగుచున్నాడో యపుడు నిజస్వరూపానందము భాసించుచున్నది. తత్పూర్వమందున్న రతి కూడఁ బ్రమార్జితము కావలయును. అది కూడ నజ్ఞానాంశమే గనుక ఆ రతి రసమనుట యెట్లు ?

కోనేటి : ఆ రతి రసమగునో కాదో తరువాత విచారింతము. ఈ విభావానుభావవ్యభిచారి భావభావనలయొక్క చర్వణచేతఁ గలిగినయొక యలౌకిక వ్యాపారముచేత నజ్ఞానావరణము తొలగిపోవుచున్నదిగద. అజ్ఞానావరణము తొలగిపోవుటయే ప్రధాన విషయము. దానినే మేము రస మనుచున్నాము. దానినే రతి యనుచున్నాము. రతి ప్రారంభమునుండియు ననుస్యూతముగ వచ్చుచుండినదే.

పెద్దిదాసు : ఆ రసత్వస్థితిలో రతికూడ నశించవలయును. రతియే రస మనరాదు. ఆ సమయమునం దొక్క యానందమే మిగులును. ఆ యానందము కల్గుటకు నివియన్నియు సహకారులు గావచ్చును. రతి ప్రబల కారణము గావచ్చును. సర్వకారణములు నశించినప్పుడుగాని కార్యము సముద్భూతముగాదు.

కోనేటి : రతి కారణముగాదు. కార్యముగాదు. అది నిత్యమైన వస్తువు.

పెద్దిదాసు : అది జీవలక్షణము. రతియనుటతోడనే జీవుని యొక్క మోహలక్షణము మిగిలియున్నది.

విజయ : మరి, పెద్దిదాసుగారూ ! మీ సంకీర్తనములు చర్వణముఁ జేసి నందువలన జీవలక్షణము మిగులనిస్థితి యుండునా ?

పెద్దిదాసు : మహాప్రభువులు చిత్తగించవలెను. భక్తుఁడు పరమేశ్వరుని భావించును. ఆయన లీలావైభవములఁ గొనియాడును. ఆ భక్తునిలోఁ బ్రపత్తి యున్నది. అతని హృదయమునం దార్ద్రత యున్నది. పరమేశ్వర లీలా విభూతులను జర్వణ సేయుటవలన వానిలో నొక ప్రభావ ముదయించును. ఈ చర్వణము, ఈ సమార్ద్ర హృదయముఁ బరమేశ్వరవియోగము సహించలేని యొకతాపము. వీనియన్నింటి కలయికవలన నా భక్తునిలో నొకచిత్తవృత్తి కలుగును. ఆ చిత్తవృత్తి పరమేశ్వరభక్తియన్న నిత్యభావముతోఁ గూడుకొని స్వరూపానందముగఁ బ్రకాశించును. ఆ స్వరూపానందమునకు నీ చిత్తవృత్తికి భేదములేదు. భేదములేదనఁగఁ జిత్తవృత్తి నశించిపోయినదన్నమాట. స్వరూపానందమే మిగిలినదన్నమాట. ఈ చిత్తవృత్తి యాస్వరూపానందముగఁ బరిణమించిన దన్నమాట. ఇదియే సవికల్పకసమాధి. ఇన్నిరసములులేవు. ఉన్న దొక్కటిమేరసము. దానికి వేరే పేరులేదు. అది పరమేశ్వర భావనచేతఁ గలిగెడు నిరవధికానందము. ఇన్నిస్థాయిభావములులేవు. భక్తియనున దొకటియే యున్నది. మహారాజా ! నేను వైష్ణవుఁడను. మీరు వైష్ణవులు. ఆలంకారికుల యొక్క రసవాద మద్వైతవాదమును స్థాపించును. వైష్ణవమతమును స్థాపించదు. శ్రీమన్నారాయణుఁ డొకఁడే యున్నాడని ప్రభువులకుఁ దమకుఁ దెలియును. ఆ స్వామి భక్తుఁడనైన నాకుఁ దెలియును. ఆ రసవాదము వాదమేతప్ప, ఆ చిద్విశిష్టమైన స్థాయ్యుపహితరసానుభూతి బొందినవా రెవరో తెలియదు. పరమేశ్వరుని యనుగ్రహము పొందినవారి నందఱెఱుఁగుదురు. తమరు మున్న వర్షర్తువుస జేసిన మహాన్నదానమున నమ్మవారిముక్కఱ తమకందాలోని గంజి గంగాళములోఁ బడుట ప్రత్యక్షమైన విషయము. ఈ రసవాదము విష్ణుపారమ్యమును సాధించదు.

కోనేటి దీక్షితులు మాటాడలేదు. రాజు మాటాడలేదు. పెద్దిదాసు రాజునుబొగడి వైష్ణవమతమును బొగడి లౌక్యమునెరపినాడు. అతని మొగము వైదికముగ నున్నదిగాని లౌకికముగ లేదు. ఇతఁడు రాయసము వెంకన్నకు బంధువా ? అతని లౌకికము వట్టిలోకము నుండి పుట్టినది. ఈయన లౌకికము వేదధర్మమునుండి సముద్భవించినది.

కోనేటి దీక్షితులు తానేమియనవలెనో తెలిసికొనలేకపోయెను. ఆయనకుఁ గోపముగ నుండెను. ఇట్లనెను : "మహారాజుగారు మీకేమి సన్మానముచేయవలెనో యిదివరకే నిర్ణయించినారు. ఆ సన్మానము మీరులేకుండ జరుగును. మీరును వినఁగలరు."

రాజు సభనుండి వెడలిపోయెను. సభయంతయు విరమింపఁబడెను.

మరునాటి మధ్యాహ్నమున నొకగాడిద మొగమునకుఁ బంగనామములు పెట్టి దానిపై నొకపట్టుసేలువపరచి కాలికి బంగారపుటందె తొడిగి చిరతలు మూపునవేసి తంజాపురమున నూరేగించిరి. పెద్దిదాసుగారికి సన్మానమని రాజభటులు, మరికొందరును జెప్ప నారంభించిరి. ఆ యుత్సవమువెంటఁ గాళకవి వెళ్ళలేదు. ఆ యూరేగింపు పెద్దిదాసు తోటముందుఁ జాలసేపు నిలుచుండెను.

౨౨

ఊరేగింపు జరుగుచున్నపుడు పెద్దిదాసు తానువెళ్ళి యాగాడిద మీఁదఁ గూర్చుండు ననెను. కాళకవి మొదలైనవా రాపిరి. "స్వామీ! మీమనస్సులోనున్న శాంతి పామరులకుఁ దెలియదు. వారికిఁ దెలియకపోయినను మీకు నష్టములేదు. కాని తమరన్నచో గౌరవముగల మావంటివారికి చాల బాధగానుండును" అనిరి. పెద్దిదాసు సరేకానిం డనెను. ఆయన మొగమునందుఁ బరమేశ్వరుఁడు తాండవించుచుండెను.

నాడు ప్రొద్దుక్రుంకెను. పెద్దిదాసు రాజగోపాలపూజా విధానమును నిర్వర్తించి రాత్రి రెండుజాములు దాఁటువరకు సంకీర్తనముచేసి నిదురవోయెను. నాల్గవజామునఁ బెద్దిదాసున కొకకల వచ్చెను. ఆ కలలో నొకమహాభూతము, కరాళాకృతి, ఖడ్గధారిణి, వికారదంష్ట్ర రాజుమీఁదికిఁ బోవుచుండెను. పెద్దిదాసు ప్రక్కనుండెను.

పెద్దిదాసు : ఓసిభూతమా! ముందు నన్ను దినివేయుము. తరువాత రాజుమీఁదికిఁ బొమ్ము.

భూతము : నీతో నాకు సంబంధములేదు.

పెద్దిదాసు : నీవెవరవు?

భూతము : నేను సోదరీసంగమమహాపాపాకృతిని. నే నీరాజునేగాదు

రాజ్యమునంతను మ్రింగుచున్నాను. నాకిప్పు డెక్కువ శక్తి వచ్చినది. రాజు విష్ణుభక్తుని బరాభవించినాడు. దానితో నాశక్తి యిబ్బడి యైనది.

పెద్దిదాసు : ఆ విష్ణుభక్తుఁడను నేనే. ఆ దోషమును నే నుపసంహరించు కొనుచున్నాను.

భూతము : నా శక్తి నాకుఁజాలును.

పెద్దిదాసునకు మెలఁకువ వచ్చెను. కాళ్ళుకడిగికొని యాచమనముచేసి కనులుతుడిచికొని దుస్స్వప్న ఫలనాశకములైన శ్లోకములు చదివి మరల నిదురించెను. ఇంక నాలుగైదుగడియలలో నుషోరేఖ లుదయించును. పెద్దిదాసున కప్పు డింకొకస్వప్నము వచ్చినది.

పెండ్లి రాయబారములు జరుగుచున్నవి. మధురరాజైన చొక్కనాథుఁడు విజయరాఘవనాయకునకు జ్ఞానాంబికయందుఁగలిగిన యచ్యుతాంబికను భార్యగా నిమ్మని కోరెను. విజయరాఘవనాయకుఁడు తిరస్కరించెను. మీతో మాకు సంబంధము పనికిరా దనెను. రాయబారులు కోపముతో వెడలిపోయిరి. తరువాత నేదో పొగగాఁ గ్రమ్మెను. కొంతసే పేమిజరిగినదో తెలియలేదు. స్వప్నము మరల విస్పష్టత నందెను. పెద్దయుద్ధము జరుగుచుండెను. మన్నారుదాసు చెఱనుండి వదలిపెట్టఁబడెను. చొక్కనాథనాయకునియొక్క సేనానాయకుడు వెంకటకృష్ణప్పనాయడు యువరాజైన మన్నారుదాసు శిరస్సు నరికెను. విజయరాఘవనాయకుడు పట్టాకత్తిపుచ్చుకొని వెంకటకృష్ణప్పనాయనిమీఁదికిఁ బోయెను. కృష్ణప్పనాయడు విజయరాఘవనాయకునితల నరికెను. ఆకాశమునఁ దిరుగుచున్న విజయ రాఘవనాయకుని శిరస్సు "రంగనాథ, రాజగోపాల," యని స్మరణ చేయుచుండెను. పెద్దిదాసునకు వెంటనే మెలఁకువ వచ్చెను. ఆయన క[illegible]గమైన దుఃఖము కలిగెను. తూర్పునం దుషోరేఖలు పొడమినవి. "ఓహో! ఏమి పాడుకల! తెల్లవారుజామున వచ్చినస్వప్నము శీఘ్రముగ ఫలవంతమగు నని చెప్పుదురు." పెద్దిదాసు నిలువెల్ల నీరసించి కూర్చుండెను. ఆయన నోటి వెంట నీ రెండు మాటలు వెలువడినవి: "రంగనాథ! రాజగోపాల!".

[ANDHRA UNIVERSITY PRESS, WALTAIR]
[AAA4- Pub/65 (11-6-65) 10,000]

## Check List

| Book Number | AAD01C249 | Date | 18/10/2021 |
|---|---|---|---|
| Front Cover | Yes | Back Cover | YNO |
| Blank Pages | CI | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Sandhya | Cutting By | Sandhya |
| Scanned By | K.Yameema | Pages | 187 |